సచిత్ర విచిత్రం

# సాహసయాత్ర



దక్షిణాఫ్రికాలో ఉంటున్న మార్క్ షటిల్ వర్త్ ఈమధ్య అంతర్జాతీయ స్పేస్ స్టేషన్లో 14 రోజుల పాటు ఉన్నాడు. కజికిస్తాన్‌లోని బైకెనూర్‌లో ఆ స్పేస్ స్టేషన్ ఉంది.

రోదసిలో ప్రయాణం చెయ్యడానికి ఉద్యుక్తులైన వారిలో ఇతను 2వ వాడు. రష్యా స్పేస్ ఏజెన్సీ వారు ఆ ప్రయాణానికి సిద్ధపడిన వారికి 14 రోజులు అతి కఠినమైన శిక్షణ ఇచ్చి, రోదసికి పంపినందుకు 20 మిలియన్ డాలర్లు ఛార్జీగా తీసుకొంటున్నారు. మార్క్‌కి అనేక ప్రక్రియల ద్వారా క్షుణ్ణంగా వైద్య పరీక్షలు జరుగుతాయి సిమ్యులేటర్లో. అమెరికాకు చెందిన డెన్నిస్‌టిటో తొలి రోదసి ప్రయాణీకుడు.

# చతురర కతలు

## బబుల్‌గమ్ మెగా సీరియల్

అమ్మమ్మ పోయినప్పుడు నేను అమెరికాలో వుండటంతో నాకావిడ ఆఖరి చూపులు దక్కలేదు. ఆ తర్వాత కూడా నేనిండియాకి రావటం పళ్లేదు. అమ్మమ్మ ఆరో వర్థంతికి ఎలాగైతేనేం ఇండియా వచ్చాను. అమ్మమ్మ ఆబ్దీకానికి మామయ్యాల ఊరెళ్లాను.

పెద్ద మామయ్య ఇల్లంతా సందడిగా వుంది. ఎక్కడెక్కడి బంధువులూ వచ్చి వాలారు. ఎనభై ఆరేళ్లు బతికిన అమ్మమ్మ వర్థంతి మరి. అందర్నీ ఆవిడ ఎంతో ప్రేమగా చూసింది. అందరికీ చిన్నోచితకో బంగారం ఇచ్చింది. ప్రేమగా ఆడపిల్లల పురుళ్లన్నీ పోసింది. కోడళ్లనీ, కొడుకుల్నీ గారాబంగా చూసింది. వాళ్లకి పుట్టిన పిల్లల్నీ గారాబం చేసింది. అటువంటి అమ్మమ్మ సత్యవతమ్మంటే ఎవరికి మాత్రం ప్రేమ ఉండదు కనుక?

పెద్దమామయ్య పిండప్రదానం చేస్తుంటే, చిన్న మామయ్యలు జంధ్యాలు అటూ-ఇటూ మార్చుకుంటున్నారు. కోడళ్లు, పిండానికెదురుగా టి.వి. పెట్టి ఆన్‌చేశారు. అందులో 'బబుల్‌గమ్ మెగాసీరియల్' ఎడ్వర్టయిజ్‌మెంట్లు లేకుండా, ముందే వీడియో డిస్క్‌లో అరేంజి చేసినందువల్ల వస్తోంది. 'మమమాతృమూర్తీ పిండశ్చ సత్యవతీ మాతా నామ్నాని ఆత్మసంతృప్త్యర్థం బబుల్‌గమ్ మెగా సీరియల్ దర్శయామి' అని బ్రాహ్మలు మామయ్యలచేత అనిపించారు.



★ ★ ★

4 ఏప్రిల్ 2004

మా అమ్మమ్మకప్పటికి పెళ్ళికాలేదు. ఆవి డకప్పటికి పదహారేళ్లనుకుంటాను. కాలేజీలో చదువుతోంది. అప్పుడే ఈ 'బబుల్ గమ్' అనే మెగా సీరియల్ ఎవడో రచయిత 'డబుల్‌గమ్' అనే కలం పేరుతో రాసింది ప్రసారమవడం ప్రారంభమైంది. ఇంకేముంది? ఆ సీరియల్ చూసే కుర్రకారుకు బబుల్‌గమ్ నములుతున్నంత హుషారు పుట్టుకొచ్చింది. ఇక పెద్దవాళ్లకయితే బబుల్‌గమ్ నమలకపోయినా, అది నమలడంలో వున్న మజా అనుభూతులన్నీ అవగాహనలోకొచ్చి మురిసిపోతున్నారు. ఆవిధంగా ఆ సీరియల్ మొదలవడమే మిటి. జనాలందరూ టి.వి.కి గట్టిగా గమ్‌లా అతుక్కుపోతున్నారు.

'గమ్' అంటే హిందీ భాషలో 'బాధ' అనే అర్థంవుంది. గుమ్మిగా వున్న బబుల్‌గమ్ సీరియల్ దగ్గర జనాలతుక్కుపోతున్నారని గ్రహించి, చ్యూయింగ్ గమ్ కంపెనీలు స్పాన్సర్ చేసిన ఆ సీరియల్‌ను మిగతా పారిశ్రామికవేత్తలందరూ తమ ప్రొడక్ట్స్ అడ్వర్టయిజ్‌మెంట్లను అధిక మొత్తం వెచ్చించి, సబ్‌స్పాన్సరర్స్‌గా దూరిపోయి గుప్పిస్తూ పేస్ట్ అయ్యారు. అందువల్ల సీరియల్ పదినిముషాలూ- ఇరవై నిముషాలు అడ్వర్టయిజ్‌మెంట్లూ కొనసాగటంతో సీరియల్ ముందుకు కదలక ప్రేక్షకులు హిందీ గమ్‌లో పడ్డారు. అయినా బబుల్‌గమ్ సీరియల్ చూడ్డం ప్రేక్షకులెవరూ మానటం లేదు. సరిగ్గా సస్పెన్స్ వున్నచోట సీరియల్ ఆగుతోంది. ఇంకా... జరుగబోయే కథని ముందుగా ఊహించి చెప్పేవాళ్లకి స్పెషల్ ప్రైజెస్ వుంటున్నాయి. సీరియల్ చ్యూయింగ్ గమ్‌లా సాగిపోతోంది. అరేబియన్ నైట్స్ కథలూ, కాశీమజిలీ కథల్ని తలదన్నేస్తోంది. ఎవరైనా మధ్యలో సీరియల్ చూడ్డం మిస్సయితే, ఇరుగుపొరుగుల్నడిగి సీరియల్ గూర్చి వాకబుచేసి తెలుసుకుంటున్నారు. మా అమ్మమ్మ పరిస్థితి కూడా తద్భిన్నంగా ఏంలేదు. జరిగిన కథను నెమరేసుకుంటూ, జరగబోయే కథను ఊహించుకుంటూ తాను మిస్ అయిన బిట్స్‌ను ఇతరులనడిగి తెలుసుకుని మాసికలు వేసుకుంటూ బతికేస్తోంది.

ఆరోజుల్లోనే మా అమ్మమ్మకి పెళ్లైంది. పిల్లల్ని కంది. పిల్లల పెళ్ళిచేసింది. మనమల్నెత్తింది. అయినా సీరియల్ పూర్తికాలేదు. మా అమ్మమ్మకా సీరియల్‌పైనున్న ఉత్సుకత వీసమంతైనా చావలేదు. అడపాదడపా సీరియల్‌పై ఆమె రాసిన ఉత్తరాలకి చిన్నాచితకా బహుమతులొచ్చాయి మరి! ఒకసారైతే వెయ్యి బబుల్‌గమ్స్ బహుమతిగా వచ్చాయి.

మా తాతయ్యకీ ఆరోజుల్లో ఆ సీరియల్‌పై క్రేజ్ వుండటంతో వాళ్ళిద్దరి వివాహం సీరియల్ చూస్తుండగా జరిగింది. శోభనం గదిలో కూడా టి.వి. సీరియల్ ఆన్ చేసుకుని చూసుకున్నార్ట! ఇలా వైనవైనాలుగా ఎన్నో కథలు మా అమ్మమ్మకీ ఆ సీరియల్‌కీ ఉన్న బంధాన్ని ఇరుగుపొరుగులూ, ఇంట్లోని బంధుమిత్రులూ అందరూ చెప్పుకునేవారు. చివరిరోజుల్లో అమ్మమ్మ ఆస్పత్రిలో వుండగా కోడళ్లనీ, కూతుళ్లనీ సీరియల్ కథ గూర్చి వాకబు చేస్తుండేది. 'ఈ సీరియల్ పూర్తికాకుండానే నేను చచ్చిపోతానేమోనే?' అంటూ దిగులు పడేది. ఇక మనసుండబట్టలేక "కథంతా మొత్తం చెప్పెయ్యి బాబూ" అంటూ 'బబుల్‌గమ్' మెగాసీరియల్ కథా రచయిత అయిన 'డబుల్‌గమ్'గార్కి ఓ ఉత్తరం కూడా రాసిపారేసింది. అలా ఉత్తరం రాసిన మర్నాడే తన ఎనభైఆరోఏట మా అమ్మమ్మ స్వర్గస్తురాలైంది. ఆమె ఆత్మతృప్తి కోసం ఇప్పుడా మెగా సీరియల్‌ని ఆమె పిండానికి చూపిస్తున్నారని నాకర్థమైంది.

ఆ 'మెగా' సీరియల్‌ని చూస్తున్నంతసేపూ నాకు తెలీని ఒక వ్యక్తి, మాకెవరికీ

బంధువర్గంలో పరిచయం లేని వ్యక్తి, కం టతడి పెడుతూ టి.వి.కేసి కన్నార్పకుండా చూస్తున్న ఓ విచిత్ర వ్యక్తిని నేను గమనించాను. నేను దగ్గరకెళ్ళి ఆయనకు నన్ను పరిచయం చేసుకుని 'అయ్యా! తమరెవరో నాకు తెలీదు. దయచేసి తమరెవరో చెప్పరా? ' అనడిగాను.

ఆ వృద్ధుడు నన్ను తేరిపార చూసి "నేనెవర్నో చెబుతాను. కాని, నా గురించి మీరెవరికీ చెప్పకండి! అందరూ కలిసి నన్ను తన్నే ప్రమాదముంది. ఈ మెగా సీరియల్ రాసిన రచయిత 'డబుల్‌గమ్' గాడ్ని నేనే!! నా అభిమాని అయిన మీ అమ్మమ్మ వారసులకీ లక్ష రూపాయలు బహుమతిగా ఇద్దామనొచ్చాను" అని చెప్పాడు.

– రాంరళి

## 'ఫోన్' కాల్

క్షణం తీరిక లేకుండా నెల రోజులుగా షూటింగులు, స్టోరీ డిస్కషన్లు, లొకేషన్లు ఎంపిక చెయ్యడానికి తిరగడం, మ్యూజిక్కు

అతనికి నిద్రాభంగం కలిగిస్తూ టెలీఫోన్ మోగింది. సమయం రాత్రి పన్నెండు గంటలు దాటింది. విసుగ్గా లేచి ఫోన్ అందుకున్నాడు.

"హలో! నేను సార్! రాజోలు దొరబాబుని. బావున్నారా? "




సిటింగులు విరామంలేకుండా పనిచేసి పని చేసి ప్రముఖ సినీ దర్శకుడు భార్గవ అప్పుడే ఇల్లు చేరాడు. అలసిన శరీరం విశ్రాంతిని కోరుతోంది. బెడ్డుమీదికి చేరి నిద్రకు ఉపక్రమించాడు.

"ఆ! చెప్పండి!"

"ఇప్పుడే ఈటీవీలో మీ సినీమా 'ప్రేమగోదావరి' చూశానండి. చాలా బావుంది సార్! గోదావరిని అద్భుతంగా చూపించారు. ఆ పల్లె వాతావరణం, కామెడీ అదిరిపోయింది. మ్యూజిక్ బ్రహ్మాండం! ఇప్పటికి 'ప్రేమగోదావరి' పాతికమార్లు చూశానండి. మళ్లా

ఈవేళ చూసినా కొత్తగానే వుంది"

ఆ ప్రవాహాన్ని ఆపడానికి ప్రయత్నంగా "మీరేం చేస్తుంటారు? " అడిగాడు భార్గవ.

"ఫైనాన్సు వ్యాపారమండి! ఈ సినీమా మీరు ఇరవై సంవత్సరాల క్రితం తీసినా ఎక్కడా పాతదనం లేదండి. అప్పుడు మీరు తీసిన ట్రెండు ఇప్పటికి పరిశ్రమ పట్టుకుంది మీరు గొప్ప...!"

దొరబాబు అరగంటకు పైగా భార్గవను వాయించి వదిలాడు. సహనంగా భరించి తిరిగి బెడ్డుమీదికి చేరాడు.

దొరబాబు ఫోన్‌కాల్ పుణ్యమా అని నిద్రకాస్తా ఎగిరిపోయింది. ఎన్నిసార్లు ఫోన్ నెంబర్లు మార్చినా ఈ కాల్స్ బాధ తప్పడంలేదు. వీళ్ల నెంబరు ఎలా సంపాది స్తారో! అన్నది భార్గవ్‌కి అర్థంకాని విష యమే. వెర్రి అభిమానంతో ప్రాణాలు పోగొ ట్టుకునే అభాగ్యులు కొందరైతే, అభిమానం పేరుతో సమయం, సందర్భం లేకుండా విసి గించేవాళ్లూ, వేధించేవాళ్లూ మరికొందరు. ఈ ధోరణికి అడ్డు కట్ట వేసేదెలా?

ఆ ఆలోచనలతో ఎప్పటికో నిద్రపట్టింది భార్గవకి.

భార్గవకి చలన చిత్రసీమలో మంచి క్రియేటివిటీ ఉన్న దర్శకుడుగా పేరుంది. అతని చిత్రాలు ఆహ్లాదభరితంగా వుంటాయి. ఇరవైరెండు సంవత్సరాల వయ స్సులోనే ఉత్తమ దర్శకుడిగా జాతీయస్థా యిలో బహుమతిని అందుకున్నాడు. స్వత హాగా మంచి రచయిత కావడంవల్ల, సంగీ తంలో మంచి ప్రవేశం ఉండడంవల్ల అతని చిత్రాలు మధురమైన సంగీతం, సున్నిత మైన హాస్యం మేళవించిన, రమణీయమైన ప్రకృతి దృశ్యాలతోటి భావుకత ఉట్టిపడుతూ ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని చేస్తాయి. అతని చిత్రాలలో స్టార్సు వుండరు. ఆర్టిస్టులు మాత్రమే వుంటారు. తన ప్రజ్ఞతో అసంఖ్యా కంగా అభిమానులను సంపాదించుకోగలి గాడు. పరిశ్రమలో నిర్మాతలకు మినిమమ్ గ్యారెంటీ దర్శకుడు భార్గవ అని పేరు.

ఉదయం ఆరుకల్లా ఫోను మోగింది!

రాత్రి నిద్రలేకుండా చేసిన దొరబాబు కాదు గదా! అనుకుంటూ ఫోను తీశాడు భార్గవ.

"గుడ్‌మార్నింగ్ సార్! కంగ్రాట్యులేషన్స్! నేను రాజోలు దొరబాబునండి! ఈనాడు డైలీ సినిమా పేజీలో మీ కొత్త సినీమా న్యూస్ చూశానండి! సినీమాకు పేరేంపెడు తున్నారు? షూటింగు ఎప్పుడు మొదలవు తుంది? " దొరబాబు ప్రశ్నల వర్షం కురిపి స్తున్నాడు.

"చూడండి దొరబాబుగారూ! రాత్రే మీకు చెబుదామనుకున్నాను. లక్కీగా మీరు ఫోన్ చెయ్యడం చాలా మంచిదయ్యింది. అయామ్ వెరీ హేపీ. ఫస్టు షెడ్యూలు రేపు టెన్తున ప్రారంభిస్తాం. నాకు అర్జంటుగా రెండు లక్షలు చేబదులు కావాలి. జస్టు నెల రోజులు అడ్జస్టుమెంటు అంతే! మీ వంటి అభిమానుల్ని అడగగలంగానీ పైవాళ్లను అడగలేంగదా! డి.డి.ని కొరియర్‌లో పంపిం చండి. మీరు ఎంత తొందరగా పంపిస్తే అంత సంతోషం" అన్నాడు భార్గవ.

అవతల దొరబాబు స్వరంలో నీరసం చోటుచేసుకుంది. "అలాగే సార్! అలాగే" అంటూ కంగారుగా ఫోన్ పెట్టేశాడు. భార్గవ గుంభనంగా నవ్వుకున్నాడు. భార్గవ ఊహించినట్లుగానే దొరబాబునుండి మళ్లీ ఫోన్ లేదు.

– వి.వి.సుబ్బరాజు

---

## తెలివి

"అమ్మా 'తెలివి' కొంటారు కదా!" ముక్కుపుటాలు ఎగరేస్తూ జేవురించిన ముఖంతో ఉక్రోషంగా అన్నాడు అప్పుడే స్కూల్‌నుండి వచ్చిన ఐయిదేళ్ల రమేష్.



చతుర... 7

అత్తగారు పోయి సంవత్సరం అయింది. ఆస్తులు పంపకాలకోసం ఊరు వెళ్లి అప్పుడే వచ్చారు మావారు. ఆయన కోపంగా ఉన్నారు.

'వీడు రోజూ ఏదో కహానీ మోసుకొస్తాడు' అనుకుని "నాన్నగారు పడుకున్నారు. చప్పుడు చెయ్యకు, నడు బట్టలు విప్పి అన్నం తిందువుగాని" అంటూ వాడిని బాత్ రూంకి తీసుకెళ్లి మొహం, చేతులు, కాళ్లు కడిగి, బట్టలు మార్చి అన్నం కలుపుకొచ్చి వాడిని తీసుకుని వరండాలో కూర్చుని అన్నం తినిపిస్తున్నాను.

ఆయన ఎక్కడ లేస్తారో, ఏం కేకలేస్తారో అని కంగారు పడుతున్నాను.

ఆయనకి రమేష్ అంటే ప్రాణం. వాడిమీద చీమ పాకిందంటే తన మీద ఏనుగు పాకినట్లు బాధపడిపోతారు.

వాడికి జ్వరం వస్తే ఆఫీసుకి సెలవు పెట్టుకుంటారు. "వాడికి అసలా జ్వరం, ఎందుకొచ్చిందీ, వాడిని బయటకు వెళ్లనీకు" అంటూ నన్ను తిడుతూ వుంటారు.

అది విని వాడు "అమ్మా! నాకు 'అసలా జ్వరం' వచ్చింది కదా!" అంటాడు అదేదో జ్వరం పేరన్నట్లు.



వాడు బుంగమూతి పెట్టి అన్నం ముద్ద నోట్లో పెట్టడం లేదు.

"ఏమైందిరా నీకు! ఎవరేమన్నారు? " అంటూ ఉక్రోషంతో ఉడికిపోతున్నట్లున్న వాడిని ఒడిలోకి తీసుకుని బుజ్జగించేటప్ప టికి వాడు నా ఒళ్లో పడుకుని భోరున ఏడ వడం మొదలుపెట్టాడు.

నేను భయపడి వాడిని బుజ్జగిస్తూ,

8 ఏప్రిల్ 2004

ఇంతలో వాడి ఏడుపుకి ఆయన లేవనే లేచారు. ఒక్క ఉదుటున వరండాలోకి వచ్చి "ఎందుకేడుస్తున్నాడు? ఏమ్మా ఎవరేమ న్నారు? " అంటూ వాడిని ఎత్తుకున్నారు.

వాడు రాగం ఇంకా ఎక్కువ పెంచి వెక్కుతూ "నాన్నా! స్కూల్లో టీచరేమో 'తెలివి కొంటారా? ' అని నవ్వింది. క్లాసులో పిల్లలంతా 'వీడు తెలివి కొంటాడంట అంటూ చప్పట్లు కొట్టి నవ్వారు. నువ్వు వచ్చి వాళ్లకి తెలివి కొంటారని చెప్పు"

అంటూ వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

మావారు, నేను వాడివంక అయోమ యంగా చూశాము విషయం అర్థంకాక!

ఆయనే వాడిని బుజ్జగిస్తూ "అసలు ఏమ యిందమ్మా! తెలివేమిటి, కొంటమేమిటి? ఏం జరిగిందో చెప్పు నాన్నా!" అన్నారు.

దాంతో వాడికి చిర్రెత్తుకొచ్చి "నీకు కూడా తెలివి కొంటారని తెలియదా! అమ్మా! నువ్వే కదా నాకు తెలివి కొని తినిపిస్తావు! మరి తెలివి కొంటారా అంటావే!" అంటూ ఆరున్నొ క్కరాగం ఆలపిస్తూ కిందపడి దొర్లసాగాడు.

అప్పుడు నాకు స్ట్రైక్ అయింది. కాని అది ఆయనకి ఎలా చెప్పాలి. ఈ పరిస్థితిలో అసలు సంగతి చెపుతే నన్ను తిడతారు. ఇక లాభం లేదు. ఆయన టెన్షన్‌లో ఉన్నారు. వీడు చూస్తే ఏడుపు విడిచిపె ట్టేలా లేడు. స్కూలు దగ్గర్లోనే ఉంది. మావాడు ఆఫ్‌డే వచ్చేశాడు. పెద్ద పిల్లలకి చెప్పడానికి టీచరు ఇంకా స్కూల్లోనే ఉంటుంది. ఇక లాభంలేదు అనుకుని వాడిని భుజాన వేసుకుని "వాడిని స్కూలుకి తీసుకెళ్లి అసలు విషయం కనుక్కొంటాను గాని మీరు పడుకోండి" అంటూ స్కూలుకి బయలుదేరాను.

స్కూల్లో టీచరు నవ్వుతూ పలకరిం చింది.

అసలు సంగతేమిటంటే! మావాడు చాలా తెలివైన వాడు. టీచరు ఏ ప్రశ్న అడిగినా వాడు వెంటనే జవాబు చెబుతాడట. టీచరు ప్రేమగా వాడి జుట్టు నిమురుతూ "ఇంత తెలివి ఎక్కడనుండి వచ్చిందిరా" అంటూ అడిగిందట.

మావాడు "మా అమ్మ తెలివి కొని తిని పిస్తుందికదా! అందుకే నాకు తెలివి బాగా వచ్చింది" అన్నాడట. దాంతో అంతా నవ్వా రట.

"సరస్వతి లేహ్యం కొని వాడికి తినిపి స్తాను. అది కొంచెం చేదుగా ఉండి వాడు తిననంటే 'ఇది తెలివిరా! ఇది తింటే బాగా చదువు వస్తుంది' అంటూ తినిపిస్తాను. అప్పటినుండి వాడు దానిని 'తెలివి' అనడం మొదలుపెట్టాడు. దానికి అందరూ నవ్వడం ఎందుకు టీచర్! వాడు చాలా హర్ట్ అయ్యాడు కదా! తెలివైన పిల్లల్ని సున్ని తంగా ట్రీట్ చెయ్యాలి. వాళ్ల మనసు చాలా సెన్సిటివ్‌గా ఉంటుంది. చిన్నదానికే చాలా హర్ట్ అవుతారు" అని టీచరుని మెల్లగా మందలించాను.

టీచరు సారీ చెప్పి వాడిని ఎత్తుకుని "మీ వాడు క్లాస్ ఫస్టండి. రమేషంటే మాకందరికీ చాలా ఇష్టం" అంటూ వాడిని ముద్దుపెట్టు కుంది.

దాంతో వాడు తేలిగ్గా ఊపిరి పీల్చుకు న్నాడు.

– సి. హెచ్. రాధిక





# చతుర

సంపుటి: 27

సంచిక: 3

ఏప్రిల్: 2004

315వ సంచిక

ఆమె అతడిని ప్రాణప్రదంగా ప్రేమించింది. పెళ్ళంటూ చేసుకుంటే అతడినే చేసుకుంటాను అనుకుంది. అతను కూడా తనమీద ఇష్టంతోనే ఉన్నాడనుకుంది. కానీ... ఓసారి... అతడింటికి వెడితే... "నీలో ఏ టాలెంటూ లేదు. ఏది సాధించాలన్నా షార్ట్‌కట్, మేడ్ ఈజీ మెథడ్స్ వెతుక్కుంటూ వుంటావు. డబ్బు సంపాదించాలంటే చాలా కష్టం. అందుకే నాలాంటి డబ్బున్నవాడిని వలలో వేసుకుని పెళ్ళి చేసుకుంటే చిటికెలో ధనవంతురాలినై పోవచ్చుననుకున్నావు" అంటూ నానామాటలూ అన్నాడు. ఆమె నిశ్చేష్ట అయింది. ఆమె మొహంమీదే అతడు తలుపులు మూసుకున్నాడు. దాంతో... ఆమె ఏం చేసింది? అతడు తప్ప ప్రపంచంలో తనకెవరూ లేరనుకున్న ఆమె అతడిని సాధించగలిగిందా? అతడు ఆమెను అలా పరాభవించడం వెనక ఉద్దేశ్యమేమిటి?

ఎదిగీ ఎదగని యువత మనస్తత్వాలను అక్షరబద్ధం చేసిన మునిపల్లె లక్ష్మీరమణ కుమారి రచన 'పావని' ఈ నెల చతుర సమగ్ర నవల




కథా నిలయం
పావని
- మునిపల్లె లక్ష్మీ రమణకుమారి

ది గోవా బీచ్...

దూరాన కొబ్బరి చెట్లు గాలికి ఊగుతూ గలగలలాడుతున్నాయి. సముద్రంలో అలలు ఎగిసిపడుతున్నాయి. ఆకాశంలో సూర్యబింబం ఎర్రగా మెరుస్తోంది. ఇసుకలో స్విమ్మింగ్ డ్రెస్‌తో కొందరు పడుకుని ఉన్నారు. హిప్పీలు కొందరు మత్తుమందులో, మరేవో సిగరెట్లు తాగుతున్నారు. విదేశీయులు, స్వదేశీయులు అంతా కలసిపోయి దాదాపు ఒకేలా కనిపిస్తున్నారు. కొందరు మద్యం సేవిస్తున్నారు. అక్కడ వాతావరణం మొత్తం ఉల్లాసంగా మరో ప్రపంచంలా కనిపిస్తోంది.

ఆ తమాషా వాతావరణంలో ఇంకా తమాషాగా ఒక యాభైమందిదాకా అమ్మాయిలూ, అబ్బాయిలూ ఉన్నారు. వాళ్లంతా పచ్చి తెలుగులో మాట్లాడుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నారు.

శ్రీహర్ష మాత్రం ఒక్కడూ కూర్చుని, మౌనంగా అందర్నీ చూస్తున్నాడు. అతనూ కాలేజీ బృందంతోనే వచ్చాడు. అతను వచ్చాడని పావని వచ్చింది. ఇద్దరూ అదే కాలేజీలో బి.కామ్ చదువుతున్నారు. వచ్చిన బృందంలో లవర్స్ వాళ్లదారినవాళ్లు తిరుగుతున్నారు. జతలేని అమ్మాయిలూ, అబ్బాయిలూ గ్రూప్స్‌గా తిరుగుతున్నారు. రకరకాల డ్రెస్సులతో సీతాకోక చిలకల్లా కనిపిస్తున్నారు. హర్ష పక్కనే పావని కూర్చుని ఇసుకలో పిచ్చిగీతలు గీస్తోంది.

ఇంతలో కొందరు అబ్బాయిలు పరుగెత్తుకుని హర్ష దగ్గరకి వచ్చారు.

"ఎందుకు వస్తావు బాబాయ్ బీచ్‌కి? " ఒకడు వెటకారంగా నవ్వుతూ అడిగాడు.

"సముద్రాన్ని చూడటానికి" హర్ష జవాబిచ్చాడు. అంతా నవ్వారు.

"అందుకా? "

"అవును. అందుకే. మీరెందుకు వస్తున్నారు? "

"మేము కలర్స్‌నీ, ఫిగర్స్‌నీ చూసి ఆనందించటానికి వస్తున్నాం"

"అదేదో హైదరాబాద్‌లోనే చేయవచ్చుగా? " హర్ష అడిగాడు.

"ఇక్కడ స్విమ్మింగ్ డ్రెస్సుల కలర్స్ అక్కడ ఏ స్విమ్మింగ్ పూల్‌కో వెళితేగానీ కనిపించవు. నాలాటివాళ్లకి అది కుదిరే పనికాదు. వెళ్ళినా ఒకళ్లిద్దరుంటారేమోగానీ ఇంత గుంపులుగా రకరకాల కలర్స్ చూడాలంటే ఇది బెస్ట్‌ప్లేస్"

వాళ్లు మాట్లాడుకుంటుంటే రాజేష్ అటువైపు పరుగెత్తుకుంటూ వచ్చాడు. మనిషి ఆయాసంతో రొప్పుతున్నాడు.

"ఆగరా నాయనా. ఏమైంది? పెద్ద పాము ఏదన్నా కనబడిందా? " అడిగారు ఫ్రెండ్స్.

"పాము కాదు. వింత. విచిత్రం"

"ఏమిటది? ఏదన్నా గారడీ ప్రదర్శనా? "

"కాదు... అక్కడ హిప్పీలు కొందరు" రాజేష్ ఆయాసంతో మాట్లాడలేకపోయాడు.

"ఊ... హిప్పీలు కొందరు... ఏంటి విషయం"

"స్ట్రీకింగ్ చేస్తున్నారు. ఆడవాళ్లు కూడా ఉన్నారు" రాజేష్ చెప్పేశాడు.

"స్ట్రీకింగ్ అంటే" వెంకట్ అర్థంకాక అడిగాడు

"స్ట్రీకింగ్ అంటే దిగంబరంగా పరుగెత్తటం"

"ఆ..." అంతా ఆశ్చర్యంగా నోరు తెరిచారు.

"అవును. పదండి చూద్దాం" అంతా ఒక్క పరుగు తీశారు.

"హర్షా. నువ్వురావా? " వెంకట్ వెనక్కు తిరిగి ప్రశ్నించాడు.

"ఉహూ" హర్ష అడ్డంగా తల ఊపాడు.

"వాడి సంగతి తెలుసుగా. గౌతమబుద్ధుడు. ఇంకా ఉంటే మనల్ని కూడా తిట్టిపోస్తాడు. వాణ్నెందుకు కదుపుతావు. నడు నడు" అరిచాడు రాజేష్ పరుగెత్తుతూనే.

అంతా ఒక్కసారిగా రాజేష్ వెంట పరుగుతీశారు.

హర్ష చలించకుండా అలాగే కూర్చుని అలలు ఎగిసిపడటాన్ని గమనిస్తున్నాడు. పావని అతన్నే చూస్తూ కూర్చుంది. పావని ఎర్రటి పట్టుపరికిణీ, ఎర్రటి పట్టుజాకెట్టు ధరించి ఉంది. ఆకుపచ్చటి జార్జెట్ ఓణీ, ఎర్ర గులాబీచుట్టూ పచ్చటి ఆకుల్లా అందంగా అమిరిపోయింది. తీర్చిదిద్దినట్లున్న కళ్లు కాటుకతో ఇంకాస్త అందంగా కనిపిస్తున్నాయి. కొందరు విదేశీయులు ఆమెవైపు వింతగా, కొంతమంది ఆరాధనగా చూస్తూ వెళ్తున్నారు. హర్ష మాత్రం ఆమె ఉనికినే గమనించనట్లు ఏదో ఆలోచిస్తున్నాడు.

అతను ఏం ఆలోచిస్తున్నాడో అడిగేందుకు పావనికి ధైర్యంలేదు. అసలు అతను ఏమి ఆలోచిస్తున్నాడో అన్నది ఆమెకి అర్థంకాలేదు. నిజానికి అది ఆమె ఊహకి అందని విషయం. అప్పుడు అతను ఎవరి గురించి ఆలోచిస్తున్నాడో ఆమెకి తెలిస్తే ఆశ్చర్యంతో నోరు తెరిచేసేది.

అప్పుడతను తను చిన్నతనంలో కేరళ సముద్రతీరంలో చూసిన సంఘటన గురించి ఆలోచిస్తున్నాడు.

అప్పుడతనికి పదేళ్లు. అతని బంధువులు కేరళలో పనిచేస్తుండేవాళ్లు. సెలవులకి సరదాగా గడపాలని హర్షని తీసుకుని అక్కడికి వెళ్లారు. పదిరోజులు అక్కడ ఉన్నారు. పరిసరాలు కాస్త అలవాటు అయ్యాక హర్ష తను ఒక్కడూ సముద్రంవైపు వెళ్ళిరావటం మొదలుపెట్టాడు. అందరూ వెళ్లేవైపు కాకుండా తీరంవెంబడి నడిచి కాస్త నిర్మానుష్యంగా ఉన్నవైపు వెళ్ళి, గవ్వలూ అవీ ఏరుకుంటూ, అలల్ని చూసి ఆనందిస్తూ కాలక్షేపం చేసేవాడు.

ఒకరోజు ఒక చిత్రమైన దృశ్యం కనబడింది. సముద్రజలాలకి దగ్గరలో ఒక తల కనిపించింది. ఎవరో మనిషి ఇసుకలో నిలువెల్లా మెడవరకూ పాతిపెట్టబడి ఉన్నాడు. అతని ఎదురుగా ఇంకొక వ్యక్తి కూర్చుని ఉన్నాడు. అతను ఇసుకలో పాతిపెట్టిన వ్యక్తివైపు తీక్షణంగా చూస్తున్నాడు.

ఆ దృశ్యం ఎందుకోగానీ ఆ వయసులోనే హర్షకి మామూలు దృశ్యం కాదని అర్థమైపోయింది. ఆ సముద్రతీరంలో కొంతమంది ఇసుకలో పడుకుని జలగలతో రక్తం పీల్పించుకునేవాళ్లూ, రకరకాల రోగాలకి ఇసుకలో అనేకరకాల అభ్యాసాలు చేసేవాళ్లూ, అలాటి వాళ్లని ఎంతోమందిని చూశాడు. కానీ ఇలాటి దృశ్యం మాత్రం ఎన్నడూ చూడలేదు.

అక్కడంతా నిర్జనంగా ఉంది. వాళ్లు ప్రమాదకరమైన వ్యక్తులేమోనని హర్షకి అనుమానం కలిగింది. వాళ్లు తనకేమన్నా అపకారం చేస్తారేమోనని భయంవేసింది. నెమ్మదిగా వెనక్కు తిరిగి వెళ్ళిపోదామనుకున్నాడు.

కానీ బాల్యచాపల్యం, కుతూహలం అతన్ని కదలనివ్వలేదు. ఏం జరుగుతోందో చూద్దాం అనిపించింది. అక్కడ ఒక పాడైపోయిన బోట్ ఉంది. నెమ్మదిగా దాని వెనక్కు చేరి, ఏం జరుగుతోందో గమనించసాగాడు.

ఇసుకలో ఉన్న వ్యక్తి శిష్యుడు, అతని ముందు కూర్చున్న వ్యక్తి గురువు అని అర్థమైంది. ఇసుకలో అతను పాతిపెట్టబడి ఉన్నచోటు సముద్రజలాలకి దగ్గరలో ఉంది. అందువల్ల అలలు వేగంగా వచ్చి అతని మొహాన్ని బలంగా తాకి వెళుతున్నాయి. అతను ఏమీ చలించకుండా నిశ్చలంగా గురువువైపే చూస్తున్నాడు.

గురువు ఎంతకీ నోరు విప్పటం లేదు. ఏం మాట్లాడటం లేదు. శిష్యుడు శాంతంగా, సహనంగా అలాగే నిశ్చలంగా చూస్తున్నాడు. ఎండ వేడి పెరుగుతోంది. ఆ ఇసుకలో పాతిబెట్టబడి ఉన్న శిష్యుడి శరీరం ఎంత ఉడికిపోతోందో అనిపించింది హర్షకి.

## సచిత్ర విచిత్రం



# నీటిపై ఊయల

ఉవ్వెత్తున ఎగసి పడే కెరటాలపై ఊయల ఊగుతూ, అమిత వేగంతో ఉరకలు వేసే నీటిపై ప్రయాణం చెయ్యడం ఎటువంటి అనుభూతిని అందిస్తుందో మనం ఓ ఊహా చిత్రాన్ని కళ్లముందు ఆవిష్కరించుకోవచ్చును. ఈ అలలపై ఊయల ఊగడం అనేది ఓ క్రీడ! అది అత్యంత సాహసోపేతమైంది. ఎంతో ఉద్వేగభరితం, ఆనందదాయకం.

ఆ క్రీడలో పాల్గొనే వారు రబ్బరుతో తయారు చెయ్యబడిన డింగీల వంటి సాధనాన్ని ఉపయోగిస్తారు. ఈ క్రీడ మొదట 1980లో దక్షిణాఫ్రికాలో కనిపెట్టడం జరిగింది. ఆ డింగీలకు 50 హార్స్‌పవర్‌గల మోనోటైప్ ఇంజన్‌లు ఉంటాయి. ప్రతీ డింగీలో ఇద్దరు ఉంటారు. ఒకరు పైలట్, మరొకరు సభ్యుడు. 10 మంది పోటీదారులు ఒక గ్రూపుగా ఈ ఆటలో పాల్గొంటారు. అతి తేలిగ్గా ఉండే ఈ సూపర్‌కిట్ అనే ముద్దు పేరుగల డింగీ, కెరటాలపై అనేక మీటర్ల ఎత్తుకు ఎగిరి, తిరిగి సముద్రంపై పడుతూ ఉంటుంది.

ఒక్కొక్క సారి నీటి ఉద్ధృతికి సూపర్‌కాట్ నీటిపై అతి ఎత్తుకు ఎగరడం వలన కొందరు డింగీల నుంచి సముద్రంలో పడుతూ ఉంటారు. సాహసప్రవృత్తి గల వారికి ఈ ఆట ఎంతో సంతోషాన్ని, గొప్ప అనుభూతిని కలిగిస్తుంది. ప్రేక్షకులకు ఆ క్రీడ తిలకించడం అమితమైన ఆనందాన్ని కలిగిస్తుంది.

పైన మొహానికి అలల దెబ్బ. శిష్యుడు నిశ్చలంగా, ఏమీ చలించకుండా అలాగే చూస్తున్నాడు.

దాదాపు అరగంట దాటింది. వాళ్లు ఎప్పటినుంచి అలా ఉన్నారో హర్షకి తెలియదు. అసలు ఏం జరగబోతున్నదీ, ఎందుకు వాళ్లలా ఉన్నదీ అసలే తెలియదు.

ఉన్నట్లుండి గురువు నోరు తెరిచాడు. అతను ఏవో పదాలు వల్లించాడు. అవి మహాకఠినంగా పలకలేనివిధంగా ఉన్నాయి. రెండుమూడు పదాలుకాదు. దాదాపు అర పేజీ పట్టేంత పదాలు అవి. అవన్నీ పలికి గురువు శిష్యుడివైపు చూశాడు. అతన్నే తదేకంగా చూస్తున్న శిష్యుడు అతను ఆ పదాలు పూర్తిచేయగానే తను నోరువిప్పాడు. తనూ ఏవో పదాలు పలికాడు. అతను అవి పలుకుతుంటే అలలు ఎగిరి ఉప్పు నీరు నోట్లోకి పోతోంది. అతను చలించటంలేదు.

ఆ పదాలు ఇందాక గురువు వల్లించిన పదాలేనని హర్షకి అర్థమైంది. అతను ఆ పదాలు పూర్తిచేయగానే గురువు తల ఊపాడు. ఇద్దరూ కొద్దిసేపు ఏదో ధ్యానం చేశారు. ఆ తర్వాత శిష్యుడు ఇసుక సమాధిలోంచి బయటకు వచ్చాడు. గురువు కాళ్లకి నమస్కారం చేశాడు.

హర్షకి వాళ్లతో మాట్లాడాలనిపించింది. వాళ్లు ఎవరు? ఎందుకిలా చేస్తున్నారు అని తెలుసుకోవాలనిపించింది. వాళ్లని చూస్తే ప్రమాదకరమైన మనుషుల్లా అనిపించలేదు. వాళ్ళు పలికిన పదాలు ఏ భాషలోవో కూడా అర్థంకాలేదు. వాళ్లకి తెలుగుగానీ, ఇంగ్లీషుగానీ వస్తుందా? రాకపోతే వాళ్లతో మాట్లాడటం కుదరదు.

బోట్ చాటునుంచి బయటకు వచ్చాడు. మెల్లగా వాళ్లవైపు నడిచాడు.

"మీరెవరు? ఏం చేస్తున్నారు? " అడిగాడు వాళ్ల దగ్గరకు వెళ్ళి. వాళ్లు అర్థంకానట్లు చూశారు. అదే ప్రశ్న ఇంగ్లీషులో అడిగాడు. వాళ్లకి ఇంగ్లీషు వచ్చు

"నేను ఇతనికి మాస్టర్‌ని. నీకు ఈ వయసులో మేం ఏం చెప్పినా అర్థంకాదు. అందుకే సింపుల్‌గా చెపుతాను. నేను ఇతనికి మంత్రాలు నేర్పిస్తున్నాను" అన్నాడు గురువు.

హర్ష ఆశ్చర్యపోయాడు. మంత్రాలంటే గురువు శిష్యుడిచేత బట్టీ పెట్టించటం ఉంటుంది అని హర్షకి తెలుసు. చాలా సినిమాల్లో అలా నేర్పటం చూశాడు కూడా. కానీ ఇంత కష్టమైన పదాలు ఇన్ని పదాలతో కూడుకున్న అంత పెద్ద మంత్రం ఒకసారి వినిపించగానే ఆ శిష్యుడు ఎలా తిరిగి చెప్పగలిగాడు? బహుశా అంతకుముందే ఆ మంత్రాన్ని వల్లెవేశాడా?

హర్ష అనుమానం విని వాళ్లు నవ్వారు.

"లేదు. అసలు ఏమంత్రం నేర్పుతారో, లేదో కూడా శిష్యుడికి తెలీదు. ఇతను మొదటిసారి ఆ మంత్రం విన్నాడు"

ఏకసంధాగ్రాహి అన్నపదం హర్షకి అప్పటికే తెలుసు. కానీ నిజంగా అలాటివాళ్లు నిజంగా ఉంటారా? ఇతను ఆ మంత్రం ఒక్కసారి వినగానే ఎలా తిరిగి చెప్పగలిగాడు?

"ఏకాగ్రతతో" గురువు జవాబిచ్చాడు.

"మనసూ, బుద్ధీ, మెదడూ అన్నీ ఒకేచోట లగ్నంచేసి, ఏకాగ్రత సాధించాలి. ఏకాగ్రత ఉంటే ఎంత కష్టమైన పనయినా సాధించవచ్చు"

ఆ తర్వాత గురువు చెప్పాడు. అందుకే ఇసుకలో పాతిపెట్టటం, చెట్టుకి తలకిందులుగా వేళ్లాడదీయటంలాంటివి చేసి శిష్యులకి ఏకాగ్రతలో తర్ఫీదు ఇస్తారుట. కష్టాల్నీ, దుస్సహమైన పరిస్థితినీ అధిగమించటం అలవాటు చేసుకుని ఏకాగ్రతను సాధిస్తారుట.

ఆ దృశ్యం హర్ష మనసులో బలంగా నాటుకుపోయింది. వాళ్లు ఎవరో, ఏమిటో

ఏమీ తెలియకపోయినా ఒక మంత్రాన్ని నేర్చుకునేందుకు ఆ శిష్యుడు దుర్భరమైన ఇసుక సమాధిలో నిలబడి, అలలు తన నోట్లోకి వేగంగా నీళ్లు చిమ్మి కొడుతుంటే, ఉప్పటి నీళ్లు నోట్లోకి పోతుంటే, కనీసం వాటిని తుడుచుకునేందుకు చేతులు కూడా లేక అలాగే నిశ్చలంగా నిలబడి తదేక దీక్షతో గురువు చెపుతున్న మంత్రాన్ని విని, గ్రహించి, తిరిగి చెప్పటం ఎంతో గొప్పగా అనిపించింది.

ఆ దృశ్యం అతని మనసులో చెరగని ముద్రవేసింది. ఆ సంఘటన అతన్ని మాన సికంగా బలవంతుడిని చేసింది. ఏకాగ్రత, పట్టుదల ఉంటే ఏమైనా సాధించపచ్చని తెలిపింది. అతను భవిష్యత్తులో మంచి క్రమశిక్షణతో ప్రవర్తించేటట్లు చేసింది.

హర్ష గోవా బీచ్‌లో కూర్చుని తను చిన్న ప్పుడు కేరళతీరంలో చూసిన సంఘటన గురించి ఆలోచిస్తున్నాడు. పావని అతని వైపు ముగ్ధురాలై చూస్తోంది. మిగతావా ళ్లంతా స్ట్రీకింగ్ అనగానే పరుగెత్తిపోవటం, హర్ష ఒక్కడూ వెళ్లకుండా కూర్చోవటం ఆమెకి ఎంతో ఆనందాన్ని, తృప్తినీ ఇచ్చాయి. హర్ష సంగతి తెలిసినా, అతను వెళ్ళకపోవటంతో మళ్ళీ ఏదో కొత్త విష యాల్ని తెలుసుకున్నట్లు అనిపించింది.

"నా హర్ష మంచివాడు" అనుకుంది ప్రేమగా.

దూరంనుంచి ఎవరో కంగారుగా పులి తరుముతున్నట్లు పరుగెత్తుకుంటూ వస్తు న్నారు. హర్ష, పావని కూర్చున్న దగ్గరకే నేరుగా వస్తున్నారు. ఎవరా అని చూసింది పావని. అతను వెంకటేష్.

"కొంప మునిగింది బాబాయ్. వాళ్లు స్ట్రీకింగ్ చేస్తుంటే ఎవరన్నా చూస్తే చంపుతా రుట.

చూస్తేనే వాళ్లకి కోపం వస్తుందంటే మన వాళ్లు కొంతమంది వాళ్లని ఫొటో తీయబో యారు. ఫొటో తీస్తే వాళ్లు మండిపడతా రుట. వాళ్లేదో హిప్పీలంటే మత్తుగా జోగు తుంటారనుకున్నాం. అదేంలేదు. బలంగా, తాటిచెట్లలా ఉన్నారు. వాళ్లల్లో మగవాళ్లు మనవాళ్లని చావగొడుతున్నారు. మనవాళ్లు లబోదిబోమంటున్నారు. వాళ్లని చూస్తే రూలూ రిథమ్ ఉన్నట్లు లేదు. పిస్టల్ పెట్టి పేల్చి పారేసినా పారేసేటట్లున్నారు. నువ్వు వచ్చి ఏదో సెటిల్‌చెయ్యి"

"వాళ్లకి రూలూ, రిథమూ లేదు. మనకి ఉన్నాయి. వాళ్లని అలా ఎగబడి చూడటం, ఫొటో తీయాలని చూడటం అనాగరికం"

"ఇప్పుడవన్నీ మాట్లాడితే ఎలా? మన వాళ్లు కష్టాల్లో ఉన్నారు. నువ్వే రక్షించాలి"

"మన పరమహంస మాష్టారు వచ్చా రుగా. ఆయన్ని అడగండి. లెక్చెరర్లంటే వాళ్లు వింటారేమోగానీ స్టూడెంట్స్‌ని కేర్ చేస్తారా? "

"పరమహంసగారికి ఈ విషయం తెలిస్తే కాలేజీకి తిరిగి వెళ్లాక అందర్నీ సస్పెండ్‌చే యిస్తాడు. ఆయన వద్దు. నువ్వేరా" బతి మాలాడు వెంకటేష్.

హర్ష లేచాడు.

★ ★ ★

హర్ష, లెక్చరర్లూ అందరూ వెళ్ళి మాట్లాడి సర్దిచెప్పి, స్టూడెంట్లని గొడవనుంచి తప్పించి తీసుకుని వచ్చారు.

ఇసుకలో కూర్చుని మళ్ళీ ఆలోచిస్తూ ఉండిపోయాడు హర్ష. అల్లరీ, చిలిపితనం ఉండాల్సిందే కానీ మంచి ఏమిటో, చెడు ఏమిటో తెలుసుకోలేని అయోమయావస్థలో యువతరం ఉండిపోవటం అతనికి చికాకు కలిగించింది. అతనూ, పావనీ ఈ విషయం గురించి అప్పుడప్పుడూ మాట్లాడుకుంటూ ఉంటారు.

పావని ఇసుకలో మేడలు కడుతోంది. కడుతూ కడుతూ మధ్యమధ్య హర్షవైపు చూస్తోంది. హర్షని ఎంతసేపు చూసినా పావని తనివి తీరలేదు. సడన్‌గా అతను ఆమెవైపు చూసేసరికి ఉలిక్కిపడి తల

వంచుకుని మళ్ళీ ఇసుకలో చేతులు కదుపుతూ మేడ కడుతున్నట్లు నటిస్తోంది.

ఇంతలో హఠాత్తుగా... ఎక్కడినుంచో ఒక కాగితం విమానంలా విసురుగా వచ్చి హర్ష గుండెకి కొట్టుకుంది. దాన్ని మడత పెట్టి స్పీడ్‌గా విసిరారు ఎవరో. అతను దాన్ని విసిరేశాడు. ఏమీ పట్టించుకోనట్లు ఉందామని ప్రయత్నించాడు. కానీ మనసు మాత్రం సహకరించలేదు.

పావని అతన్ని గమనిస్తోంది. ఆ కాగితం తీసి చూసింది. అందులో ఒక గులాబీ పువ్వు, గుండెగుర్తు చిత్రించి ఉన్నాయి. ఐ లవ్‌యూ అని స్కెచ్ పెన్‌తో ఎవరో రాశారు.

పావని గుండె మండిపోయింది. ఆ రాసిన వాళ్ళని నిలువునా చీల్చేయాలన్నంత కోపం వచ్చింది.

హర్షవైపు చూసింది. అతని పచ్చటి మొహం కోపంతో కాబోలు ఎరుపెక్కి ఉంది. కసిగా ఆ కాగితాన్ని చింపి ముక్కలు చేశాడు.

ఇలాటి కాగితాలు ఎగిరి వచ్చి తాకటం అతనికేమీ కొత్తకాదు. ఎన్నోసార్లు ఇలా జరిగింది. ఎవరు చేస్తున్నారో తెలీకుండా చాలా తెలివిగా చేస్తున్నారు.

ఆ చిరాకుని మర్చిపోవటానికి ప్రయత్నిస్తూ, పావని మొహంలోకి చూశాడు. పట్టుకుచ్చులాంటి జుట్టు, మిలమిల మెరుస్తున్న నల్లటి కళ్ళు, ఎర్ర గులాబీ రేకుల్లాంటి పెదవులు కోపంతో ముడుచుకుని ఉన్నాయి.

"ఎవరు చేసినట్లు?" అంది.

"అది తెలిస్తే సమస్య ఏముంది?" అన్నాడు హర్ష.

పావని ఆలోచిస్తూ ఉండిపోయింది.

★ ★ ★

తూర్పు తెలవారుతోంది.

పక్షుల కిలకిల శబ్దాలు, విరబూస్తున్న పూలు, రాత్రంతా పరిమళాలు వెదజల్లిన నైట్‌క్వీన్, పారిజాతం, మల్లేమాలతీ వాతావరణం ఆహ్లాదంగా ఉంది.

హర్ష తన బంగళా టెర్రేస్‌మీద నిలబడి ఎక్సర్‌సైజ్ చేస్తున్నాడు. టెర్రేస్‌మీద ఒక పక్క మల్లెపందిరి పాకించి ఉంది. ఒకవైపు మెత్తటి దిండ్లు అమర్చిన తూగుటుయ్యాల ఉంది. పిట్టగోడను ఆనుకుని చక్కగా అమర్చిన కుండీలనిండా చేమంతులూ, లిల్లీలూ విరబూసి ఉన్నాయి.

హర్ష ఒంటిమీద చిన్న చెడ్డీ తప్ప మరేం లేదు. బలంగా, అందంగా ఉన్న హర్షను చూస్తే అమ్మాయిల గుండెలు గిలిగిలిపెడతాయి.

దీక్షగా ఎక్సర్‌సైజ్ చేస్తున్న హర్ష ఉలిక్కిపడ్డాడు. అతని ఒంటిమీదికి ఒంటిరెక్క విమానంలా ఒక కాగితం ఎగిరివచ్చి బలంగా కొట్టుకుంది.

"నీ బుగ్గలు చూస్తే కొరికేయాలనిపిస్తోంది" అది చేత్తో రాసిన ఉత్తరం కాదు. న్యూస్‌పేపర్లో పెద్దపెద్ద అక్షరాలు కత్తిరించి, గులాబీ రంగు కాగితంమీద అతికించి తయారుచేసిన ఉత్తరం అది. అందువల్ల ఎవరు రాశారో కూడా గుర్తుపట్టటం కష్టం.

ఎంతో ఏకాగ్రతతో ఎక్సర్‌సైజ్ చేస్తున్న అతని దీక్షకి ఒక్కసారి అడ్డుపుల్ల వేసింది ఆ ఉత్తరం.

ఇంతలో మెట్లమీద మువ్వలశబ్దం వినిపించింది. ఎక్సర్‌సైజ్ ఆపి కుర్చీమీద విసిరిన పెద్ద టర్కీటవల్ గబగబా చుట్టుకున్నాడు.

పావని మెట్లెక్కి వస్తోంది. పచ్చటి పట్టు లంగా జాకెట్టు, ఎర్రటి ఓణీతో ముద్దమందారంలా అతనిముందు నిలబడి ఉంది.

"పనిమనిషి రాలేదుట కదా? ఆంటీ చెట్లకి నీళ్ళుపెట్టమంది" అంది చిరునవ్వుతో పావని.

ఆమె నవ్వుతుంటే ఎర్రటి పెదిమెలు విచ్చుకుని గులాబీమొగ్గ విచ్చుకున్నట్లు కనిపిస్తున్నాయి. తెల్లటి పలువరుస ముత్యాల్లా

మెరుస్తూ జాజుల మాలకట్టి, గులాబీలు అటూఇటూ అందంగా అమర్చినట్లు కనిపిస్తోంది.

పావని దృష్టి కిందపడి ఉన్న కాగితం మీద పడింది. మొహం చిట్లించింది.

"ఏమిటి? ఇక్కడ కూడా వదిలిపెట్టటం లేదా?" కోపంతో ఎర్రబడ్డ మొహంలో పావని చాలా అందంగా కనిపిస్తోంది.

"ఇవన్నీ సీరియస్‌గా తీసుకోకు" అంది.

"నేనా? హ...నెవర్" అన్నాడు హర్ష. పావని స్నేహం అతనికి ఎంతో హాయిగా అనిపిస్తుంది.

అతను స్టేడియంకి వెళ్లేసరికి కోచ్ శివరాజ్ ఎదురుచూస్తున్నాడు.

ప్రాక్టీస్ ముగిశాక ఇద్దరూ ఆ స్టే యంలో ఉన్న రూమ్‌లోకి వెళ్ళారు అక్కడ ఒక టి.వి. ఉంది. అందులో హ ఆటకు సంబంధించిన కాసెట్ పెట్టి ఏ ఆటగాడు ఎలా మెలకువలు చూపిస్తున్న చెప్పాడు శివరాజ్. రెండు సోడాలు తెచ్చి ఒకటి హర్షకి ఇచ్చి తనదానిలో బ్యాగ్ లోంచి సీసాతీసి లిక్కర్ కలిపి, గబగబా తాగేశాడు.

ఎంత తాగినా అతను గంభీరంగా ఉంటాడు. అదోమంచి-లక్షణం.

"మీకు చాలా బాలెన్స్ ఉంది" అన్నాడు హర్ష ఒకసారి, శివరాజ్ గటగటా తాగి, నిమ్మళంగా కూర్చోవటం చూసి.

శివరాజ్ నవ్వేశాడు.

"బాలెన్స్ లేకే ఇలా తగలడ్డది జీవితం" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వు ఏడుస్తున్నట్లు ధ్వనించింది.

హర్ష విని ఊరుకున్నాడు. శివరాజ్ అతనికి గురువు కాబట్టి ఆట గురించి తప్ప మరే విషయమూ చెపితే వినటమే తప్ప అడగటం అలవాటు లేదు. శివరాజ్ చెప్పకుండా మాత్రం ఉండడు.

"హర్షా... గుర్తుపెట్టుకో. మంచి ప్లేయర్‌కి కావల్సిన అత్యంత ముఖ్య లక్షణం క్రమశిక్షణ. ఆహారం, వ్యాయామం అన్నీ క్రమం తప్పకుండా ఉండాలి. వ్యసనాలకు లోబడకూడదు. మనస్సూ, శరీరం, మెదడూ ఎప్పుడూ తన అదుపులో ఉంచుకోవాలి. వాటిమీద ఏమాత్రం పట్టుకోల్పోకూడదు. అప్పుడే అతను ఫిట్‌గా ఉండగలడు. ఇంకో విషయం. ప్రేమా, దోమాలాంటి వాటిల్లో కూడా చిక్కుకోకూడదు" అన్నాడు.

"ప్రేమ కూడానా?" హర్ష ఆశ్చర్యంగా అడిగాడు.

"అదే అసలు అన్నిటికన్నా గొప్ప



వ్యసనం. ఈ ప్రపంచంలో ప్రేమకన్నా గొప్పగా కిక్ ఇచ్చే వస్తువు ఇంకోటిలేదు. అన్ని మాదకద్రవ్యాలకన్నా ప్రమాదకరమైనది ప్రేమ. దాన్లో పడ్డాక ఇక బయటపడలేరు" మంద్రంగా ఉన్న అతని గొంతు మంత్ర బోధచేస్తున్నట్లు ధ్వనిస్తోంది. హర్ష మంత్రముగ్ధుడైనట్లు వింటున్నాడు.

"నీకు తెలుసా! గొప్పగొప్ప ఆటగాళ్ళెవరూ పెళ్ళయ్యాకో, ప్రేమలో పడ్డాకో గొప్పవాళ్లు కాలేదు. ప్రేమ టాలెంట్‌ని ఫినిష్ చేసే

స్తుంది. వాళ్ళంతా తాము అనుకున్నది సాధించాకే ప్రేమలో పడ్డారు. అందుకని నీకు చెప్పేది ఒకటే. నీ ధ్యేయం, లక్ష్యం గొప్ప హాకీ ఆటగాడివి కావటం. అంతే. నీ ధ్యేయం తప్ప నీ కళ్లకు మరేం కనిపించకూడదు. నీ ధ్యేయసాధనే నీ ఏకైక లక్ష్యం. అది తప్ప ఇంకేదీ నీ మనసుని అంటకూడదు. నీ మనసులో మరి దేనికీ స్థానం ఉండకూడదు" స్థిరంగా చూస్తూ చెప్పాడు శివరాజ్.

"అది ఎలా సాధ్యపడుతుంది? ప్రేమ అన్నది ఎప్పుడు, ఎలా, ఎవరిమీద పుడుతుందో చెప్పలేరంటారు కదా? " అమాయకంగా అడిగాడు.

శివరాజ్ లేచి వచ్చి హర్ష బుగ్గలు పుణికాడు.

"అందుకే నువ్వు నాకు నచ్చావ్. నువ్వు పాలలాగా స్వచ్ఛమైనవాడివి. నీ మనసు మైనంలా మెత్తనైనది. దాన్ని జాగ్రత్తగా చూసుకో. ఎవరికీ ఇచ్చేయకు, నువ్వు చెప్పింది నిజమే. కానీ ప్రయత్నిస్తే సాధ్యం కానిది ఏదీ లేదు. నువ్వు మనసుని స్థిరంగా ఉంచుకుంటే, ఏ ఆడపిల్ల చూపులూ నీ గుండెని తాకలేవు"

"అదెలా? "

"అదే నాయనా చెప్తున్నాను. గీతలో శ్రీకృష్ణపరమాత్మ ఏం చెప్పాడో తెలుసా?

అసంశయం మహాబాహో
మనోదుర్నిగ్రహం చలం
అభ్యాసేనతు కౌంతేయ
వైరాగ్యేనచ గృహ్యతే

అంటే అర్థం ఏమిటంటే ఓ అర్జునా, ఎంతటివాడికైనా మనసుని నిశ్చలంగా నిలపటం దుస్సాధ్యం. కానీ, దానిని అభ్యాస వైరాగ్యములచేత నిరోధించవచ్చు అని.

శ్రీకృష్ణపరమాత్మ మహాగొప్పదేవుడు. కాబట్టే పదహారు వేలమంది గోపికల్నీ, ఎనిమిది మంది భార్యల్నీ, ఇంకా గ్రేట్ లవర్ రాధికనీ అందర్నీ కంట్రోల్ చేశాడు. ఆయనలాగా ఎవరూ ఉండలేరు. సరే, మనం మన మనసుని ఆయన చెప్పినట్లు ప్రాక్టీస్‌తో కంట్రోల్ చేసుకుని బతకాలి. అంటే నువ్వు శ్రీకృష్ణపరమాత్ముడిని ధ్యానించుకుని, గట్టిగా పట్టుపట్టి కూర్చుంటే ఏ ఆడపిల్లా నిన్ను చేరే సాహసం చేయలేదు. ప్రేమించావంటే ఇంకేమీ సాధించలేవు ప్రేమించకు"

"నేను ఎవర్నీ ప్రేమించటంలేదు" చెప్పాడు హర్ష.

"అది నిన్ను చూడగానే గ్రహించాను. ప్రేమకీ మృత్యువుకీ చాలా పోలికలున్నాయి. 'నిత్యం సన్నిహితో మృత్యు!' అన్నారు. అలాగే ప్రేమ కూడా. ఎప్పుడైనా రావచ్చు. బాల్యంలోనే ప్రేమించినవాళ్లున్నారు. యవ్వనంలో ప్రేమించేవాళ్లు సరేసరి. ఆఖరికి వృద్ధాప్యంలో కూడా ప్రేమించినవాళ్లున్నారు. ఈరోజు గడిచిందనో, ఈ క్షణం గడిచిందనో సంతోషించటానికిలేదు. ప్రేమ పెద్ద గండం. ఎప్పుడైనా రావచ్చు. బి ఎలర్ట్. ఎప్పుడూ జాగ్రత్తగా ఉండాలి. తస్మాత్ జాగ్రత, జాగ్రత, జాగ్రతః"

హర్ష శివరాజ్‌వైపు చూశాడు. ఆ కళ్లల్లోరవంత ఆశ్చర్యం. శివరాజ్ అతని మనసుని ఆసాంతం చదివేశాడు.

"ఇన్ని చెప్తున్నాడు. వీడెందుకిలా తాగుబోతూ తిరుగుబోతూ అయ్యాడని కదూ నీ సందేహం? చెపుతాను. నాదో విషాదగాథ. కమలామణి నా జీవితంలో పెద్ద శని. అవి నా యవ్వనంలోని రోజులు. అప్పుడే నేను ఒక హాకీ ఆటగాడిగా ఎదుగుతున్నాను. మంచి అలవాట్లూ, క్రమశిక్షణా ఉండేవి. నేనేదో చాలా మంచివాడిననీ, ఏదో సాధించేస్తాననీ అంతా అనుకునేవాళ్లు. స్టేడియంలో కమలామణి ఒకసారి నాకు ఎదురుపడింది. నా ఆటంటే తనకిష్టమంది. నా అభిమానినంది. ప్రేమ కురిపించింది. పిచ్చి వెధవలా ఆమెని ప్రేమించాను. ఏమాటకామాటే చెప్పాలి. ఆ రోజులు అద్భుతంగా గడిచాయి. నెలలు క్షణాల్లా దొర్లాయి. నా

ఫ్యూచర్ మటాష్ అయింది. అద్భుతంగా వెలగాల్సిన నా ఆట..." పాపం ఎంతో బాలన్స్‌గా ఉండే శివరాజ్‌కి బాలన్స్ తప్పిపోయింది. అతని కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఒక ఆటగాడిగా హర్షకి అతని బాధ అర్థమైంది.

"బాధపడకండి. అనుకున్నవన్నీ సాధించలేంకదా" అన్నాడు.

"నిజమే... కానీ నా మొత్తం కథ విని మరీ మాట్లాడు. కమలామణి మత్తులో నేను సర్వం మర్చిపోయి ఆటను నిర్లక్ష్యం చేశాను. ఆకాశానికి ఎగరాల్సిన నేను అథః పాతాళానికి రాలిపోయాను. ఇంతా చేస్తే నేను ఎవరికోసమైతే నా సర్వస్వమైన హాకీ ఆటను కూడా నిర్లక్ష్యం చేశానో, ఆ కమలామణి కాస్తా ఇంకోడిని చేసుకుని వెళ్లిపోయింది" శివరాజ్ ఏడుస్తున్నాడు.

హర్ష నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాడు. శివరాజ్ ఎంత గొప్పగా ఆడతాడో అతనికి తెలుసు. ఆటలోని మెలకువలు శివరాజ్‌కి తెలిసినట్లు ఎవరికీ తెలియవు. తనని ఒక గొప్ప ప్లేయర్‌గా చేయటం కోసం డాడీ తనని అతని దగ్గర చేర్పించాడు. డాడీ నిర్ణయం ఎంత కరెక్ట్‌గా ఉంటుందో తనకి తెలుసు. ఆటగాడిగా పేరు మంట కలిసిపోయినా శివరాజ్‌కి కోచ్‌గా ఉన్న ప్రతిష్ఠ చాలా గొప్పది. నిజమే. కాస్తంత క్రమశిక్షణ ఉంటే శివరాజ్ పేరు హాకీ ఆటలో వెలిగిపోతూ ఉండేది.

"ద్రోణాచార్య అర్జునుడిని ఎందుకు అంత అభిమానించే వాడో తెలుసా?" శివరాజ్ ఉన్నట్లుండి అడిగాడు.

"అర్జునుడు గొప్ప ధనుర్విద్యాపరుడని" హర్ష జవాబిచ్చాడు.

"కాదు" అన్నాడు శివరాజ్.

హర్ష శివరాజ్‌వైపు చూస్తున్నాడు. శివరాజ్ మళ్లీ సీసా తీసి ఈసారి కూడా సోడా లేకుండా ఊరికే తాగేశాడు. ఆ తర్వాత ఒక్క క్షణం కళ్లు మూసుకుని కూర్చుని ఆ తర్వాత చెప్పటం మొదలుపెట్టాడు.

"అర్జునుడి మీద పక్షపాతం చూపిస్తున్నాడని ద్రోణాచార్యుడి ఇతర శిష్యులు అనుకునేవాళ్లు. ఆ సంగతి ద్రోణాచార్యకు తెలిసింది. ఆయన వాళ్ల అపోహను తొలగించాలనుకున్నాడు. వాళ్లను ఒకసారి ఒక మామిడి చెట్టు దగ్గరకు తీసుకెళ్లాడు. ఆ చెట్టుమీద చిటారుకొమ్మన కూర్చున్న చిలక కన్నుకి బాణం ఎక్కుపెట్టమని అడిగాడు. ముందు దుర్యోధనుడిని పిలిచాడు. దుర్యోధనుడు బాణం గురిపెట్టినప్పుడు అతన్ని నీకు ఏమేం కనిపిస్తున్నాయని అడిగాడు ద్రోణుడు. నాకు మామిడిచెట్ల ఆకులు, చిటారు కొమ్మన చిలక కనిపిస్తున్నాయని చెప్పాడు దుర్యోధనుడు. నువ్వు వెళ్లమని చెప్పి ధర్మరాజుని పిలిచాడు. నాకు చిటారు కొమ్మ, చిలక కనిపిస్తున్నాయి అన్నాడు ధర్మరాజు. ఇలాగే అందర్నీ అడిగాడు ద్రోణుడు. అంతా అలాగే ఆకులూ, చిలకా కనిపిస్తున్నాయని చెప్పారు. చివరగా అర్జునుడిని పిలిచాడు. నీకేం కనిపిస్తున్నాయి? అని ప్రశ్నించాడు. నాకు చిలక కన్ను తప్ప మరేం కనిపించటంలేదు అని అర్జునుడు సమాధానం చెప్పాడు. అప్పుడు ద్రోణుడు అతడిని భుజం తట్టి అభినందించి మిగిలిన అందరికీ చెప్పాడు. చూశారా! అర్జునుడికి తన లక్ష్యం తప్ప మరేమీ కనిపించటం లేదు. అదీ మంచి విలుకాడికి ఉండవలసిన లక్షణం. మనిషి తన లక్ష్యం నుంచి ఎన్నడూ విడిపోకూడదు. తన లక్ష్యం తప్ప మరేవీ అతని దృష్టిలో ఉండకూడదు"

భక్తిగా, మౌనంగా వింటున్నాడు హర్ష. అతని మనసంతా శివరాజ్ మీద భక్తితో నిండిపోయింది. పాపం అతను సర్వనాశనమైపోయినా, తనని రక్షించాలని ఎంత ప్రయత్నిస్తున్నాడో తల్చుకుని కృతజ్ఞతతో ఒళ్లు పులకరించింది. శివరాజ్‌లో అతనికి ఒక ద్రోణాచార్యుడు, ఒక శ్రీకృష్ణపరమాత్మ కనిపిస్తున్నారు.

"హర్షా గుర్తు పెట్టుకో. ప్రేమకన్నా పెద్ద

వ్యసనం ఇంకోటిలేదు. కమలామణి నన్ను ప్రేమించానని చెప్పినన్ని రోజులూ నేను ఆమె ప్రేమ మత్తులోపడి ఆటను నిర్లక్ష్యం చేశాను. తాగుడు భయంకరమైనదే. కానీ ప్రేమ అంతకన్నా భయంకరమైనది. తాగితే ఆ మత్తు కొద్దిసేపే. కానీ ప్రేమ మత్తు ప్రేమిస్తున్నన్నాళ్లూ ఉంటుంది. నువ్వు ఇంకే పనీ చేయలేవు. దేన్నీ సాధించలేవు. పోనీ ఆ ప్రేమ దిగిపోయాక అయినా శాంతిగా ఉంటావా? ఉండవు. మస్తుగా తాగితే ఆ హేంగోవర్ మహా అయితే ఒక పూట ఉంటుందేమో! కానీ నువ్వు ప్రేమిస్తే ఆ ప్రేమ విఫలమైతే ఆ హేంగోవర్ జీవితాంతం ఉంటుంది. ఇక నువ్వు ఏం చెయ్యటానికీ పనికిరాని వెధవ్వి అయిపోతావు. నా విషయంలో అంతే జరిగింది. కమలామణిని మర్చిపోవటానికి తాగాను. పేకాడాను. వెధవగా మిగిలాను. ఏమీ సాధించలేని వెధవగా, ఎందుకూ పనికిరాని వెధవగా మారాను" శివరాజ్ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

ఎంత మర్చిపోదామన్నా ప్రేమ మరువనివ్వదేమో! అందుకేగా దేవదాసూ, మజ్నూ అలా మసైపోయారు.

శివరాజ్ వెక్కివెక్కి ఏడ్చి తెప్పరిల్లాడు. మళ్లీ మామూలుగా మారిపోయాడు. ప్రశాంతంగా ఒక తపస్విలా కనిపిస్తున్నాడు. నిజానికి అతనికి తాగుడూ, తిరుగుడూ లాంటి అలవాట్లున్నాయని ఎవరూ అనుకోరు. గత అనుభవాల పాఠమో ఏమో మరి వ్యసనాల బారిన పడినా తన కర్తవ్యాన్ని మాత్రం మర్చిపోలేదు. మంచి కోచ్‌గా మిగిలాడు. అతను ఒకే ఒక పొరపాటుతో తను తేలిగ్గా సాధించగలిగిన గొప్ప లక్ష్యాన్ని పోగొట్టుకున్నా ఎన్నడూ దానికి బాధపడ్డట్లు మాత్రం కనిపించదు. బాలన్స్‌డ్‌గా ఒక యోగిలా ఉంటాడు. ఆ రోజు కూడా బహుశా హర్షకి జ్ఞానభిక్ష పెట్టటానికి కాబోలు ఆ తపస్సులోంచి బయటపడ్డాడు.

ఆరోజునుంచి ఈ రోజు వరకూ హర్ష శివరాజ్‌కి అభిమాన శిష్యుడు. తనకు తెలిసిన విద్య మొత్తం అతను హర్షకి నేర్పిస్తున్నాడు. అతన్ని ఒక అద్భుతమైన ఆటగాడ్ని చేయాలని విపరీతంగా శ్రమిస్తున్నాడు.

★ ★ ★

హర్ష ప్రాక్టీస్ ముగిశాక బయటకు వచ్చి తన హీరో హోండా దగ్గరకు నడిచాడు. గ్రీకు రాజకుమారుడు అలెగ్జాండర్ తన అశ్వం మీదికి అలవోకగా ఎగిరి అధిరోహించినట్లు దాని మీదికి ఎక్కి ఒక్క కిక్‌తో దాన్ని స్టార్ట్ చేశాడు.

వేగంగా కాలేజీవైపు నడిపాడు.

కాలేజీ ముందు దిగి క్లాస్ దగ్గరకి నడిచాడు. కాలేజీ ఆవరణ అంతా కలర్‌ఫుల్‌గా ఉంది. అంతా ఎవరి పనుల్లో వాళ్లు బిజీగా ఉన్నారు. హస్కుకొట్టే వాళ్లు కొందరు. అమ్మాయిలకి సైట్ కొట్టే వాళ్లు కొందరు. కొందరు తాపీగా సినిమా బొమ్మలు చూసుకుంటున్నారు. కొందరు సెల్‌ఫోన్లలో బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌లుగా బిజీగా మాట్లాడేస్తున్నారు.

హర్ష క్లాస్‌రూమ్‌లోకి అడుగు పెట్టాడు. క్లాస్‌రూమ్ కాలేజీ కాంపౌండ్‌లో సీన్లకి ఏమాత్రం తక్కువగా లేదు. ఎవరి ధోరణిలో వాళ్లున్నారు. మాగజైన్లూ, పేపర్లూ చదివేవాళ్లు చదువుకుంటున్నారు. కొంతమంది పేపర్లు కట్‌చేసి బొమ్మలు తయారు చేసుకుంటున్నారు. టిఫిన్ బాక్స్ తెచ్చుకున్న వాళ్ల బాక్స్‌ని కొందరు లాఘవంగా పట్టేసి దాని ఓనర్‌కి ఏమాత్రం తెలియనివ్వకుండా ఖాళీచేస్తున్నారు.

ముందు బెంచీ మొత్తం ఖాళీగా ఉంది. హర్ష వెళ్లి అందులో కూర్చున్నాడు. ఏమన్నా మంచి పాయింట్స్ ఉంటే రాసుకుందామని నోట్సు తీసి డెస్క్‌మీద పెట్టాడు.

సార్ చెపుతున్నది శ్రద్ధగా వింటున్నాడు.

హర్ష హాకీ ఆటకి ఎంత అంకితమైనా, చదువుని మాత్రం అశ్రద్ధ చేయడు. అది

అతనిలోని మరో మంచి లక్షణం. ఏ పని చేసినా క్రమశిక్షణతో చేయాలన్నది అతని సిద్ధాంతం.

నిజానికి అతనికి స్పోర్ట్స్ కోటాలో ఇంజనీరింగ్‌లో సీటు వచ్చింది కూడా. అసలు అతని చుట్టాలకే బోలెడు మందికి ఇంజనీరింగ్ కాలేజీలు కూడా ఉన్నాయి.

"నీకు కావల్సిన బ్రాంచ్‌లో సీటు ఇస్తాం. మా కాలేజీలో చేరు. అటెండెన్స్ వేయిస్తాం. హాయిగా ఇంజనీరువైపోదువుగానీ" అని వాళ్లంతా అడిగారు.

"నేను చదువుకి ఎక్కువ టైమ్ కేటాయించలేను. తేలిగ్గా ఉండే దాన్లో చేరతాను. ఊరికే ఆషామాషీగా చదవటం నాకిష్టం ఉండదు. నేను ఏ చదువు చదువుతున్నానో అందులో నాకు పూర్తి పట్టు ఉండాలి. నేను బి.కామ్ చదువుతాను" అని గట్టిగా చెప్పి బి.కామ్‌లో చేరాడు హర్ష.

అతనూ పావనీ కలిసి ఇంటర్ చదివారు. పావనికి ఎలక్ట్రానిక్స్‌లో ఇంజనీరింగ్ సీటు వచ్చింది. ఇంట్లో అంతా చేరమని ఎంత అడిగినా పావని చేరలేదు. పావనికి హర్ష అంటే ప్రాణం. అతన్ని విడిచిపెట్టి బతకలేననిపిస్తుంది ఆమెకి. అందుకే ఎంతమంది ఎన్ని చెప్పినా వినకుండా అతనితోపాటు బి.కామ్‌లోనే చేరింది.

ఇక్కడ చేరిన దగ్గర్నుంచీ ఒకటే బాధ పావనికి. ఇదివరకు ఇంటర్‌లో ఉన్నప్పుడు పిల్లలంతా ఇంజనీరింగ్ గురించి తాపత్రయ పడుతూ ఉండేవాళ్లు. కొంతమంది హర్షకి లైన్ వేయాలని చూసినా వాళ్ల సంఖ్య తక్కువే కావటంవల్ల పావని వాళ్ల బారిన పడకుండా హర్షని కాపాడుకుంటూనే ఉండేది. వాళ్లల్లో కొద్దిమంది మెతకవాళ్లేనని కనిపెట్టి, బెదిరించి హర్ష జోలికి రాకుండా కాపాడుకుంది.

పావని హర్షని గాఢంగా ప్రేమిస్తోంది. మనీషాకొయిరాలా, కమలహాసన్ పాడిన పాట 'టెలిఫోన్ ధ్వనిలా నవ్వేదానా' అంటే పావనికి ఎంతో ఇష్టం. అందులో ఒక చరణంలో మనీషా కొయిరాలా అన్న పదాలు అంటే పావని పడి చస్తుంది.

"షోరూముల్లో నీ బొమ్మని సైతం తాకనివ్వను"

పావనీ అంతే. చెక్కిన బొమ్మలాంటి హర్ష ఆకారాన్ని ప్రేమగా, కాంక్షగా చూసే అధికారం తనకి మాత్రమే ఉందని నమ్ముతుంది. ఎవరి చూపైనా హర్ష మీద పడితే వాళ్ల చూపుల్ని పెకిలించి పారేయాలన్నంత కసి కలుగుతుంది.

పావని పిచ్చిగా, వెర్రిగా, గుడ్డిగా హర్షని ప్రేమిస్తోంది.

పావని హర్షనే తదేకంగా చూస్తోంది. బలమైన అతని శరీరాన్నీ, చెక్కిన బొమ్మలా తీర్చి దిద్దినట్లున్న అతని ముఖ కవళికల్నీ, ముద్దుగా ఉన్న బుగ్గల్నీ, అన్నిటినీ కసిగా, కాంక్షగా, ప్రేమగా, అపురూపంగా చూస్తోంది.

ఇంతలోనే జరిగింది. అందరూ షాక్ తినేట్లు ఆ సంఘటన.

★ ★ ★

అప్పుడే లెక్చరర్ వచ్చి అంతకుముందు పెట్టిన పరీక్ష ఆన్సర్ షీట్లు తెచ్చి ఇచ్చాడు.

ఆయన ఒక్కొక్కళ్లనీ పేరు పెట్టి పిలుస్తున్నాడు.

"హరీష్"

"యస్ సర్" హరీష్ కోతిలా అరుస్తూ నిలబడ్డాడు.

"నరేష్"

నరేష్ లేచి ఆన్సర్ షీట్ అందుకున్నాడు.

"వెరీగుడ్. మంచి మార్కులొచ్చాయి" లెక్చరర్ అభినందించాడు. నరేష్ కూర్చున్నాడు.

"అమ్మో! సిక్స్టీ పర్సంట్" హరీష్ తన మార్కులు చూసి తనే ఆశ్చర్యపోతూ ఆనందంగా అరిచేశాడు.

"నీకు సిక్స్టీ పర్సంటా? " లెక్చరర్ ఆశ్చర్యపోతూ అడిగాడు.

"యస్ సర్" హరీష్ దర్పంగా చెప్పాడు.

ఇంతలో హరీష్ పక్కన కూర్చున్న సుధాకర్ హరీష్ మార్కులవంక చూసి పెద్దగా నవ్వేశాడు.

"నీ మొహానికి సిక్స్టీ ఫర్సంటా? బాగా చూసుకో. అది జీరో సిక్స్. సిక్స్‌జీరో కాదు. నీకు ఆరు మార్కులొచ్చాయి. సింగిల్ డిజిట్"

"ఆ ఆరు మార్కులా? " హరీష్ ఒక్కసారిగా నిరాశపడిపోయాడు.

"సరిగ్గానే వచ్చాయి. కూర్చో" లెక్చరర్ అన్నాడు.

హరీష్‌కి కోపం వచ్చేసింది. ఆన్సర్‌షీట్ చించి గాడిదలా నమలటం మొదలుపెట్టాడు.

"ఏంటదీ. ఏం చేస్తున్నావు? "

"బయట ఉంటే నా పేపర్ చూసి అందరూ నవ్వుతారు సర్. అందుకే తినేస్తాను సర్"

"నువ్వేమన్నా గాడిదవా? "

"నో సర్"

"మరి కాగితాలు తింటావేంటి? " లెక్చరర్‌కి కోపం నషాలానికంటింది.

అంతా వినోదం చూస్తున్నారు.

ఇంతలో జరిగింది ఆ సంఘటన.

ఒక కాగితం విమానంలా వేగంగా ఎగిరి వచ్చి హర్ష బుగ్గకి సూటిగా తగిలింది. ఎవరో గురిచూసి చాలా బాగా కొట్టారు.

హర్ష ఉలిక్కిపడ్డాడు. ఆ కాగితం వచ్చిన విసురుకి అతని బుగ్గకి కొద్దిగా నెప్పి కూడా పుట్టింది.

అతన్నే తదేకంగా చూస్తున్న పావని కూడా ఆ సంఘటనకి ఉలిక్కిపడింది.

అది విసిరిన వాళ్లమీద కోపంతో ఆమె గుండె దహించుకుపోయింది. తన హర్ష, తన సర్వస్వమైన హర్షమీద ఎవరో అలా విసిరింది? నిప్పులు కురిపిస్తున్న కళ్లతో చుట్టూ చూసింది. అంతా పళ్ళికిలిస్తూ, ఒకే భంగిమలో కనబడ్డారు. ఎవరు విసిరారో కనిపెట్టలేకపోయింది పావని.

హర్ష పక్కన కూర్చున్న రమేష్ గబగబా ఆ పేపరు విమానం తీశాడు. మొత్తం విప్పాడు. ఏదో బహుమానం వస్తే సభలో అందరికీ చూపించినట్లు దాన్ని పైకెత్తి పట్టుకుని అందరికీ చూపించాడు.

దాన్ని రాసిన వాళ్లెవరోగానీ ముందే ఒక గులాబీరంగు కాగితంమీద ప్రింటులో ఉన్న అక్షరాలు అతికించి వాక్యాలు తయారుచేశారు. ఆ వాక్యాలన్నీ నేర్పుగా పేపరుమీద అతికించి ఉన్నాయి. మొత్తం కలిపితే ఆ వాక్యం.

"ఏరా ఘాట్లే. బండవెధవా. నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పినా ఇంత పొగరా? " అని ఉన్నాయి.

రమేష్ అది చదవగానే క్లాస్‌మొత్తం చప్పట్లతో నిండిపోయింది.

"బండవెధవ... బండవెధవ" అని అరుస్తూ చప్పట్లు కొట్టడం మొదలుపెట్టారు.

హర్ష మొహం ఎర్రగా కందిపోయింది.

కోపంగా లేచి నిలబడ్డాడు.

"బండవెధవా... నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పినా ఇంత పొగరా? " చప్పట్లు దద్దరిల్లుతూ పాట సాగిపోతోంది. కొంతమంది ఉత్సాహవంతులు ఏకంగా బెంచీమీద ఎక్కి డాన్స్ చేయటం మొదలుపెట్టారు.

హర్ష కోపంతో వణికిపోయాడు.

పావని కోపంతో కంపించిపోతోంది. ఎర్రటి సన్నటి పెదిమలు వణుకుతున్నాయి. బుగ్గలూ, కళ్లూ ఎర్రబడ్డాయి.

తన ప్రియాతిప్రియమైన హర్షని ఎవరో ప్రేమించటమా? ప్రేమించటమేకాక ఇంత ధైర్యంగా ఈ క్లాస్‌లోనే రాకెట్ విసరటమా?

ఎంత ధైర్యం?

వాళ్ల గుడ్లు పీకేయాలి. వాళ్ల పీక పిసికే

యాలి. వాళ్ల రక్తం కళ్లచూడాలి. ఆ రక్తాన్ని గటగటా తాగెయ్యాలి.

ఎవరసలు అది?

దాన్ని నమిలి, మింగి చంపి, కొరికి... పళ్లు పటపట కొరుకుతూ ఆలోచిస్తోంది పావని.

హర్షవైపు సానుభూతిగా ఆప్యాయంగా చూసింది. ఆ చూపుల్లో ఓదార్పు హర్ష గుండెని శాంతపరచింది. ఇంతలో ప్రిన్సిపాల్‌గారి ప్యూన్ హడావిడిగా వచ్చాడు.

"కాలేజీ కరస్పాండెంట్‌గారొచ్చారు. ఆన్సర్ పేపర్లన్నీ ఒకసారి చూస్తారుట" అన్నాడు.

"బాబోయ్... ఇప్పుడెలా? " లెక్చరర్ గుండెలో రాయి పడింది. అప్పటికే పిల్లలంతా వాటిని రకరకాల షేపుల్లోకి మార్చేశారు. కొందరు వాటిని కత్తిరించి ఏనుగు, గుర్రం బొమ్మలు కూడా తయారుచేశారు.

"నాయనా... తండ్రీ...ప్లీజ్... వాటిని ఎలాగైనా కాస్త మామూలు షేప్‌లోకి మార్చి ఇస్తారా. ప్రిన్సిపాల్‌గారికి కావాలట" అన్నాడు.

చప్పట్లూ, పాటా గొడవ సద్దుమణిగింది. ఒక్కొక్కళ్లూ బుద్ధిమంతుల్లా ఆన్సర్‌షీట్‌ని డెస్కుమీద పరిచి అసలు షేపులోకి తేవాలని తెగప్రయత్నం చేయటం మొదలుపెట్టారు. దాన్ని మామూలుగా మార్చి ప్రిన్సిపాల్‌గారికి అందివ్వాలనే కోరికకన్నా, ఆ పనిని అసలు చేయటం ఎలాగో నేర్చుకుంటే ఎన్నడన్నా ముందు ముందు కావల్సివస్తే పనికొస్తుందనే తాపత్రయం కనిపించింది. తిరిగి అంతా తమతమ గొడవల్లో తామున్నా తాము మాత్రం అదే పరిస్థితిలో అలాగే ఉన్నవాళ్లు ఇద్దరే ఇద్దరు. ఒకరు పావని, రెండోది ఆ కాగితం విసిరిన వ్యక్తి. పోతే పావని కోపంతో రగిలిపోతున్నట్లు బయటకే కనిపిస్తుంటే ఆ రెండోవ్యక్తి మాత్రం బయటపడకుండా గుంభనగా ఉండిపోయింది.

ఆమె రోషిణి.

రోషిణి కూడా హర్షని ప్రేమిస్తోంది. అతనంటే ఆమెకి పిచ్చిప్రేమ. ఎన్నోసార్లు అతనివైపు క్రేజీగా, ప్రేమగా చూసింది. హర్ష గమనించినా తల తిప్పేసుకున్నాడుగానీ ఎలాంటి రెస్పాన్స్ చూపించలేదు. లవ్‌లెటర్స్ రాసి ఇచ్చింది. హర్ష వాటిని తిరిగి ఇచ్చేశాడు.

"నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను" సిగ్గు విడిచి చెప్పింది.

"సారీ. నేను నా ఆటను తప్ప మరి దేన్నీ ప్రేమించలేను" అన్నాడు.

రోషిణి గుండె గాయపడింది. ఏడ్చింది మొత్తుకుంది.

"హర్షా... నువ్వులేంది నేను బతకలేను. నిన్ను చూడకుండా ఉండలేను. నువ్వులేని జీవితాన్ని ఊహించలేను. ప్లీజ్ నన్ను నమ్ము. ఐలవ్‌యూ. ఐ నీడ్ యువర్ లవ్. నువ్వు నన్ను ప్రేమించకపోతే నా గుండె పగిలిపోతుంది హర్షా. నన్ను ప్రేమించు" భోరున ఏడ్చింది రోషిణి.

"రోషిణీ... అయామ్ సారీ. ప్రేమనేది ఎవరిమీదా బలవంతంగా పుట్టించలేం. అది అలా సహజంగా రావలసిందే. ఏమీ అనుకోకు. నువ్వు ఇలా బేలగా ఉండకూడదు. ధైర్యంగా ఏ సమస్యనైనా ఎదుర్కొనేట్లు ఉండాలి. ఇవన్నీ మామూలే. త్వరలోనే మర్చిపోతావు" అన్నాడు హర్ష.

రోషిణి ఏడుస్తూ ఉండిపోయింది.

హర్ష ఒక్కక్షణం ఆమెవైపు సానుభూతిగా చూసి, మౌనంగా నిష్క్రమించాడు.

రోషిణి కోపంతో, దుఃఖంతో రగిలిపోయింది. తను ఇంత బతిమాలినా, లెక్కచెయ్యకుండా వెళ్ళిపోయిన హర్షమీద కోపంతో మనసు మండిపోయింది.

ఏదో చెయ్యాలి. ఎలాగైనా పగ సాధించాలన్నంత కోపం వచ్చింది.

ఇవాళ క్లాసులో ఇలాగ విసిరేసరికి అందరి దృష్టి హర్షమీద పడింది.

# ఏరినముత్యాలు

- ప్రపంచంలో ఎంతోమంది సలహాలు పుచ్చుకొంటారు. కొద్దిమంది తెలివైన వారు మాత్రమే వాటిని ఆచరించగలుతుంటారు.

– సైరస్

- మనిషి జీవితంలో వచ్చే ప్రతిరోజూ క్రితం రోజుకన్నా కాస్తో కూస్తో ఎక్కువ విషయాల్ని నేర్చుతుండాలి.

– రవీంద్రనాథ్ ఠాగూర్

- మనిషికి మంచి మనసు ఉండాలేగాని నానా విధాల సంపదలు వాటంతట అవే చేకూరుతుంటాయి.

– తులసీదాస్

- డబ్బు గలవాడు దానిని భద్రపరచుకోవడంలో దిగులు పడతాడు. లేనివాడు అది లేనందుకు దిగులు పడతాడు.

– వాకర్

- ప్రేమ ఇస్తుందే తప్ప ఎప్పుడూ ప్రతిఫలం కోరదు.

– గాంధీజీ

- నిజమైన స్నేహం మంచి ఆరోగ్యం లాంటిది. పోగొట్టుకోనంతవరకు దాని విలువ తెలుసుకోలేము.

–సి.సి.కోల్టన్

- శరీరంపైన ముడతలు పడితే పడనివ్వండి. అంతేకాని హృదయంపై కాదు. ఉత్సాహానికి ఎప్పుడూ వయసు మళ్లకూడదు.

–జేమ్స్ ఎ.గార్‌ఫీల్డ్

- బలహీనమయినప్పుడు తప్పులు బయటపడతాయి.

–స్వామీ చిన్మయానంద

- జీవితం ఒక క్షేత్రం. దాని ఫలసాయం నీవు నాటే విత్తుల మీద ఆధారపడి ఉంటుంది.

–బీచర్

- తల్లిని నమ్మినవాడు, ధరణిని నమ్మినవాడు చెడడు.

–గాంధీజీ

- బుద్ధిమంతుడు తననుతాను ప్రశ్నించుకొంటాడు. కాని మూర్ఖుడు ఇతరులను ప్రశ్నిస్తాడు.

–చార్లీచాన్

సేకరణ: **ఆచంట మెహర్‌మణి**

కొన్నికొన్ని నిక్‌నేమ్స్ భడాల్న వచ్చే స్తాయి. ఎవరో ఒకసారి ఆ మాట అంటారు. అంతే అవి అలా అలా ఒక్కొక్కళ్ల నోట్లో నాని, నాని చివరికి ఐడెంటిఫికేషన్‌కి ఇంటిపేరుకన్నా ఎక్కువగా పాపులర్ అయిపోతాయి.

ఘాట్లే, బండవెధవా అనగానే అందరికీ చచ్చే నవ్వు వచ్చేస్తుంది. కాబట్టి మళ్ళీమళ్ళీ ఆ మాటల్ని అనకమానరు. చివరికి అదే అతని పేరుకింద స్థిరపడిపోతుంది. అవమానంతో అతని మొహం కుంగిపోతుంది. ఇంతవరకూ స్టూడెంట్స్ అందరూ అతన్ని ఆరాధనగా, హీరోలా చూసేవాళ్లు. అతనికి ఆ ట్రీట్‌మెంట్ మాత్రమే అలవాటు. ఇప్పుడు హఠాత్తుగా ఒక్కొక్కళ్లూ బండవెధవా, ఘాట్లే అంటూ వెక్కిరించేస్తుంటే తట్టుకోలేడు. రోషం వచ్చేస్తుంది. రోషంతో కోపం వస్తుంది. కోపంతో బాలన్స్ తప్పుతుంది. బాలన్స్ తప్పిన మనిషి తన లక్ష్యాన్ని సాధించలేడు. టీజ్ చేస్తే కలిగే చెడు పరిణామం అదే.



దాన్ని రోషిణి స్వయంగా ఒకరి అనుభవంలో చూసింది కూడా.

రోషిణి అత్తయ్య చంద్రలేఖ గొప్ప టెన్నిస్ ప్లేయర్. ఎన్నో కప్పులు సాధించి, ఇంకెన్నో పతకాలూ, షీల్డులూ సాధించాలనే ప్రయత్నంలో ఉండేది.

టెన్నిస్‌లో ఆ లెవెల్లో ఆమెకి ఒక ప్రత్యర్థి ఉండేది. ఆ ప్రత్యర్థి పేరు హంస. పేరు హంసేగానీ మహాక్రూరమైన మనిషి ఆమె. చంద్రలేఖ పేరు చూసి కళ్లల్లో నిప్పులు పోసుకునేది. ఎట్లాగైనా చంద్రలేఖను పడగొట్టటమే ధ్యేయంగా పెట్టుకుంది. చంద్రలేఖ బలహీనతలేవిటా అని వెతికింది. చంద్రలేఖను జాగ్రత్తగా పరిశీలించింది.

చంద్రలేఖకు చెడు అలవాట్లు లేవు. అఫైర్స్ లేవు. ఆమె జీవితం తెరిచి ఉన్న తెల్ల కాగితంలాంటిది.

చంద్రలేఖను బాగా స్టడీచేసిన హంస ఒక విషయం కనుక్కుంది.

చంద్రలేఖకు ఆత్మాభిమానం ఎక్కువ. అహం కూడా ఎక్కువే. తన గురించీ, తన ప్రవర్తన గురించీ చాలా ఎక్కువగా ఊహించుకునే తత్వం. తన గురించి ఎవరన్నా చాటునైనా సరే, చెడుగా అనుకున్నా, కించపరుస్తూ మాట్లాడినా, సహించేగుణం చంద్రలేఖకు లేదు.

వెంటనే హంస తన అస్త్రం చంద్రలేఖకు గురిపెట్టింది.

చంద్రలేఖ కోచ్‌కీ, చంద్రలేఖకీ సంబంధం ఉందని ప్రచారం సాగించింది.

ఆదిమ మానవుడినుంచి మనిషి నాగరిక జీవిగా అవతారం మార్చినా, మనిషిలోని ఆటవిక ప్రవర్తన మాత్రం అంతరాంతరాళంలో ఎక్కడో దాగి ఉంటుంది. సమయం వచ్చినప్పుడూ, ఇతరుల్ని హింసించేందుకూ అది చక్కగా బయటపడిపోతుంది.

అంతేకాదు. ప్రతి మనిషిలో ఒక అద్భుత నటుడు దాగి ఉంటాడు. సమయం రాగానే ఆ అద్భుతనటుడు బయటపడతాడు. ఒక మనిషి మంచివాడంటే నమ్మటానికి చాలా ప్రయాసపడతారు. అదే ఎవడైనా తాగి పడిపోయాడని చెపితే వెంటనే నమ్మేస్తారు. అది నిజంగా నమ్మటం కాదు. నమ్మినట్లు నటించటం.

లోకానికి నిజం అక్కర్లేదు. పుకారులో నిజానిజాలు ఎవరికీ అక్కర్లేదు. ఎవరో పడనివాళ్లు ఎక్కడో ఒకమాట పుట్టిస్తారు. కాస్త వాగుడుకాయ, అటూఇటూ ప్రచారం చేసే మనిషిని చూసుకుని ఒక మాట అంటే చాలు "ఫలానా వాళ్లగురించి ఇలా విన్నాను. నిజమేనా? " అని. అంతే అది కాస్తా ఫలానా వాళ్లు ఇదిట అన్న పదంగా మారి ఆ చెడు వాళ్లకి వెంటనే ఆపాదించబడి, ప్రచారమైపోతుంది. కాంతివేగంతో ఆ పుకార్లు ప్రయాణిస్తాయి.

హంస సృష్టించిన పుకారు వెంటనే ప్రచారంలో పడింది. దానికి విశేష ఆదరణ లభించి చివరికి కోచ్ భార్య దగ్గరకి కూడా ఎవరో మోశారు. కొందరు ఆమెని రెచ్చగొట్టారు. చివరికి కోచ్ భార్య వచ్చి హంసని "ఏమే ఎందుకే నా మొగుడ్ని వల్లో వేసుకున్నావు? " అని గొడవపడి అందరిలో అరిచింది.

కొందరు పోకిరీలు చంద్రలేఖ కనబడ్డప్పుడల్లా ఆమె పేరునీ, కోచ్ విజయ్ పేరునీ జోడించి, వెకిలిగా నవ్వుతూ కామెంట్స్ చేయటం మొదలుపెట్టారు.

చంద్రలేఖ ఇది భరించలేకపోయింది. ఇన్నాళ్లూ బోలెడంత గౌరవాన్నీ, ఆదరణనీ మాత్రమే చూసిన ఆమె ఈ వెకిలితనాన్ని సహించలేకపోయింది. తనలోతనే కుమిలిపోయింది. దాంతో ఏకాగ్రత తగ్గి ఆటమీద పట్టు తప్పిపోయింది. సమయం చూసి, ప్రత్యర్థి హంస విజృంభించేసింది. హంస పేరు మారుమోగిపోయింది. చంద్రలేఖ పేరు మరుగున పడింది.

ఇందులో హంసకి ఖర్చయింది పైసా కూడా లేదు. ఆమె గూండాల్ని పెట్టి తన్నిం

చలేదు. కనీసం మనుషుల్ని పెట్టి ప్రచారానికి తిప్పలేదు. పార్టీలు చేసో, లంచాలు ఇచ్చో మనుషుల్ని తనవైపుకి తిప్పుకోలేదు. కేవలం ఒకేఒక మాట, ఆ మాట అనటం వల్ల చంద్రలేఖ జీవితమే తారుమారు అయేంత పని చేసింది.

టీజింగ్ ఒక లెవెల్లో ఉంటే ఫర్వాలేదు. అది కాస్త శృతి మించితే, జీవితాలే తారుమారు అవుతాయి. టీజింగ్, రాగింగ్ జరగకుండా చూడాలి. జనంలోకి వెళ్ళాక పుకారుని కంట్రోల్ చెయ్యటం ఎవరివల్లా కాదు.

సర్వనాశనమైన చంద్రలేఖ జీవితం కళ్లారా చూశాక, రోషిణి ప్లేయర్స్ అంటేనే భయపడేది. ప్లేయర్స్‌లో సాధారణంగా స్పోర్టివ్‌నెస్ అనేది ఉంటుంది. చక్కని శరీరాకృతితోపాటు జీవితంలో దేన్నయినా యధాతథంగా, తేలికగా స్వీకరించే గుణం ప్లేయర్స్‌కి అలవడుతుంది. ఆట అన్నాక గెలుపు, ఓటమీ కూడా ఉంటాయి. గెలుపు ఎప్పుడూ ఒకరి సొంతం కాదు. ఆట ముగిసిందాకా ఎవరు గెలుస్తారో చెప్పలేం. ఓటమిని ధైర్యంగా అంగీకరించి తిరిగి గెలుపు కోసం ప్రయత్నించేవాడే అసలైన ఆటగాడు. స్పోర్టివ్‌గా ఉండలేనివాడు మంచి స్పోర్ట్స్‌మాన్ కాలేడు. కానీ, ఎంత కాదన్నా ప్రతివాడిలో సహజంగా ఉండే లక్షణాలు పోవు కదా. సున్నిత హృదయం, అనవసర విషయాలకు ప్రాధాన్యం ఇవ్వటం ఏ వృత్తిలో వాళ్లకైనా ఉండవచ్చు. అందుకే గొప్పగొప్ప వాళ్లు కూడా ఉన్నట్లుండి అధఃపాతాళానికి జారుకున్నారు.

రోషిణికి ఆ విషయం తెలుసు. అందుకే హర్షని నిర్దాక్షిణ్యంగా వేధించి వెంటాడి, వేటాడదల్చుకుంది.

★ ★ ★

"మన కాలేజీకి పిల్లలు ఇంకా బాగా రావాలని కరస్పాండెంట్‌గారు చంపుతున్నారు. ఈ ప్రైవేట్ కాలేజీ ప్రిన్సిపాల్ ఉద్యోగం కాదుగాని, నాకన్నా..." ఏదో అనబోయి ఆపేశాడు ప్రిన్సిపాల్ నిరంజనరావు.

ఆయనకి అంతకుముందురోజు తన బావమరిది బాంక్ మానేజర్ అయిన నందనరావు తనతో అన్న మాటలు జ్ఞాపకం వచ్చి అవి పైకంటే సభ్యతగా ఉండదేమో, చులకనగా చూస్తారేమో అనుకుని మానేశాడు.

నిన్న ఆయన బావమరిది నందనరావు వచ్చాడు. ఆయనకి మళ్ళీ ట్రాన్స్‌ఫరయింది.

"ట్రాన్స్‌ఫర్లుంటాయి. బోలెడు రెస్పాన్సిబిలిటీ ఉంటుంది. అప్పులివ్వకపోతే అదో సతాయింపు. రుణమేళాలు, దారుణమేళాలు అంటూ ఏవేవో పెట్టించి మరీ అప్పులిస్తారు. తిరిగి ఇవ్వకపోతే, నీకు వసూలు చేయటం చేతకాలేదు. అసలు అన్నీ చూసే ఇచ్చావా అక్కడ ఏమన్నా తినేసి ప్రతివాడికీ అప్పులిచ్చేశావా? అన్నట్లు చూస్తారు. మెమోలు, చార్జ్‌షీట్‌లు. ఒక ఊళ్లో కాస్త అడ్జస్టు అయేలోపల ట్రాన్స్‌ఫరైపోతుంది. ఇంతలో ఆ పాత ఊళ్లో ఏదన్నా లొసుగు వస్తే మళ్లీ అక్కడికి ఆ కేసు కోసం పోయి రావాలి. డబ్బుతో కూడిన వ్యవహారాలు కాబట్టి ఉద్యోగంలో ప్రతిక్షణం టెన్షన్. పాడుగోల. వెధవపీడ. అందుకే వి.ఆర్.ఎస్ అనగానే అంతా ఎగబడి రిటైర్‌మెంట్ తీసేసుకున్నారు ఇచ్చేవాడే ఆశ్చర్యపోయి చచ్చేట్లు. నేనూ తీసేసుకున్నా పోయేది. ఏంటో నా ఖర్మ" అంటూ బాధపడ్డాడు.

"ఏ ఉద్యోగంలో మాత్రం సుఖం ఏడ్చిందిలే. మా ప్రిన్సిపాళ్ల ఉద్యోగంలో మాత్రం సుఖం ఉందా? ఎంత చేసినా మేనేజ్‌మెంట్‌కి తృప్తిఉండదు. ఎంత లిబరల్‌గా ఉన్నా స్టాఫ్‌కి శాటిస్‌ఫాక్షన్ ఉండదు. పిల్లలంటే ఇక చెప్పక్కర్లేదు. రోజుకో ప్రాబ్లం క్రియేట్ చేస్తుంటారు. అంతా ఖర్మలే. ఏమనుకుని ఏం లాభం? "

"మా బాంక్ ఉద్యోగం మరీ ఇదిలే ప్రతివాడితో ఇష్టమున్నా లేకున్నా, నవ్వుతూ మాట్లాడాలి. మర్యాద, కర్టెసీ అని ప్రాణం పీకుతారు. చచ్చిపోతున్నాం బాబూ. ఇంకా

అంతర్రాష్ట్ర ట్రాన్స్‌ఫర్లున్న బ్యాంక్‌ల్లో మరీ కష్టం. మా ఫ్రెండొకడు అలాటి బ్యాంకులో ఉన్నాడు. వాడి బ్యాంక్‌కి బెంగాల్లో ఎక్కువ బ్రాంచ్‌లున్నాయి. అక్కడికి ట్రాన్స్‌ఫర్ చేశారు. వీడు పదినిమిషాలు ఆలస్యంగా వెళ్లాడుట. బ్యాంక్‌ముందు కొంతమంది మనుషులు నిల్చుని, వీడ్ని మీదపడి చావ బాదారుట. పది నిమిషాలు ఆలస్యంగా వస్తావా? ఏం? ఉద్యోగమంటే అంత తేలిగ్గా ఉందా? హాయిగా ఉద్యోగం ఇస్తే ఇలా చేస్తావా? మాకు చూడు. ఉద్యోగం లేదు, నీకు చేతకాకపోతే రిజైన్‌చేసి మాను కునిపో. మాలాటి వాడెవడో చేసుకుంటాడు అని తన్నారుట"

"నిజంగానా? "

"ఏమో మరి. వాడు చెప్పాడు. మీరే నయం, సుఖంగా ఉన్నారు అన్నాడు"

"అంతేలే... ఇంకా ఎన్ని భయంకరమైన సంఘటనలు వినలేదు. అదేదో కంపెనీలో ఉద్యోగం చేస్తున్న కొందరిని, ఉల్ఫా ఉగ్రవా దులో ఎవరో కాల్చి చంపేయలేదూ? ఏం చేస్తాం? "

"భయపడకు... ఎక్కడ మాత్రం సేఫ్టీ... ఉంది? చావు రాసిపెట్టి ఉంటే, ఇంట్లోనే కూర్చున్నా, ఏ ఫానో విరిగి నెత్తిన పడి చస్తాం"

"ఉద్యోగాల్లో సుఖంలేదు. ఏ ఉద్యోగ మైనా సుఖం లేదు. ఎందులో ఉండే కష్టాలు అందులో ఉన్నాయి"

అవన్నీ గుర్తువచ్చి, ప్రిన్సిపాల్ నిరంజన రావు నిట్టూర్చాడు.

"ఏంటి సర్, ఏదో చెప్పబోయి ఆపేశారు" వైస్‌ప్రిన్సిపాల్ అడిగాడు.

"మన కాలేజీకి పిల్లలు రావటం తగ్గిందని కరస్పాండెంట్‌గారు అంటున్నారు"

"పిల్లలు రావటం తగ్గిందంటే ఏ విధంగా? అడ్మిషన్లు తగ్గాయనా, లేకపోతే జాయిన్ అయిన పిల్లల అటెండెన్స్ తగ్గిం దనా? "

"రెండింటి గురించీ ఆయన బాధపడుతు న్నారు"

"అడ్మిషన్లు తగ్గితే మనం ఏం చేస్తాం సర్. ఈ కాలంలో ప్రతివాళ్లకీ ఇంజనీరింగో, మెడిసినో అయితే తప్ప చదువులు కనిపిం చటంలేదు. మామూలు డిగ్రీల్లో తప్పనిసరి అయి చేరి, దాన్ని చదువుగా ఏమాత్రం లక్ష్యం పెట్టటం లేదు. ఇందులో చేరటం, ఇంకేమైనా వేరేవి నేర్చుకుంటూ దీన్ని నిర్లక్ష్యం చేయటం జరుగుతోంది. కాలేజీల్లో పోటీ పెరిగి, ఒకడికన్నా ఒకడు ఆకర్షణీ యంగా తయారుచేసి పిల్లల్ని ఆకర్షించాలని చూస్తున్నారు"

"ఇవన్నీ అందరికీ తెలిసిన విషయాలే. మనం కొత్తగా చెప్పేది ఏం లేదు. సరే ఇంతకీ అసలు విషయం పిల్లలు ఎక్కువ మంది వచ్చి చేరాలి. చేరిన పిల్లలు రెగ్యు లర్‌గా కాలేజీకి రావాలి. అందుకు మనం ఏం చేయాలి? "

"ఉన్న స్టూడెంట్స్ రెగ్యులర్‌గా వస్తూ మంచి రిజల్ట్ తీసుకొస్తే ఆటోమేటిక్‌గా కొత్తగా చేరే వాళ్లు పెరుగుతారు"

"దానికి ఏం చేయాలి? "

"మనకీ పేరెంట్స్‌కీ మధ్య అవగాహన పెరగాలి. రెగ్యులర్‌గా పేరెంట్స్ మీటింగ్ పెట్టి, వాళ్లకి పిల్లల్ని మానిటర్ చేస్తుండ మని బోధిస్తుండాలి"

"ఏడిసినట్లుంది. డిగ్రీ లెవెల్లో పేరెంట్స్ మీటింగ్‌లకి వస్తారా? "

"ఎందుకు రారు? దానికి ఒక ఆకర్షణీయ మైన పథకాన్ని రూపొందించాలి. ఏదన్నా ఎట్రాక్షన్ ఉంటే తప్ప ఎవరూ రారు"

"సరే మీరు ఏదన్నా ఉంటే ఆలోచించి నాకు చెప్పండి. మధ్యాహ్నానికి చెపితే నేను కరస్పాండెంట్‌గారికి చెపుతాను"

"మన లెక్చరర్లందరినీ కూడా అడుగు తాను" అన్నాడు వైస్‌ప్రిన్సిపాల్.

మధ్యాహ్నానికి అంతా తమతమ ఐడియా లతో సిద్ధం అయిపోయారు.

ఏదన్నా స్కీమ్ పెట్టి లాటరీ తీయిస్తుంటే బాగుంటుందని కొందరన్నారు.

బాటనీ లెక్చరర్ సుధారాణి చెప్పిన ఐడియా అందరికీ నచ్చింది.

"ఈ రోజుల్లో ప్రతివాడికీ గుర్తింపు కావాలన్న తపన ఎక్కువైంది. ఈ తపనని టి.వి. ఛానెల్స్ వాళ్లు చక్కగా ఉపయోగించుకుంటున్నారు. అలాగే మనమూ ఉపయోగించుకోవచ్చు. ఇప్పుడు పేరెంట్స్, పిల్లాలూలాటి తేడాలు కూడా బాగా తగ్గాయి. అంతా ఒకే లెవెల్లో ఉంటున్నారు. ఈ గుర్తింపు తపనవల్ల ప్రతివాళ్లూ తాము ఇతరులముందు తమ కళని, కళ అంటూ వారిలో ఉన్నా లేకపోయినా, ఏదైతే వాళ్లు తమ టాలెంట్ అనుకుంటున్నారో, దాన్ని ప్రదర్శించాలని తాపత్రయపడుతున్నారు. అందువలన మనం పేరెంట్స్‌డే ప్రతీ నెలా, ఒకవేళ ప్రతి నెలా వీలుకాకపోతే కనీసం మూడేసి నెలలకి ఒకసారి గనక పెట్టామంటే పేరెంట్స్ అంతా మనం పెట్టిన మీటింగ్‌లకి వస్తారు. మనతో టచ్‌లో ఉంటారు. పేరెంట్స్ మీటింగ్‌లో మనం స్టూడెంట్స్ గురించి డిస్కస్ చేస్తాం. ఆ తర్వాత స్టేజ్ మీద డాన్స్, డ్రామాలాంటి ప్రోగ్రాంలు పేరెంట్స్ ఇస్తారు"

నిరంజనరావుకి మాత్రం కొంత జంకుగానే ఉంది.

"ఇది సాధ్యమేనా? పేరెంట్స్ డ్యాన్స్, డ్రామాలాంటి ప్రోగ్రాం అంటే కొత్త ఆలోచన. అందరూ దీన్ని సరిగ్గా రిసీవ్ చేసుకుంటారో లేదో. మేము డాన్స్‌లాడే మొహాల్లా కనిపిస్తున్నామా అంటూ మనల్ని తిడతారేమో"

"మీరు అన్నిటికీ భయపడతారు సర్. ఈరోజుల్లో అవ్వలూ, తాతలూ కూడా చాలా డాషింగ్‌గా, డేరింగ్‌గా ఉంటున్నారు. ఇంక పేరెంట్స్‌దేముంది. యమ డాషింగ్‌గా ఉంటారు. అయినా మనం వాళనే మన్నా బలవంత పెడతామా? ఇట్లా ఒక మీటింగ్ ఉంటుంది, అందులో పిల్లల తల్లి తండ్రులు వారివారి కళను ప్రదర్శించుకోవచ్చు అని నోటీస్ బోర్డులో ఒక నోటీస్ పెడతాం. అందరికీ ఇన్ఫర్మేషన్ ఇస్తాం. ఇష్టం అయినవాళ్లు వస్తారు. ఇష్టంలేకపోతే రారు. అంతే" తేల్చి చెప్పాడు వైస్‌ప్రిన్సిపాల్.

ప్రిన్సిపాల్ సరేనన్నాడు.

నోటీస్ తయారుచేశారు. ఈ విధంగా తమతమ ట్యాలెంట్‌ని ప్రదర్శించదలచుకున్న వాళ్లందరికీ ఇది సువర్ణావకాశం అని రాశారు. పేరెంట్స్ కొంతమంది గ్రూప్‌గా ఏర్పడిగానీ, ఒక్కొక్కళ్లేగానీ కూడా తమ కళని ప్రదర్శించవచ్చు అన్నారు.

నిరంజనరావు మాత్రం భయపడుతూనే ఉన్నాడు. కరస్పాండెంట్‌గారు మాత్రం ఈ పథకానికి ఆనందం ప్రకటించి, వెంటనే ఆమోదం తెలిపాడు.

నిరంజనరావు భయపడినట్లు ఏం జరగలేదు. చాలా ఎంట్రీలు వచ్చాయి. అందరికీ అవకాశం ఇవ్వటం కుదరని పని. చివరికి ఒక నాటకం, రెండు మిమిక్రీలు, రెండు ఏకపాత్రాభినయాలు, మూడు సోలోడాన్స్‌లు, రెండు గ్రూప్‌డాన్స్‌లూ సెలెక్ట్‌చేశారు. వాటిని లాటరీ పద్ధతిలో సెలెక్ట్ చేయాల్సి వచ్చింది.

కాలేజీ ఆడిటోరియంలో ప్రదర్శన. ఒక్కొక్కళ్లూ తమ ప్రోగ్రాంని ప్రదర్శిస్తున్నారు.

అయిదింటికి మొదలుపెట్టి, ఏడింటికి ముగించేయాలనుకున్న ప్రోగ్రాం మొదలయేసరికే ఏడు దాటింది. ఒక్కొక్కళ్లూ మేకప్ చేసుకుని తయారవటంలో చాలా ఆలస్యం చేసేశారు.

నాటకం, మిమిక్రీలు జరిగిపోయాయి. ఏక పాత్రాభినయాలూ, సోలో డాన్స్‌లూ ఒక మాదిరిగా శాంతియుతంగా జరిగిపోయాయి.

గ్రూప్ డాన్స్‌ల దగ్గర మాత్రం ఇక ఎవరినీ పట్టతరం కాలేదు. ఒక్కో డాన్స్‌లో

ఆరుగురు చొప్పున డాన్స్ చేశారు. చెమ్కీ లంగాలూ, ఓణీలూ ధరించి, తళతళలాడే నగలు మెరిపిస్తూ ధడేల్ ధడేల్ మని వాళ్లు వేసిన స్టెప్పులకి స్టేజ్ అదిరిపోయింది. జనం బెదిరిపోయారు. ఇంకా అక్కడ చేరిం దంతా కుర్రకారు స్టూడెంట్లూ, వాళ్లతో నిత్యం తలపండిన లెక్చరర్లూ కాబట్టి తక్కువ బెదిరారుగానీ ఆ డాన్స్‌కి మరొక రైతే పారిపోయేవాళ్లు.

గ్రూప్ డాన్స్‌లో ఒకళ్లు కుడిచేయి ఊపితే మరొకళ్లు ఎడం చేతిని ఊపారు. ఒకరు తల ముందుకి తిప్పితే కొంతమంది వెనక్కు తిప్పారు. ఒకళ్ల స్టెప్స్‌తో మరొకళ్లకి సంబంధం లేకుండా ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు ఎగరటం మొదలు పెట్టారు. అంతా గోల గోల గందరగోళం.

సీట్లన్నీ ఫిలప్ అయిపోవటంతో హర్ష ఒక మూల నిలబడి చూస్తున్నాడు.

ఇంతలో టప్‌మంటూ ఒక కాగితం ఎగిరి వచ్చి అతని గుండెకి తాకింది.

దానిమీద "నీ క్రాఫ్‌ని చూస్తే చెరిపేయా లనిపిస్తోంది" అని రాసి ఉంది.

హర్షకి చిరాకు వేసింది. అది విసిరిన వాళ్లని రెండు ఉతకాలన్నంత కోపం వచ్చింది. దాన్ని అణిచేసుకుని మనసు లోంచి ఆ సీన్‌ని చెరిపేసి బ్లాంక్‌గా చేసు కుని ప్రశాంతంగా మారాడు.

ఇంకొక గ్రూప్ డాన్స్ మిగిలింది. ప్రేక్షకు లకూ, ప్రోగ్రాంలో పాల్గొన్నవాళ్లకూ కాస్త ఉత్సాహంగా ఉండాలని ప్రిన్సిపాల్, కర స్పాండెంట్ ఇద్దరూ కలిసి ఆలోచించి అన్ని టిలోకీ బాగా ఉన్న ఐటమ్‌కి ఒక ప్రైజ్ కూడా ఇవ్వబోతున్నామని అనౌన్స్ చేశారు.

చివరి ప్రోగ్రాం కూడా చూసి ప్రైజ్ ఎవ రికి దక్కిందో తెలుసుకుని మరీ వెళ్లాలన్న ఉత్సాహంతో చాలామంది ఉండిపోయారు. అందరూ ఉన్నప్పుడే తాము చెప్పాలనుకు న్నది చెప్పేయటం మంచిదని ప్రిన్సిపాల్ తన ప్రసంగం మొదలుపెట్టాడు.

చదువు చాలా అవసరమైనదనీ, విద్యలేని వాడు వింత పశువు అనీ ఎవరూ దొంగిలిం చలేనిదీ, ఎంత దానం చేసినా తరగనిదీ విద్య మాత్రమేననీ అందుకే ప్రతివాళ్లూ విద్య అభ్యసించాలనీ అన్నాడు.

"విద్య అంటే కేవలం డిగ్రీలు సంపాదిం చటమే కాదు. ఈ రోజుల్లో చదువులు యాంత్రికం అయిపోతున్నాయి. ఏదో చదివి ఎలాగో ఒకలాగ ఆ పరీక్ష పాసై పోయి ఆ తర్వాత ఏం చదివామో కూడా జ్ఞాపకం లేని విధంగా తయారవుతున్నారు. విద్యార్థుల్లో విజ్ఞాన తృష్ణ పెరగాలి. చదు వుని బతుకుతెరువు కోసమే కాదు. విజ్ఞానం కోసం చదవాలి. అప్పుడే మనదేశంలో కూడా అద్భుతమైన శాస్త్రవేత్తలు తయారవు తారు. విద్యార్థులు క్రమశిక్షణతో మెలగాలి. ఈ టైమ్‌లో కాకపోతే మరెప్పుడు ఎంజాయ్ చేస్తాం అని అడుగుతుంటారు కొంతమంది విద్యార్థులు. నిజమే. కానీ జీవితానికి ఒక గమ్యం, ధ్యేయం ఏర్పరచుకోవలసింది కూడా ఈ టైమ్‌లోనే. అందుకే డిసిప్లిన్‌తో ఉండి విద్యనీ, విజ్ఞానాన్నీ, ఆర్జించి ప్రయోజ కులవ్వాలి. అందుకు తల్లితండ్రుల పాత్ర చాలా ఉంది. ప్రతి విద్యార్థినీ కనిపెట్టి ఉండటం లెక్చరర్లకి అసాధ్యం. అందుకే తల్లితండ్రులు తమ పిల్లల్నీ, వాళ్ల చదువునీ, ప్రవర్తననీ వాచ్ చేసి మానిటర్ చేస్తూ ఉండాలి. మీరందరూ అలా చేసి మీ బాధ్య తని నిర్వహించాలని కోరుతూ శలవు తీసు కుంటున్నాను"

ఆయన ప్రసంగం ఎవరూ వినలేదు. ఆయన చెపుతుంటే ఎవరి ధోరణిలో వాళ్లు ఉన్నారు. పేరెంట్స్ ఒకళ్లతో ఒకళ్లు కబుర్లు చెప్పుకుంటుంటే స్టూడెంట్స్ అల్లరి చేసేవాళ్లు చేసుకుంటూ లైన్ వేసేవాళ్లు వేసుకుంటూ ఉన్నారు.

ఆయన ప్రసంగం ముగియగానే తరవాతి ఐటమ్ గ్రూప్ డాన్స్ మొదలయింది. జాన పద నృత్యం. వాళ్లు కాస్త బాగానే చేశారు.

# రచయితలకు మనవి



★ చతురలో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రమురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.




ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. **100/–** ప్రథమ బహుమతి, రూ. **75/–** ద్వితీయ బహుమతి, రూ. **50/–** చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఏప్రిల్ చతుర నవల **పావని**

చిరునామా: ____________________

____________________

____________________

____________________

బహుమతిని రెండో గ్రూప్ డాన్స్‌కి ప్రకటించారు. ఇంతలో ఎవరూ ఊహించని సంఘటన జరిగింది.

"మాకు ప్రైజ్ ఇవ్వకుండా వాళ్లకిస్తావా? ఏం? ఏం చూసి ప్రైజ్ ప్రకటించారు? " అంటూ మొదటి గ్రూప్ డాన్స్ వాళ్లు ప్రిన్సిపాల్‌తో జగడానికి వచ్చారు. ఆడవాళ్లు కదా అని ప్రిన్సిపాల్ చాలా సహనం చూపించినా ఎవరూ అతన్ని వదిలిపెట్టలేదు. ప్రిన్సిపాల్ ఏదో సమాధానం చెప్పబోతే ఎవరూ వినలేదు. "ఆ బహుమతి మాకు రావాలి, మేము ఎంతో బాగా చేశాం. ఇస్తావా లేదా? " అని అరిచారు. వాళ్లల్లో కొందరు మరీ డాషింగ్ వనితలు ప్రిన్సిపాల్ చొక్కా పట్టుకుని లాగారు. ఆయన తూలి పడబోయారు. ఇంతలో ఒకామె మరీ కోపిష్టి మనిషి, ప్రిన్సిపాల్ చెంపలు ఛెళ్లుమని వాయించింది. ప్రిన్సిపాల్ బిత్తరపోయాడు. స్టాఫ్ మొత్తం తత్తరపడ్డారు. 'అసలు ఏమిటి నీ ఉద్దేశం? ఈ బహుమతులేంటి? ఈ ఊరించటాలేంటి. పేరెంట్స్ అనుకుంటున్నావా లేకపోతే ఎల్‌కేజీ పిల్లలను కుంటున్నావా? ' అని కొందరు అరిచారు.

పేరెంట్స్ ఈవిధంగా బిహేవ్ చేస్తారని ఎవరూ ఊహించలేదు కాబట్టి అందరూ నిర్ఘాంతపోయారు. ఇదివరకు ఎన్నడూ ఇలాంటి సన్నివేశం ఎదురు కాలేదు. పిల్లల తరపున గూండా పేరెంట్స్ వచ్చి పోట్లాడిపోతుండేవాళ్లు కానీ నేరుగా పేరెంట్స్‌తో పేచీ ఇప్పుడే వచ్చింది. వాళ్లవాళ్ల పేరెంట్స్‌కి మద్దతుగా పిల్లలంతా వచ్చేశారు. పెద్ద గొడవ. బహుమతి కార్యక్రమం ఆగిపోయింది. పిల్లలతో పేరెంట్స్‌తో అవగాహన పెంచుకోవాలని మొదలుపెట్టిన కార్యక్రమం కాస్తా రసాభాస అయి ఉన్న అవగాహన కూడా అంతరించింది.

'ఈ పిల్లలు సరిగ్గా చదువుకోవటంలేదనీ, డిసిప్లిన్ లేదనీ అనుకుని ఏంలాభం? వీళ్ల పేరెంట్స్ చూడండి. వాళ్లే పెద్ద గూండాల్లా బిహేవ్ చేస్తుంటే ఇంక ఉడుకురక్తం పిల్లలెలా ఉంటారు మరి? ' అనుకున్నారు స్టాఫ్ అంతా

ప్రిన్సిపాల్‌నీ, స్టాఫ్‌నీ మేనేజ్‌మెంట్‌నీ అనరాని మాటలతో దుర్భాషలాడి, కుర్చీలూ, మైకులూ విరగ్గొట్టి చివరికి పోలీసులు రంగప్రవేశం చేశాక అంతా నిష్క్రమించారు.



పావని తల్లి బేబీ పర్వతవర్ధని. బేబీ పర్వతవర్ధని కాలేజ్ ఫ్రెండ్ గీతాంజలి భర్తకి హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ అయిందిట. పర్వతవర్ధని అడ్రస్సూ, ఫోన్ నెంబరూ కష్టపడి కనుక్కుని హైదరాబాద్ వచ్చాక ఫోన్ చేసింది.

"నిన్ను చూసి ఎన్నేళ్లో అయింది. మా ఇంటికి రా. నేనే రావాలంటే నాకు ఈ ఊరు కొత్త. మీ అమ్మాయినీ, మీ వారినీ తీసుకుని మా ఇంటికిరా. మా వాళ్లందరినీ కూడా ఇంట్లోనే ఉండమంటాను. ఒకసారి అంతా పరిచయం అయినట్లుంటుంది" అంది గీతాంజలి.

"సరే అడ్రస్ చెప్పు" అంది పర్వతవర్ధని.

గీతాంజలి చెప్పింది. ఆ ఆదివారమే రావాలని మరీమరీ అడిగి ఫోన్ పెట్టేసింది. పావని తండ్రి బాబూరావు, ఆఫీసులో ఇన్స్పెక్షన్ ఉంది తను రావటం కుదరదన్నాడు.

"తనని చూడాలని ఉంది. నువ్వు రారాదూ ప్లీజ్. కనీసం మనిద్దరం వెళదాం" అంది పర్వతవర్ధని.

పావనికి వెళ్లాలనిలేదు.

"నేను రాను" అంది.

"ప్లీజ్ పావనీ. పాపం గీతాంజలి ఎలా ఉందో ఏమో. దాన్ని గురించి రకరకాలుగా కామెంట్స్ విన్నాను. ఎలా ఉందో ఏంటో? "

"ఏమైంది పాపం? "

"దానికి కాలేజీలో ఉన్నప్పుడు ప్రేమ వ్యవహారం ఉండేది. పాపం అతని తల్లితండ్రులు ఒప్పుకోలేదని వేరే అమ్మాయిని చేసుకున్నాడు"

"దుర్మార్గుడు" పావని పళ్లుకొరుకుతూ అంది.

"అతనేం చేస్తాడులే. అది అప్పటి అతని పరిస్థితి. సరే దీనికి ఇంకో అతనితో పెళ్లయింది. అతను చాలా దుర్మార్గుడని విన్నాను"

"పాపం అలాగా"

"గీతాంజలిని చూడాలని ప్రాణం కొట్టుకుపోతోందే"

"మరి ఇన్నాళ్లూ ఆ ప్రాణం ఎందుకు కొట్టుకుపోలేదో? "

"అవకాశం లేక ఇప్పుడు చూసే అవకాశం ఉంది కాబట్టి ప్రాణం కొట్టుకుపోతోంది. ఇంతకాలం అసలు ఏ ఊళ్లో ఉందో కూడా సరిగ్గా తెలీదు కదా"

"ఓహో అవకాశాన్నీ అవసరాన్నీ బట్టి నీ ప్రాణం కొట్టుకుంటుంటుందా? "

నీ వెటకారాలు చాలు. వస్తావా రావా? "

"వస్తాను" అంది పావని.

ఇద్దరూ కలిసి గీతాంజలి ఇంటికి వెళ్లారు.



పర్వతవర్ధని ఊహించినట్లు గీతాంజలి డిప్రెషన్‌లో కుంగిపోలేదు. అసలు ఇల్లు కూడా చాలా అందంగా చక్కగా ఉంది. గీతాంజలి ఆ ఇంటిని అద్భుతంగా అలంకరించింది కూడా. అద్దె ఇల్లు కాబట్టి ఇంటి ప్లాన్‌నీ, చుట్టూ చెట్లనీ వదిలేసి చూసినా ఆ ఇంటిని సర్దుకున్న తీరు అద్భుతం. చుట్టూ చక్కటి చెట్లూ, పూల మొక్కలూ ఉండి పొదరిల్లులా కనిపిస్తోంది ఆ ఇల్లు. కాలింగ్‌బెల్ కొట్టగానే గాయత్రీ మంత్రం వీనుల విందుగా వినిపించింది. టేప్‌రికార్డర్‌లో నుంచి వేద గానం వినిపిస్తోంది. వాస్తు పీడ విరగడ కోసం వేళ్లాడేసిన చైనీస్ బెల్స్ మంద్రంగా శబ్దం చేస్తున్నాయి.

గీతాంజలి వచ్చి తలుపు తీసింది. ఇంటి సింహద్వారంలోంచి అడుగుపెట్టగానే ఎదురుగా కనిపించేది చక్కటి ఉడ్ వర్క్‌తో అందం ఉట్టిపడుతున్న పూజా మందిరం. ఇల్లంతా అగరుబత్తుల వాసన. వాటితో కల్సి పోయి జాజులు, లిల్లీలు, చేమంతులు వగైరా పూల పరిమళాలు. ఆ ఇంట్లో అడుగు పెట్టగానే ఏదో దేవాలయంలో అడుగు పెట్టినట్లు అనిపించింది ఇద్దరికీ.

గదిలో నిలువెత్తు పటంలో ఒకాయన గడ్డం మీసాలతో ఆకుపచ్చ బట్టలతో విరగబడి నవ్వుతున్నాడు. ఆయన ముందు దీపం కుందులలో జ్యోతులు వెలుగుతున్నాయి. చక్కటి స్టాండ్‌లో అగరుబత్తులు చందనం వాసన ఒలికిస్తున్నాయి.

"ఎవరాయన" అంది పర్వతవర్ధని.

"ఆయనే మా గురువుగారు"

"ఎక్కడో చూసినట్లుందే"

"రోజూ పేపర్లో టీవీలో ఆయన గురించి వార్తలు వస్తూనే ఉంటాయి. సింహనాదం మహర్షిగారని చాలా గొప్ప స్వామి" చేతులు జోడించి భక్తిగా నమస్కారం చేస్తూ చెప్పింది గీతాంజలి.

పక్కగదిలోంచి గీతాంజలి భర్త వచ్చాడు. ఆయన ముందుగా సింహనాదం మహర్షి గారి పాదాలకు నమస్కరించి ఆ తర్వాత

పర్వతవర్ధనీ, పావనిలవైపు చూసి ఆప్యా యంగా నవ్వాడు.

"మా వారు నీకు పరిచయమేకదూ! కాక పోతే చాలా ఏళ్లయినట్లుంది చూసి" అంది గీతాంజలి.

"అవును" పర్వత వర్ధనికి అతను గీతాం జలి భర్తేనా అని ఆశ్చర్యం కలిగింది. ఆయన ఇదివరకు కొత్తవాళ్లముందు కూడా చిర్రుబుర్రులాడుతూ గీతాంజలిమీద అథార్టీ చెలాయిస్తూ ఉండేవాడు. అతన్ని చూస్తేనే గీతాంజలి గడగడలాడిపోయేది. ఫ్రెండ్సెవరి తోనూ మాట్లాడొద్దని వార్నింగ్ ఇచ్చి అందరి రాకపోకలూ మాటలూ కట్ చేయించాడు. భర్త కోసం గీతాంజలి తన వాళ్లందరినీ వదులుకుంది. అట్లాంటిది అతను పరమశాంతమూర్తిలా నిలబడటం, గీతాంజలి బెదురులేకుండా భర్తముందు నిల్చోవటం చూసి పర్వతవర్ధనికి ఆశ్చర్యం వేసింది.

ఆయన ఆప్యాయంగా పావని చదువు గురించీ, బాబూరావు ఆఫీసు గురించీ అడిగి తెలుసుకున్నాడు.

పావనికి ఆశ్చర్యంగా ఉంది. వచ్చేముందు బేబీ పర్వతవర్ధని పావనికి బోలెడు నచ్చ చెప్పి తీసుకొచ్చింది. అక్కడ ఎలాటి సన్నివే శాలు ఎదురవుతాయో ముందే ఊహించి వాటిని ఏ మాత్రం పట్టించుకోకుండా ఎలా ఉండాలో కూడా చెప్పింది.

"ఏమాత్రం మర్యాదలేని మనిషిట. ఇంటికి వచ్చిన వాళ్లతో ఎందుకొచ్చారు? మీకేం పనులు లేవా? తిని కూర్చుని తిరగ టమేనా? పొండిపొండి" అని అరిచినా అరుస్తాడుట. పావనీ, ప్లీజ్ నా కోసం అవన్నీ భరించాలి" అని బతిమాలింది.

"అంత కష్టపడి వెళ్లేది ఆయన తిట్లు తిన టానికా? మనకేం ఖర్మ" అనేసింది పావని.

"గీతాంజలికోసం భరించాలి"

"ఇన్నాళ్లయినా కూడానా? "

"ఎన్నాళ్లయినా స్నేహం స్నేహమే. ఇద్దరు ఫ్రెండ్స్ తరచూ కలుసుకుని, మాట్లా డుకునే అవకాశం ఉండకపోవచ్చు. కానీ మనసులో ఆ స్నేహం మాత్రం చెరగదు. స్నేహితులకిచ్చే స్థానం అలాగే ఉంటుంది. ఎన్నాళ్లయినా, ఎన్నేళ్లయినా గీతాంజలి నా ఫ్రెండ్ కాబట్టి నేను భరిస్తాను"

"ఓ. కే" అని ఒప్పుకుని వచ్చింది పావని. పాపం ఇంత మంచి మనిషికి జనం అలా ఎందుకు పేర్లు పెట్టి ప్రచారం చేశారా అని ఆశ్చర్యం కలిగింది. బేబీ పర్వతవర్ధనికి మాత్రం ఆయనతో పూర్వం ఒకసారి చేదు అనుభవం అయింది కాబట్టి ఆమెకు మాత్రం అతనిలో ఎందుకు ఎలా మార్పు వచ్చిందా అని ఆశ్చర్యం వేసింది.

ఆయన పనుందని బయటకు వెళ్ళిపో యాడు. బేబీ పర్వతవర్ధని ఇంక అరమరి కలు లేకుండా గీతాంజలితో మాట్లాడటం మొదలుపెట్టింది.

"మీ ఆయన దుర్వాసుడని అంటారు కదా. ఇంత మార్పు ఎలా వచ్చింది? " అడి గేసింది.

గీతాంజలి తృప్తిగా నవ్వింది.

"అంతా సింహనాదం మహర్షిగారి దయ" అంది చేతులు జోడించి.

ఆ తర్వాత సంగతి మొత్తం వివరిం చింది. గీతాంజలి భర్త ప్రవర్తనతో మొత్తం బెదిరిపోయింది. చచ్చిపోదామని కూడా అనుకుంది కానీ ఇంతలో కొడుకు పుట్టటం వల్ల చావటానికి కూడా వీల్లేని పరిస్థితి ఏర్ప డింది. ఆయన ఎవరితోనూ కలవనివ్వడు కాబట్టి గీతాంజలికి మిగిలిన ఒకేఒక్క వ్యక్తి దేవుడు. దేవుడే తనకి సర్వస్వం అని పూజలూ, వ్రతాల్లో కాలం గడిపేసింది. ఆమె పూజలు ఫలించాయి. గీతాంజలి భర్తలో మార్పు వచ్చింది. ఆయనకి చెడు అలవాట్ల మూలంగా ఆరోగ్యం చెడిపో యింది. దురలవాట్లు మానుకున్నాడు. ఆరోగ్యం కాపాడుకున్నాడు. ఆధ్యాత్మిక మార్గం అవలంభించాలని రకరకాల గురు

వుల చుట్టూ తిరగాడు. ఎంతోమంది స్వామీజీలు, బాబాలు, గురువుల్ని దర్శిం చాడు. చివరకు సింహనాదం మహర్షిగారి దయవల్ల ఆయనకు జ్ఞానోదయం అయింది. ఇన్నాళ్లూ భార్యని నిర్లక్ష్యం చేసి హింసించినందుకు సింహనాదం మహర్షి గారు గీతాంజలి భర్తను చివాట్లు పెట్టి గట్టిగా మందలించారు.

"ఏదన్నా గురుముఖతః రావాలి. నువ్వు ఇన్నాళ్ళూ బోలెడన్ని పూజలు చేశావు. కానీ నీకు గురువంటూ లేరు. గురువు నిన్ను అన్ని విధాలా కాపాడి, ఇహంలోనూ, పరం లోనూ తోడుగా ఉంటాడు. నువ్వు సింహ నాదం మహర్షిగారిని దర్శించాలి" అని గీతాంజలి భర్త ఆమెను కూడా సింహ నాదం మహర్షిగారి దగ్గరకు తీసుకెళ్లాడు.

గీతాంజలి ఆధ్యాత్మికంగా చాలా ఉన్నత స్థానాల్లో ఉందని సింహనాదం మహర్షిగారు ప్రశంసించారు. ఆమెకు మంత్రోపదేశం చేశారు. ప్రస్తుతం గీతాంజలి, భర్త ఇద్దరూ సింహనాదం మహర్షిగారి ప్రధాన శిష్యగ ణంలో ఉన్నారు. అసలు ఈ ఊరు వచ్చింది కూడా సింహనాదం మహర్షిగారి కోసమే. ఆయనకి హైదరాబాద్ శివార్లలో ఆశ్రమం ఉంది. హైదరాబాద్‌లో ఉంటే ఆయన దర్శనం చేసుకుంటూ ఉండవచ్చనీ, ఆయన సేవ చేసుకునే భాగ్యం కలుగుతుం దనీ కష్టపడి, ప్రయత్నం చేసి చేసి చివరికి ట్రాన్స్‌ఫర్ సాధించుకుని వచ్చారు.

అంతా విని బేబీ పర్వతవర్ధని చాలా ఆనందించింది.

"నేను కూడా ఆయన దర్శనం చేసుకుం టాను" అంది.

"తప్పకుండా రా. వారంరోజుల్లో ఒక ప్రోగ్రామ్ ఉంది. అది అటెండ్ అవ్వండి. వీలైతే అప్పుడే మిమల్ని ఆయనకి పరి చయం చేస్తాను" అంది గీతాంజలి.

"అవునూ. ఇంతకీ నీ విశేషాలేంటి. ఎంతమంది పిల్లలు. నాకు ఇదుగో ఈ పిల్ల ఒక్కత్తే" అంది బేబీ పర్వతవర్ధని.

"బేబీ, నాకు ఒక కొడుకు" అంది గీతాం జలి.

"ఏం చేస్తున్నాడు? "

"పదోక్లాసు...పరీక్ష రాయాలి" గీతాంజలి చెప్పింది.

"చిన్నవాడా... మా పావనికన్నా పెద్ద వాడు కాదూ మీ అబ్బాయి" పర్వతవర్ధనికి అర్థంకాలేదు.

"అవును. పావని కన్నా పెద్దే"

"పంధొమ్మిది, ఇరవై ఏళ్లు ఉండవూ? "

"ఉన్నాయి"

"మరి? ఇంకా పదోక్లాసేనా? "

"వాడు పరీక్ష రాయలేదు. రాస్తే ఎప్పుడో పాసైపోయి ఉండేవాడు. మా పిల్లాడని చెప్పడం కాదుగానీ, వాడు గొప్ప జీనియస్ అనుకో"

"మరి ఎందుకు చదివించలేదు. ఇంట్లో చదువు కుదరదంటే, పోనీ హాస్టల్లో పెట్టేస్తే పోయేది కదా" అంది బేబీ పర్వతవర్ధని.

"వాడికి చదువంటే ఇంట్రస్ట్‌లేదు. ఏవో క్లాసు పుస్తకాలు, డిగ్రీలు చదవలేదనేగానీ వాడికున్న విజ్ఞానం ఎవరికీ ఉండదు. మా గురువుగారు కూడా వాడ్ని మెచ్చుకుంటూ ఉంటారు"

"ఇంట్లో ఉన్నాడా? " అడిగింది పర్వతవ ర్ధని.

"ఆ...ముందు మీరు పకోడీలు తిని, టీ తాగండి తర్వాత వాడ్ని చూడొచ్చు. ఇంతలో వాడి ధ్యానం కూడా పూర్తవు తుంది" అంది గీతాంజలి.

వాళ్లు ఉల్లిపాయ తినరుట, టీ తాగరుట. వీలైనంతవరకూ పాలూ, పళ్లూ, పచ్చిసెన గలూ, పచ్చిపెసలూ తిని మజ్జిగన్నం, పుల్కాలు వగైరా సాత్వికాహారం తింటా రుట. అతిథులకోసం ఉల్లిపాయలూ, టీ పొడీ కొంటారుట.

టీ తాగుతుండగా తలుపు తెరిచిన చప్పుడు, నెమ్మదిగా అడుగుల సవ్వడీ విని

పించాయి.

పర్వతవర్ధని ఆసక్తిగా అటువైపు చూసింది. పచ్చటి పసుపురంగులో, మంచి ఒడ్డూపొడవుతో ప్రశాంతంగా ఉన్న మొహంతో ఇరవైఏళ్ల అబ్బాయి డైనింగ్‌హాల్‌లోకి వచ్చాడు.

"మధురానందా... ఈవిడ నా చిన్ననాటి స్నేహితురాలు బేబీ పర్వతవర్ధని. ఆ అమ్మాయి ఆవిడ కూతురు"

"ఏం పేరూ? " పర్వతవర్ధనికి అర్థంకాక అడిగింది.

"మధురానంద్. మేము పెట్టిన పేరు ప్రశాంత్. తను మార్చేసుకుని, మధురానంద్ అని పెట్టుకున్నాడు"

"నీ పేరేంటమ్మా? " మధురానంద్ పావనివైపు చిన్నపిల్లల్ని చూస్తున్నట్లు ఆప్యాయంగా చూస్తూ పలకరించాడు.

"పావని"

మధురానంద్ ఇంకేం ప్రశ్నలు వేయకుండా చేతిని అటూఇటూ ఊపి, వేళ్లు గాలిలోకి ఊగించి మళ్ళీ తనవైపు వంచుతున్నాడు.

"గాలిలో ఉన్న శక్తుల్ని తనవైపుకి, తనలోకి లాక్కుంటున్నాడు. అదొక ప్రక్రియ" గీతాంజలి చెప్పింది, పావనీ, పర్వతవర్ధనీ అయోమయంగా చూడటం గమనించి.

కొంచెంసేపయాక అతను కళ్లు తెరిచి చూసి, అంతా నిశ్శబ్దంగా తనకేసే చూడటం గమనించి చిన్నగా నవ్వాడు.

"నీ హాబీస్ ఏమిటి? " పావనిని అడిగాడు.

"ఏమీ లేవు" పావని వెంటనే సమాధానం చెప్పింది.

మధురానంద్ నవ్వేశాడు.

"రీడింగ్ హాబిట్ లేదా? "

"లేదు"

"పోనీ నా దగ్గర మంచి మంచి ఆధ్యాత్మిక గ్రంథాలున్నాయి. చదువుతావా? "

"వద్దు" వెంటనే అనేసింది పావని.

అంతా నవ్వేశారు.

"దానికి ఏ హాబీలూలేవు. ఏమిటో అదోలా ఉంటుంది. నాకు దాని గురించే చింత. అది ఇంజనీరింగ్ మానేసి మామూలు డిగ్రీలో చేరిందని నేను ఇన్నాళ్లూ బాధపడుతూ వచ్చాను. ఇప్పుడు మీ అబ్బాయి పదోక్లాసు పరీక్ష కూడా రాయకపోయినా నువ్వు చీమకుట్టినంతయినా బాధపడకపోవటం చూసి నాకు ఆశ్చర్యంగా ఉంది. మీ గురువుగార్ని నిజంగా చూడాల్సిందే. మీకు ఇంత ప్రశాంతత ఇచ్చాడంటే ఆయన మామూలు మనిషై ఉండరు" మనసులోమాట దాచుకోలేని బేబీ పర్వతవర్ధని గబగబా చెప్పేసింది.

గీతాంజలి నవ్వి ఊరుకుంది కానీ, మధురానంద్ మాత్రం మాట్లాడాడు.

"మాతాజీ" అన్నాడు.

ఎవరా ఆ మాతాజీ అని పర్వతవర్ధని చుట్టూ చూసింది. అతను తననే అలా సంబోధిస్తున్నాడని రూఢి అయి అతనివైపు చూసింది.

"మాతాజీ. మనిషి ఎందుకు చదువుకోవాలి అసలు? " అని అడిగాడు.

"ఎందుకేమిటి. చదువుకుని మంచి ఉద్యోగం తెచ్చుకుని ప్రాస్పర్ అవాలి" అంది బేబీ పర్వతవర్ధని.

"ప్రాస్పర్ అవటం అంటే? మీకు మెటీరియల్ ప్రాస్పరిటీ కావాలా; స్పిరిచ్యుయల్ ప్రాస్పరిటీ కావాలా? "

బేబీ పర్వత వర్ధనికి ఏం చెప్పాలో అర్థంకాక వెర్రి చూపులు చూసింది.

"చూశారా. సమాధానం చెప్పలేకపోతున్నారు. మనకందరికీ తెలుసు. ఈ జీవితం బుద్బుదప్రాయం. ఈ ప్రాపంచిక ఆనందాలు అన్నీ టెంపరరీ. సుప్రీమ్ సోల్ గురించి మీరు ఆలోచించాలి. డిగ్రీలూ, ఉద్యోగాల గురించి కాదు" అన్నాడు మధురానంద.

పావనికి ఆ సంభాషణలో ఆసక్తిలేదు.

బేబీ పర్వతవర్ధనికి ఆ విషయం గురించి మాట్లాడే సత్తాలేదు. సంభాషణ ముగిసిపోయింది.

ఆ తర్వాత ఏవో మామూలు పొడి మాటలు మాట్లాడుకున్నారు.

గీతాంజలి గురువుగారి ప్రోగ్రాం కరపత్రాలు కొన్ని తీసి ఇచ్చింది.

"నీకు తెలిసినవాళ్లూ, ఈ విషయాల్లో ఆసక్తి ఉన్నవాళ్లూ ఉంటే వాళ్లకి ఇవ్వు. వచ్చే వారం ప్రోగ్రాం. తప్పకుండా రండి. మీ ఆయన్ని కూడా తీసుకుని రావాలి"

"అలాగే... మా ఇంటి దగ్గర హర్ష అని హాకీ ప్లేయర్. నీకు తెలిసే ఉంటుంది, బాగా పేరున్న అబ్బాయే, పేపర్లో ఫొటోలూ అవీ వస్తూ ఉంటాయి" పర్వతవర్ధని అంది.

"ఏమో... నేను ఈ విషయాలు ఏవీ పట్టించుకోను. ఇంతకీ" ఏమిటి విషయం అన్నట్లు చూసింది గీతాంజలి.

"ఆ అబ్బాయి వాళ్లమ్మ ఒకసారి అంది. మనకూ ఎవరన్నా గురువు ఉంటే బాగుండునని. ఆవిడ వస్తుందేమో అడుగుతాను" అంది బేబీ పర్వతవర్ధని.

"వస్తుంది. హర్షని కూడా రమ్మందాం" అంది పావని ఉత్సాహంగా.

హర్షతో కలిసి ఆ ప్రోగ్రాంకి వెళ్లవచ్చన్న ఆలోచన తప్ప పావని మనసులో మరో భావంలేదు. అది తెలియని బేబీ పర్వతవర్ధని హఠాత్తుగా పావనికి ఆధ్యాత్మికత మీద ఇంత ఆసక్తి ఎలా పుట్టుకొచ్చిందా అని ఆశ్చర్యపడింది.

★ ★ ★

పావని గీతాంజలి ఇచ్చిన కరపత్రాలు పట్టుకుని హర్ష గదిలో ప్రవేశించింది. అంతకుముందే బేబీ పర్వతవర్ధని హర్ష తల్లితో మాట్లాడింది. ఆవిడ వస్తానంది. హర్ష తండ్రి ఆ రోజున ఊళ్లో ఉండడు కాబట్టి ఆయన వచ్చే ప్రసక్తిలేదు.

"ఆయన ఆశ్రమంలో ఉన్న ప్రోగ్రాం కదా ఇది. ఆశ్రమం ఊరు బయట ఉంది. అక్కడికి బస్సు సౌకర్యం సరిగ్గా లేదు. ఒకవేళ బస్సులు నడిపినా అది జనంతో కిక్కిరిసిపోయి ఉంటాయేమో. హర్ష వస్తే కారు నడుపుతాడు. హర్ష వస్తాడేమో అడుగు. నాకూ చూడాలనుంది" అంది.

పావని ఎగిరి గంతేసి, కరపత్రాలు తీసుకుని ముందుకి పరుగెత్తింది.

హర్ష గదిలో కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు. పావని దూకుడుగా రావటం చూసి నవ్వేశాడు.

"ఏంటా హడావిడి? " అన్నాడు.

"సింహనాదం మహర్షిగారి ఉపన్యాసం... ఇదుగో చూడు" కరపత్రాన్ని అతని చేతికిస్తూ చెప్పింది.

"నువ్వు కూడా భక్తిమార్గంలో ప్రవేశించావా? "

"లేదే"

"ఆయన నీకు బాగా తెలుసా? "

"లేదు"

"ఆయన గురించి విన్నావా? "

"గీతాంజలి ఆంటీ చెపితే విన్నాను"

అంతకుముందు..."

"వినలేదు. ఈ ప్రశ్నలన్నీ ఎందుకు? "

"ఏం తెలియకుండా ఎలా వెళ్లాలి? "

"గీతాంజలి ఆంటీ చెప్పింది. చాలా గొప్పవాడుట"

"అసలిక్కడ కూర్చుని గీతాంజలి ఆంటీ ఎవరో, నీకెందుకింత ఆసక్తి కలిగిందో చెప్పు" అన్నాడు హర్ష కుర్చీ చూపిస్తూ.

హర్ష ఎప్పుడూ బిజీగా ఉంటాడు. కట్ చేసి పోవటమే తప్ప సంభాషణ పొడిగించాలని చూడడు. పావని వెంటనే ఉత్సాహంగా కూర్చుంది. ఏం చెప్పాలో మాత్రం తెలియదు. నాకు ఏ ఆసక్తీ లేదు, కాసేపు నీతో గడపొచ్చనే కోరిక తప్ప అని ఎలా చెప్పాలి?

చివరికి గీతాంజలి చెప్పిన సమాచారం అంతా చెప్పింది. గీతాంజలి కొడుకు సంగతి విని హర్ష నిట్టూర్చాడు.

"సరే వస్తాను" అన్నాడు.

"అబ్బ థాంక్యూ" అంది పావని వెలిగిపో తున్న మొహంతో.

"నేను వచ్చేది ఆ సింహనాదం మహర్షిగా రిని చూడటానికి కాదు. గీతాంజలిగారి అబ్బాయికి చదువు, దాని ఆవశ్యకత వివరిం చటానికి"

"ఆ..." పావని ఆశ్చర్యపోయింది.

"అవును. పాపం వాళ్ళ అమ్మా నాన్నల ఆటలో ఆ పిల్లాడు బలిపశువయ్యాడు"

"అదేంటి?"

"అంతే. భర్త పెట్టే బాధలనుంచి రిలీఫ్ కోసం ఆవిడ భక్తి మార్గాన్ని ఎంచుకుంది. ఇక ఆయన తన ఆరోగ్యం బాగున్నన్నాళ్ళూ హాయిగా ఎంజాయ్‌చేసి, భార్యని హింసించి, చివరికి తన ఆరోగ్యం కోసం ప్రశాంతంగా ఉండటం తప్పనిసరి అయి ఆ ప్రయత్నంలో భక్తిమార్గాన్ని అవలంబించేశాడు. వాళ్ళి ద్దరూ వాళ్ళ సంగతే చూసుకున్నారుగానీ చిన్నపిల్లవాడి బాధ్యత తమమీద ఉందని ఏమాత్రం తెలుసుకోలేదు. వాళ్ళు బాధ్యతా రహితంగా ప్రవర్తించటంవల్ల కదా ఆ అబ్బాయి పదో క్లాస్ కూడా రాయకుండా కూర్చున్నాడు"

"కానీ అదేదో అన్నాడు. ఆ... మెటీరి యల్ ప్రాస్పరిటీ కాదు కావల్సింది. స్పిరి చ్యుయల్ ప్రాస్పరిటీ-అన్నాడు"

"అతనికి తను అంటున్నదానికి అర్థం ఏమిటో పూర్తిగా తెలిసి అంటే అది వేరే దారి. కానీ అతనికి తనకి కావల్సిందేమిటో తనకే తెలీదు. ఇంట్లో ఉన్న వాతావరణానికి తగ్గట్లు అయిపోయాడు. అట్లాంటివాళ్ళు ముందు ముందు విచారిస్తారు. ఒక అడుగు వేస్తే దాని గురించి ఎన్నడూ పశ్చా త్తాపపడకూడదు. నేను అతనికి చెప్పా ల్సింది చెప్పి చూస్తాను" అన్నాడు హర్ష.

"నీ ఇష్టం" అంది పావని.

★ ★ ★

సింహనాదం గురూజీగారి ఉపన్యాసం సాగిపోతోంది.

ఎక్కడినుంచి వచ్చారో, ఎలా ప్రచారం అయిందోగానీ ఇసుకవేస్తే రాలని జనం వచ్చారు. గురూజీ ప్రసంగానికి గంట ముందే అంతా అక్కడికి చేరుకున్నారు. కారు పార్క్ చేసేసరికి అరగంట పట్టింది.

ఆశ్చర్యంగా పావని కాలేజీ అమ్మాయిలు కూడా చాలామంది వచ్చారు. ఇంకా పరిచ యస్థులూ, స్నేహితులూ ఎంతోమంది ఉన్నారు.

హర్షని చాలామంది పలకరించారు. ఆ జనంలో గీతాంజలి ఎక్కడ ఉందో కనపడ నేలేదు. హర్ష కుటుంబం, పావని కుటుంబం అంతా ఒకచోట కూర్చున్నారు.

"జనాల్లో భక్తి బాగా పెరిగిపోతోంది" అంది బేబీ పర్వతవర్ధని.

"సమస్యలూ, కోరికలూ పెరిగిపోతు న్నాయి. మనిషిమీద స్ట్రెస్ పెరిగిపోతోంది. భక్తి కూడా పెరిగిపోతోంది" అంది హర్ష తల్లి.

"అక్కడ నీ ఫ్రెండ్ ఎవరో పిలుస్తోంది చూడు" బేబీ పర్వతవర్ధని పావనితో అంది.

పావని అటువైపు చూసేసరికి రుచికతో కలిసి ఫ్యాబ్రిక్ పెయింటింగ్ క్లాసులకి అటెండ్ అయిన మాలిని కనిపించింది. రమ్మన్నట్లు చెయ్యి ఊపింది.

"ఇప్పుడే వస్తానుండు" అనేసి కుర్చీలోంచి లేచింది పావని.

"తొందరగా రా... జనంలో కలిసిపోతే కష్టం" అంది బేబీ పర్వతవర్ధని.

హర్ష ఎవరో ఫ్రెండ్ కనిపిస్తే మాట్లాడ టానికి వెళ్ళి ఇంకా రాలేదు. పావని ముందుకి నడుస్తూ చూసేసరికి దూరంగా మంచినీళ్లు అరేంజ్ చేసిన స్థలం దగ్గర కని పించాడు. పావని ముందుకి నడిచి తన ఫ్రెండ్‌ని చేరుకుంది.

ఫ్రెండ్‌తో మాట్లాడి వస్తున్నాడు హర్ష. ఇంతలో ఒక్కసారిగా జయజయధ్వానాలు మొదలయ్యాయి. అటూ ఇటూ ప్రధాన

శిష్యులు బాడీగార్డుల్లా కాపలాగా వరుసగా నడుస్తుండగా, మధ్యలో హుందాగా నడుస్తూ, చరచరా స్టేజ్ ఎక్కుతున్న స్వామీజీని చూసి భక్తులంతా పరవశించి జయజయధ్వానాలు చేస్తున్నారు. కొందరు రెండు చేతులూ పైకెత్తి దండం పెడుతున్నారు. కొంతమంది పారవశ్యంతో కళ్లు మూసుకుని ఉన్నారు. జనం అంతా కుర్చీల్లోంచి లేచి నిలబడిపోయారు. కుర్చీలు దొరకనివాళ్ళు ఎలాగూ నిలబడే ఉన్నారు. అంతా కోలాహలంగా ఉన్న ఆ సమయంలో...

ఉన్నట్లుండి ఠాప్‌మని ఒక కాగితం ఎగురుతూ వచ్చేసి, హర్ష గుండెకి బలంగా తాకి కిందపడబోయింది. కాగితంమీద అతికించిన ప్రింటు అక్షరాలు. హర్ష దాన్ని కసిగా లాగి పట్టుకుని గభాల్న జేబులోకి నెట్టేశాడు.

అందులో ఏం రాసిఉంటుందో అతను ఊహించగలడు.

కానీ ఆ విసిరినవాళ్ళు అసలు అలాంటి స్థలంలో ఇలాటివి విసరటానికి వాళ్ళ మనసెలా ఒప్పింది? హర్షకి తెలియని ఆ మనిషిమీద అసహ్యం కలిగింది.

ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు గీతాంజలీ వాళ్ళు కనిపించారు.

హర్షని పరిచయం చేసింది పావని.

"మా ఇంటికి రండి" ఆహ్వానించింది గీతాంజలి.

"తప్పకుండా వస్తాం" అన్నాడు హర్ష.

"ఎప్పుడో తీరిగ్గా వెళ్ళి మధురానందకి బ్రెయిన్ వాష్ చేస్తాను" అన్నాడు హర్ష పావనితో.

"ఎంత ఘోరం జరిగిందో తెలుసా? ఎదురింటి బ్రహ్మంగారి అమ్మాయి యాక్సిడెంట్‌లో చచ్చిపోయిందిట" బేబీ పర్వతవర్ధని పావనితో చెప్పింది.

"ఎవరూ? సుచీనా? అయ్యో ఎలా పోయింది? ఎప్పుడూ? " పావని ఆందోళనగా అడిగింది.

"అయ్యో... ఎప్పుడూ? " బాబూరావు నిద్రలేచి వస్తూ ఆందోళనగా అడిగాడు.

"నిన్న అర్ధరాత్రి తెలిసిందట వీళ్ళకి" అంది పర్వతవర్ధని.

"అసలేం జరిగింది? "

"ఆ అమ్మాయి వీళ్ళకి తెలియకుండా ఎవరో అబ్బాయితో తిరుగుతోందిట. రోజూ సాయంత్రం కంప్యూటర్ క్లాసులంటూ వెళ్ళి అతనితో తిరిగి రాత్రి పదిగంటలకి వస్తుందిట. నిన్న రాకపోయేసరికి ఎవరన్నా ఫ్రెండ్ ఇంటికి వెళ్ళిందేమో, ఫోన్ చేస్తుందని ఎదురు చూస్తున్నారుట. అర్ధరాత్రి పోలీసుల దగ్గర్నుంచి ఫోన్ వచ్చిందిట. ఆ అబ్బాయీ సుచీ కల్సి మోటార్‌సైకిల్‌మీద వెళ్తుంటే యాక్సిడెంట్ అయిందిట. సుచీ అక్కడికక్కడే చచ్చిపోయిందిట. తల్లిదండ్రులకి ఎంత షాక్ చూడు"

"లిఫ్ట్ ఇస్తున్నాడేమో" అంది పావని.

"కాదు. ఫ్రెండ్సందరికీ లవర్ అని తెలుసుట. ఇంట్లోవాళ్ళకే తెలీదు. వాళ్ళకి ఇదో షాకు"

బాబూరావు మౌనంగా వింటున్నాడు.

"ఇంటికి తీసుకువచ్చారా? " అడిగింది పావని.

"ఏమో. చదువుకోండి తల్లీ అని పంపిస్తే ఇవీ వేషాలు. పదిహేనేళ్ళు రాగానే బాయ్‌ఫ్రెండ్ కోసం అమ్మాయిలూ, గర్ల్‌ఫ్రెండ్ కోసం అబ్బాయిలూ వేటాడుతుంటారు. తల్లిదండ్రుల గురించి ఎవరికీ పట్టదు. తమనింత ప్రేమగా పెంచి పెద్దచేస్తున్న వాళ్ళ ఆశలు నిలబెట్టాలన్న జ్ఞానం ఉండదు. ప్రేమ... ప్రేమ... ప్రేమ ఆ ప్రేమలో ఫెయిల్ అయితే ఆత్మహత్య" అంది బేబీ పర్వతవర్ధని.

"ఈ కాలం సినిమాలు కూడా అలాగే తయారయ్యాయి. ఏ సినిమా చూసినా ప్రేమా, లవ్, అంతే. ప్రేమకన్నా గొప్పది ఇంకోటి లేదనీ, ప్రేమిస్తేనే మనిషనీ నినా

దాలు. వీళ్లకి జీవితంలో ఇంకేదీ అక్కర్లేదు. ప్రేమ పీల్చి ప్రేమ తిని, ప్రేమ తాగి పడు కోండి అంటారు" కసిగా అంది పర్వతవర్ధని.

"ఏ కాలమైనా అంతేలే. పాతకాలంలో కూడా మనకి తెలిసి ఎన్ని ప్రేమకథలు లేవు. కానీ అప్పుడు కుటుంబానికి కూడా కాస్త ప్రాముఖ్యం ఇచ్చి కథ నడిపేవాళ్ళు. ఇప్పుడు అన్నీ న్యూక్లియర్ సంసారాలు. ఎవడిగోల వాడిది. ఎవడి బాధ వాడిది. అలాగే ఎవడి ప్రేమ వాడిది. ఎవరికి వాళ్ళకి వాళ్ళ ప్రేమ తప్ప మరొకటి కనిపించదు" అన్నాడు బాబూరావు.

"అంతేలెండి. మన పావనిలా ఇంకా పాతకాలం మనుషులు కూడా ఉన్నారు" అంది బేబీ పర్వతవర్ధని పావనివైపు అపురూపంగా చూస్తూ.

పావని ఆమె మాటలు వినిపించుకోలేదు. రోడ్డుమీదికి చూస్తోంది.

హర్ష తన మోటార్‌సైకిల్ మీద వేగంగా దూసుకుపోవటం కనిపించింది.

ఎగిరి దూకి ఆ మోటార్‌సైకిల్ వెనక ఎక్కేసి, అతని నడుముచుట్టూ చెయ్యివేసి కరుచుకుని కూర్చోవాలని వెర్రి ఆవేశం కలిగింది పావనికి.

అలా కూర్చున్నప్పుడు యాక్సిడెంట్ అయి. తమా సుచీలా చచ్చిపోతే...

అలా చచ్చిపోయినా సరే.. ఎంతో బాగుంటుంది ఆ చావు అనిపించింది.

హర్షని లిఫ్ట్ అడిగే ధైర్యం లేదు పావనికి. అందుకే తన కోరికని అణిచేసుకుని ఇన్నాళ్ళూ మౌనంగా ఉండిపోయింది.

"పావని చూశారా! అదోలా తయారయింది. మూడీగా, కోపంగా ఉంటుంది. లేకుంటే డల్‌గా ఉంటుంది. ఏమిటో? దేనికి ఎలా రియాక్ట్ అవుతుందో తెలీదు. ఏమడగటానికీ చాలా భయంగా ఉంది" బేబీ పర్వతవర్ధని బాబూరావుతో గోడు వెళ్ళబోసుకుంది.

ఆయన వింటూ తల ఊపాడు.

"అన్నీ అది అడిగినట్లే చేస్తున్నా. ఇంకా ఎందుకిలా ప్రవర్తిస్తుందో అర్థం కాదు. ఆడింది ఆటా! పాడింది పాటా. అయినా ఇంకా ఏడుపు మొహం. ఆ మూడీతత్వం మారకుంటే ఏం చేయగలం? ఇంజనీరింగ్‌లో చేరి వుంటే ఎంత బాగుండేది! ఏ సంబంధం వెతికినా ఇంజనీరింగ్ చదివి ఉండాలంటున్నారుట. మా రాధక్కయ్య చెప్పింది. వాళ్ళ పిల్ల బి. ఫార్మసీ చదువుతోందికదా. దానికే పెళ్ళి అవుతుందో, కాదోనని రాధక్క భయపడుతోంది. మీ పావని బి.కామ్ కదా, పెళ్ళి కుదరటం బోలెడు కష్టం అంది. అయినా మనం ఎంత కష్టమైనా పడి మంచి సంబంధం ఎలాగో వెతుకుదాంలే అని దానికి ఇష్టమైన చదువే చదవనిస్తున్నాంకదా. అయినా విశ్వాసం లేదు. మనల్నసలు లెక్క చెయ్యదు" మళ్ళీ మొత్తుకుంది పర్వతవర్ధని.

బాబూరావుకి పావని బి.కామ్‌లో చేరేటప్పుడు తను మిత్రులతో జరిపిన సంభాషణ గుర్తుకొచ్చింది.

ఆరోజు రాజీవరావింట్లో మందుపార్టీ. రాజీవరావు భార్య ఊరుకి వెళ్ళింది. ఆ అవకాశాన్ని పురస్కరించుకుని మందు పార్టీ చేసుకోవాలని వాళ్ళింట్లో ఏర్పాట్లు చేసుకున్నారు. ఎవరెవర్ని పిలవాలో నిర్ణయించుకున్నారు. ఈ సంగతి ఎలా పసికట్టాడోగానీ నరం తనూ వస్తానన్నాడు ఎగిరి గంతేస్తూ వచ్చి నరం పేరు నారాయణ. వాళ్ళ ఇంట్లో ముద్దుగా నరం అని పిలుస్తుంటే చివరికి ఆ పేరే స్థిరపడిపోయింది.

రాజీవరావు ఇంట్లో పార్టీ కాబట్టి కాస్త బాలన్స్‌డ్‌గా ఉండే వాళ్ళనే పిలవాలని నిర్ణయించుకున్నాడు. వెంకటేశ్వర్రావు, వెంకోబారావు ఎంత తాగినా నిశ్చలంగా బాలన్స్‌డ్‌గా కూర్చుంటారు. మిత్రబృందంలో ఎవరు తమ ఇళ్లల్లో పార్టీ అరేంజ్ చేసినా వాళ్ళకి మాత్రం తప్పకుండా ఆహ్వానం వెళు

తుంది. వాళ్ళకి పూర్తిగా వ్యతిరేకం అంటే నరం మాత్రమే. ఒక్క చెంచాడు మందు నోట్లోకి పోగానే మనిషి బాలన్స్ తప్పిపోతాడు. అరిచి గోలచేస్తాడు. అందర్నీ కొట్ట బోతాడు. రకరకాల చేష్టలు చేస్తాడు. అతన్ని పిలవాలంటే అందరికీ భయం. అసలే ఇళ్ళ దగ్గర పార్టీలంటే చుట్టు పక్కలవారికి తెలియకుండా రహస్యంగా చేసుకోవాలని అనుకుంటే, నరం వచ్చి అరుచుకుంటూ గోలచేసి, అందరిలో పరువు తీస్తాడని భయం. కానీ ఎవరు ఎక్కడ పార్టీ చేసినా, ఏమాత్రం తెలిసినా నరం ఎగిరివెళ్ళి వాలతాడు. బార్లో డబ్బులిచ్చి తాగటం వేరు, ఫ్రెండ్సుతో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ తాగటం వేరని అంటాడు. 'నీ సరదా మా ప్రాణం తీయకూడదు బాబూ! నువ్వు నీ ఇంట్లోనో, బార్‌లోనో మాత్రమే తాగటానికి ఫిట్. మా ఇళ్లకి రాకు' అని స్నేహితులు ఖచ్చితంగా చెపుతారు. నరంకి సిగ్గూ, శరం లాంటివేవీ లేవు. "పాపం అంతా మన వాళ్ళే. వాళ్లేమన్నా అంటే కోపం తెచ్చుకోకూడదు" అని వాళ్ళన్నవేవీ పట్టించుకోకుండా మందుపార్టీలు జరుగుతుంటే తయారైపోతాడు. అతనికి చెప్పి లాభంలేదని అందరికీ తెలుసు.

"నరం మందుపార్టీనా? అదేంలేదు. నీకెవరో రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చారు" అని చెప్పేశాడు రాజీవరావు.

నరం నమ్మలేదు. పార్టీ టైమ్‌కి వచ్చేసి అందర్నీ రెడ్ హాండెడ్‌గా పట్టేసి, తనూ పార్టీలో ప్రవేశించేశాడు.

పార్టీ సాగిపోతోంది. అంతా తలా ఒకటీ మాట్లాడేస్తున్నారు.

"ఆమధ్య ఒక స్వామీజీ ఉపన్యాసం విన్నాను. ఆయన చెప్పారు, అన్ని దానాలలోకి అన్నదానం గొప్పదిట. ఎందుకంటే ఏది దానం చేసినా మనిషిని పూర్తిగా సంతృప్తి పరచలేం. ఉదాహరణకు వస్త్రదానం... బట్టలు దానం చేశామనుకో. ఎన్ని డ్రెస్సులిచ్చినా చాలు అని ఏ యాచకుడైనా అంటాడా? సువర్ణ దానంచేసి అయినా సరే అవతలివాడిని సంతృప్తి పరచలేం. ఎన్ని ఇచ్చినా ఎంత ఇచ్చినా అవతలి వాడిచేత చాలు అని తృప్తిగా అనేట్లు చేయలేం. అదే అన్నదానం చేశామనుకో కడుపునిండేట్లు తిండి పెడితే చాలు, తిన్నవాడు తృప్తిగా ఇక చాలు అంటాడు. అందుకని అన్ని దానాలలోకీ మనిషిని పూర్తిగా సంతృప్తి పరచగల దానం అన్నదానం అని చెప్పారాయన" అన్నాడు రాజీవరావు.

"ఇదంతా మాకెందుకు చెబుతున్నావు? ఇదుగో ఈ పల్లీలూ, పకోడీలూ, జీడిపప్పూ ప్లేట్లల్లో పెట్టినందుకా? " బాబూరావు నవ్వుతూ అడిగాడు.

"పూర్తిగా వినకుండా మాట్లాడకూడదు. నా ఉద్దేశంలో సురాదానం అంటే కాస్త డ్రింక్ ఇప్పించటం కన్నా గొప్పదానం మరొకటి లేదు"

"అది ఎలా? "

"చెపుతాను. సర్వేంద్రియాలనూ ఆనంద పరచగలిగేది మద్యం. పంచేంద్రియాలు అంటే నాలుక, కన్ను, ముక్కు, చెవి, చర్మం. ఈ పంచేంద్రియాలూ మనిషి డోస్ పుచ్చుకున్నప్పుడు ఆనందిస్తాయి. కన్ను డ్రింక్‌ని చూస్తుంది. ముక్కు ఆ వాసనని ఆఘ్రాణిస్తుంది. నాలుక ఆ రుచి చూసి ఆనందిస్తుంది. గ్లాసుల గలగలనీ, ఛీర్స్ శబ్దాన్నీ విని చెవి పరవసిస్తుంది. అందుకని ఒక మనిషి పంచేంద్రియాలనూ పరవశింపచేయించేది గనకే దీన్ని సుర అంటే అమృతం అన్నారు. అందుకే నేను అప్పుడప్పుడూ డ్రింక్ పార్టీలు పెట్టి సురాదానం చేసి పుణ్యం గడిస్తున్నాను"

"గడిస్తే గడించావుగానీ ఇవన్నీ ఇంట్లో ఆడవాళ్ళకి చెప్పకు. మా ఇళ్లల్లోగానీ తెలిసిందంటే మమ్మల్ని చావచితగ్గొడతారు. మొన్న మా ఆవిడ ఎవర్నో తాగుతాడని తిట్టిపోస్తుంటే నేనూ వంతపాడాను, కాస్త

ఎఫెక్టివ్‌గా ఉండాలని" అన్నాడు బాబూ రావు.

"మన ఆరోగ్యం కోసమేగా వాళ్లు వద్దని బతిమాలేది. అందుకే నేను కూడా కొత్తగా ఎవరైనా తాగటం ప్రారంభిస్తే వద్దని బతిమాలి చెపుతాను. ఒకసారి అలవాటైతే మానుకోవటం కష్టం. నాకూ విరక్తి పుడు తోంది. ఎప్పుడో మానేస్తాను" అన్నాడు వెంకోబారావు. తాగి తాగి ఆరోగ్యం చెడింది అతనికి. సంభాషణ మళ్ళీ మామూలు విషయాల్లోకి మళ్లింది. "పావనిని ఏ బ్రాంచ్‌లో చేర్పించావు? " అడిగాడు వెంకోబారావు.

"బ్రాంచ్ ఏమిటి? " బాబూరావు అర్థంకాక అడిగాడు.

"అదే... ఏ సబ్జెక్ట్ అని. ఎలక్ట్రికలా? ఎలక్ట్రానిక్సా? ఇంజనీరింగ్‌లో ఏవేవో ఉంటాయిగా"

"అవేవీ కాదు. అసలు ఇంజనీరింగ్ కాదు తను చదువుతున్నది"

"మరి? " ఆశ్చర్యపోతూ అడిగాడు వెంకోబారావు.

"బి.కామ్‌లో చేరింది"

"బ్రిలియంట్ స్టూడెంట్ కదా... సీట్ రాలేదా? "

"సీట్ రాకపోవటం కాదు. ఇంజనీరింగ్ వద్దనుకుని బి.కామ్‌లో చేరింది" నిట్టూరుస్తూ చెప్పాడు బాబూరావు.

"పిల్లలు ఏం కావాలనుకుంటే అదే కానివ్వటం మంచిది. మనం సలహా ఇవ్వవచ్చు అంతే. మన అభిప్రాయాలు వాళ్ళ నెత్తిన రుద్దకూడదు" అన్నాడు వెంకోబారావు.

"అభిప్రాయాలు రుద్దటమా? ఏ కాలంలో ఉన్నావు నాయనా! అది మన తరంలో జరిగేది. మనది దరిద్రపుతరం. అటు మన పెద్దవాళ్ళచేత అప్పుడు తాపులు తిన్నాం. ఇప్పుడు పిల్లల్ని చూసి వణికిపోతున్నాం. అటూ ఇటూ కూడా తాపులు తింటున్న తరం మనది" సరైన ముక్కలు రాలేదన్న బాధతో ఏడుపు గొంతుపెట్టి చెప్పాడు రాజీవరావు.

"ఇది మాత్రం నిజం" అంతా ఒప్పుకున్నారు.

"ఇంతకీ మీ వాళ్ళు ఎక్కడికి వెళ్ళినట్లు? " కాసేపు అయ్యాక అడిగాడు వెంకటేశ్వర్రావు.

"కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది" అన్నాడు రాజీవరావు.

"పడకుండా ఏదన్నా అడ్డం పెట్టుకో. అయినా అంత బాధ పడేందుకు ఏముంది నీకు? హాయైన జీవితం" అన్నాడు వెంకోబారావు.

"హాయి లేకుండా చేస్తోంది నా సుపుత్రిక" ఏడుపుగొంతు పెట్టి చెప్పాడు రాజీవరావు.

"ఏం చేస్తోంది? " అంతా ఒకేసారి అడిగారు.

"దానికి సినిమాల్లో నటించాలని ఉందిట"

"అయితే? "

"వేషాలు ఇప్పించమని ఒకటే గొడవ చేస్తోంది. మా ఆవిడకి వరసకి తమ్ముడు ఒకడు చెన్నైలో ఉన్నాడు. అతనికి కొందరు ప్రొడ్యూసర్లు తెలుసుట. ఫోన్‌చేసి బతిమాలారు. సరేనండి. అడిగి చూద్దాం, అన్నాడు. వీళ్ళు వెళ్ళారు" చెప్పాడు రాజీవరావు.

అంతా తమ తమ పిల్లలు పెడుతున్న కష్టాలు చెప్పుకున్నారు.

★ ★ ★

"హర్షా, మధురానంద్‌తో మాట్లాడావా? " పావని అడిగింది.

"లేదు. సమయం దొరకటంలేదు" అన్నాడు హర్ష. హర్ష ఒకరోజు తీరిక చేసుకుని వాళ్ళ ఇంటికి వెళ్తే ఆరోజు మధురానంద్ పూర్తిగా ధ్యానంలో ఉండిపోయాడు.

"అయినా అతని గొడవ నీకెందుకు? " అంది పావని. "అతను సింహనాదం గురూజీ గారికి ప్రధాన శిష్యుడు కాబోతున్నాడు కూడానట" అంది.

"ప్రధాన శిష్యుడంటే? "

"అంటే ఏమిటో మరి..." పావనికి

అసలు అంతవరకూ అలాటి ప్రశ్న కలగ లేదు.

ఆ సంభాషణ వింటున్న హర్ష తల్లి కల గజేసుకుంది.

"ప్రధాన శిష్యుడంటే... ఆయన సమక్షం లోకి ఎప్పుడన్నా వెళ్ళవచ్చు"

"లేకపోతే? "

"లేకపోతే... ఆయన పర్మిషన్ తీసుకుని ఇంటర్వ్యూ తీసుకుని వెళ్ళాలి"

హర్ష నవ్వేశాడు.

"నవ్వకు. ఆయన దగ్గరికి వెళ్ళటం తేలి కైన విషయం కాదు. ఆయన ఆశ్రమం చూశావుగా. ఇరవై ఎకరాల తోటలో కట్టారు. అబ్బ ఎంత బాగుందో. ఆ పూల చెట్లూ, పళ్ల చెట్లూ మధ్యలో పొదరిళ్లలో కుటీరాలూ..."

"ఈ రోజుల్లో అన్నిటికన్నా తేలిగ్గా డబ్బులు సంపాదించగలిగే ఫీల్డులు రెండే. ఒకటి రాజకీయరంగం, రెండు ఆధ్యాత్మిక రంగం" హర్ష నవ్వేశాడు.

"అలా వెక్కిరించకు" హర్ష తల్లి చిరుకో పంతో అంది.

"అబ్బా. వెక్కిరించటం లేదమ్మా. ఉన్న విషయం చెప్పాను. మీ చిన్నాన్న కొడుకు, అదే మన చిదంబరం మామయ్య లేడూ. హాయిగా ఆధ్యాత్మిక రంగంలో ప్రవేశించి, రెండేళ్ళు దాటకుండానే రెండు మేడలు కట్టి, పదెకరాల భూమి కొనలేదూ? " హర్ష నవ్వుతూ అడిగాడు.

తల్లి కోపంగా చూసి వెళ్ళిపోయింది. రాజీ వరావు కూతురు వెళ్ళిన పదిరోజులకల్లా తిరిగి వచ్చేసింది.

"ఏమేం చేయగలవు? ఎలాటి రోల్స్ చేస్తావు? ఏ డ్రెస్‌లు నీకు నప్పుతాయి" అని రకరకాల ప్రశ్నలు వేశారుట.

"ఏ రసం అంటే నీకిష్టం? " అని అడిగా రుట. ప్రిపేర్ అయి వెళ్ళని కారణంగా షఫాలీ తెల్లమొహం వేసిందిట.

తెలిసినవాళ్ళు కదా, హీరోయిన్ రోల్ కాకపోతే కనీసం సైడ్‌రోల్స్ అయినా ఇవ్వ కపోతారా అని ధీమాగా వెళ్ళిన షఫాలీ, తల్లీ అక్కడి వాతావరణం చూసి తెల్లబో యారు.

పదిరోజులు చాలా చాలా కష్టపడి తిరి గినా ఫలితం దక్కలేదు.

"సినిమా నిర్మాణం అంటే చాలా రోజులు పడుతుంది. మీరు కనీసం ఒక ఏడాది అయినా ఉండి ట్రై చేయండి" అన్నాడు వాళ్ళ బంధువు.

"తెలుగు సినిమా పరిశ్రమ ఎటూ హైద రాబాద్‌కి తరలి వచ్చేసింది కదా, అక్కడే ఉండి ప్రయత్నించుకోండి" అని కూడా అన్నాడు.

"ఇక్కడ నీకు తెలిసిన వాళ్ళ ద్వారా ఏదన్నా ఛాన్స్ ఇప్పిస్తావేమోనని వచ్చాం" అంది రాజీవరావు భార్య.

"నేను కొంతమందిని రికమెండ్ చేశాను. వాళ్ళకి ఛాన్స్ ఇచ్చారు. మనమ్మాయికే, ఏంటో ఎక్కడికి వెళ్ళినా లాభం లేకుండా ఉంది. పాపం మీరు ఇంత దూరం వచ్చి కూడా ఉపయోగం లేకుండా పోయింది" బంధువు బాధపడుతూ అన్నాడు.

రాజీవరావుతో ఫోన్‌లో మాట్లాడారు.

"తిరిగి వచ్చేయండి. ఏం చేస్తాం? " అన్నాడు రాజీవరావు.

తిరిగి వచ్చి హైదరాబాద్‌లో సినిమా రం గంలో తెలిసిన వాళ్ళెవరు ఉన్నారా అని ఎంక్వైరీ చేస్తున్నారు.

పావనికి తనలో వచ్చిన మార్పు తనకే తెలిసిపోతోంది. మతిమరుపు హెచ్చింది. పరధ్యానం పెరిగింది. అసహనం, కోపం పెరిగాయి. హర్ష తనకి దక్కడేమోనన్న భయం, హర్ష ప్రేమని పొందలేనేమోనన్న ఆందోళన ఆమెని నిర్వీర్యం చేసేస్తున్నాయి.

"నేరుగా అడిగేసెయ్యి. ఎందుకూ భయ పడతావు? ప్రేమించటం నేరం కాదుగా" అంది రుచిక.

"అమ్మో. హర్షకి కోపం వస్తే. అతని

మనసేంటో తెలియకుండా ఎలా అడగాలి? " అంది పావని.

"అందుకని? ఇలా పిచ్చిదానిలా మారిపోతావా? ప్రేమిస్తారుగానీ, ఇంత పిచ్చిగా ప్రేమించేవాళ్ళని నేనెక్కడా చూడలేదు. మరీ అతిగా ఉంది" అంది రుచిక.

"ఎందుకూ? ప్రేమలోపడి సామ్రాజ్యాలు, ప్రాణాలు పోగొట్టుకున్నవాళ్లు బోలెడంత మంది ఉన్నారు" పావని మొండిగా అంది.

రోషిణి ప్రయత్నం సఫలం కాలేదు. దానికి రెండు కారణాలున్నాయి. ఏదో అప్పటికప్పుడు తాత్కాలిక



ఆనందంకోసం వెక్కిరించి, డాన్స్ చేశారుగానీ ఆ తర్వాత ఎవరూ మళ్లీ ఆ విషయం పట్టించుకోలేదు. హర్ష అంటే ఉన్న హీరో వర్షిప్ వల్ల కాబోలు, ఎవరూ మళ్ళీ టీజ్ చెయ్యలేదు. పది నిమిషాల్లో అంతా చల్లబడిపోయింది.

రెండోకారణం రోషిణి అతన్ని అంచనా వెయ్యటంలో పొరపాటు పడటం. హర్షకి అచంచలమైన గుండె దిటవు ఉంది. వీటిని పట్టించుకుని, మనసు చెదరగొట్టుకునే బలహీనత అతనిలో లేదు.



ఈ రెండు కారణాలవల్లా రోషిణి విసిరిన కాగితం హర్షమీద ఏ ప్రభావమూ చూపలేకపోయింది. ఇంతలోనే క్లాసులో మళ్ళీ కాగితం ఎగిరి వచ్చి పడింది. హర్ష పట్టించుకోలేదు.

పావని మాత్రం దీన్ని భరించలేకపోతోంది. ఆ కాగితం విసిరిన వాళ్లు ఎవరు, అన్న ఆలోచన ఆమె మనసుమీద సుత్తిదెబ్బలు కొడుతూనే ఉంది.

అయినా తెలుసుకుని మాత్రం ఏంలాభం. హర్షని ఎంతోమంది లవ్ చేస్తున్నారు. వాళ్ల ప్రయత్నాలు వాళ్లు సాగిస్తూనే ఉంటారు.

వీటన్నిటినీ ముగించగలిగే ఒకేఒక్క పని... హర్ష తనని ప్రేమించటం.

ఈ కాగితాల రాకెట్లు ఆగిపోతాయి.

తామిద్దరూ ప్రేమికులమని తెలిస్తే చాలు. అప్పుడు ఇంక అతనికోసం ట్రైచేసే వాళ్ల ప్రయత్నాలు ఆగిపోతాయి.

హర్షమీద పావనికి ఒళ్లు మండిపోయేంత కోపం వచ్చింది.

ఆఖరికి తను కూడా అదేవిధంగా కాగితం విసురుదామన్నంత విసుగు వచ్చింది.

"బండ వెధవా" అని అరుద్దామనిపించింది.

క్లాసు ఖాళీ అయింది.

హర్ష ఏదీ పట్టించుకోకుండా వేగంగా క్యాంటీన్‌వైపు వెళ్లాడు.

ఒక టీ తెచ్చుకుని, మూలగా ఉన్న టేబుల్ దగ్గర వెళ్ళి కూర్చున్నాడు.

పావని అతని ఎదురుగా వెళ్ళి కూర్చుంది.

"ఏంటి ఇలా వచ్చావు? " నవ్వుతూ అడిగాడు హర్ష.

"ఏంలేదు. నువ్వేమన్నా అప్‌సెట్ అయ్యావేమోనని? "

"మైండ్ కరెక్ట్‌గా సెట్ చేసుకుంటే అప్‌సెట్ అవటం అంటూ ఉండదు"

"వెరీగుడ్. అందుకే నువ్వంటే"

"ఊ నేనంటే" అని హర్ష నవ్వుతూ అడు గుతాడేమోనని ఎదురు చూసింది పావని.

కానీ అతను ఆమాటని పట్టించుకున్నట్లే లేదు. చాలా కాజువల్‌గా తల తిప్పుకుని ఎటో చూస్తున్నాడు.

పావని అతనివైపు తదేకంగా చూస్తోంది. అతను ఒక చేతిని టేబుల్‌మీద ఉంచి, మరోచేత్తో టీ తాగుతున్నాడు. బలంగా, దృఢంగా ఉన్న చేతులమీది వెంట్రుకలు పావని గుండెలో చక్కిలిగింతలు పుట్టిస్తు న్నాయి. అతని పెదవులు తాగుతున్న ఆ టీకప్పు తనే అయిపోతే ఎంత బాగుంటుం దన్న కోరిక కెరటంలా లేస్తోంది.

హర్ష ఒక్కసారిగా తల తిప్పి చూశాడు. పావని తన చూపుల్తోసహా పట్టుబడిపో యింది. అతను ఒక్కక్షణం కనుబొమలు ముడిచి మొహం చిట్లించాడు.

పావని గుండె కలుక్కుమంది. చటు క్కున తల తిప్పేసుకుని, ఎటోచూస్తూ కూర్చుంది. అతనికి కోపం వచ్చిందేమోనని భయంవేసింది.

ఇంతలోనే హర్ష లేచి, తన బ్యాగ్ భుజా నికి తగిలించేసుకుని, గబగబా బయటకు నడిచాడు.

పావని భయంగా, ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది. అతను కనుమరుగైపో యినా, ఆమె దృష్టిపథంలోంచి అతను మాయం కాలేదు. ఇంకా అతను అక్కడే ఉన్నట్లు ఆవైపే చూస్తూ ఉండిపోయింది.

హఠాత్తుగా గలగలా ఎవరో విరగబడి నవ్వారు. పావని ఉలిక్కిపడి తలతిప్పింది.

అపర రతీదేవిలా, కలియుగ మోహినిలా నిలువెల్లా అందంతో మెరిసిపోతూ, ప్రియాంక అక్కడ నిలబడి ఉంది.

తీర్చిదిద్దినట్లున్న కనుముక్కు తీరు, పట్టు కుచ్చుల్లాంటి జుట్టు, అయిదడుగుల ఏడంగు ళాల బంగారు తీగెలాంటి శరీరం, శిల్పసుం దరిలాంటి శరీరాకృతి. ప్రియాంకని చూసిన వాళ్లెవరూ కళ్లు తిప్పుకోలేరు.

మిస్ ఆంధ్రప్రదేశ్‌గా ఎన్నిక అయింది ప్రియాంక. మిస్ ఇండియాగా ఎన్నిక కావా లని ట్రై చేస్తోంది. ఎప్పుడో తప్ప కాలేజీకి రాదు.

"ఏమిటీ? లవ్ చేస్తున్నావా? " నవ్వుతూ అడిగింది. ఆ నవ్వులో వెటకారం, తూష్కారం.

పావని కోపంగా తల తిప్పేసుకుంది.

"ఏం... చెపితే అరిగిపోతావా? అయినా దాచాలని చూసినా దాగదులే. కానీ ఏంలాభం? వన్‌వే ట్రాఫిక్‌లా ఉందిగా" ప్రియాంక వెటకారంగా నవ్వుతోంది.

"అది నీకనవసరం" రోషంగా చెప్పింది పావని.

"అవునమ్మా... అనవసరమే. ఊరికే ఉబుసుపోక అడిగానుగానీ, నీ సంగతి నాకెందుకు? "

"మంచిది, గ్రహించావుగా. ఇక దయ చెయ్యి" కోపంగా అంది పావని.

"వెళ్తాన్లే. ఒక సోడా తాగి వెళ్దామని వచ్చాను." అనేసి ఒక క్లబ్‌సోడా తెచ్చుకోవా లని వెళ్లింది ప్రియాంక.

ఈ లోపల పావని చరాల్న అక్కడ్నుంచి లేచి వచ్చేసింది. వెనకాల ప్రియాంక ఎవ రికో ఏదో చెప్పి, విరగబడి నవ్వటం వినిపి స్తూనే ఉంది.

పొగరుబోతు గుర్రం. మిస్ ఆంధ్రప్రదేశ్ ననీ, అందంగా ఉంటాననీ, చలాకీగా మాట్లాడుతాననీ చచ్చే గర్వం దానికి.

ప్రియాంకని ఏదో ఒకటి అని గాయపర చాలని, చివుక్కున వెనక్కు తిరిగి మళ్లీ వచ్చింది పావని.

సరిగ్గా అప్పుడే ప్రియాంక పావనివంక వేలుపెట్టి చూపిస్తూ ఏదో చెపుతోంది.

"ఏంటే? ఏం చెప్తున్నావ్. నావైపు వేలు పెట్టి చూపిస్తున్నావ్... మజాకాగా ఉందా? " కోపంగా అడిగింది పావని.

ప్రియాంక విరగబడి నవ్వింది.

"మజాకాగాలేదు. ఏం? నీ తడాకా చూపిస్తావా? అసలు చూపించేందుకు నీదగ్గర ఏం టాలెంట్ ఉందనీ? ఎంతసేపూ వన్‌వే ట్రాఫిక్ లవ్ తప్ప నీ దగ్గర ఏం ఉంది?" ప్రియాంక నవ్వుతూనే అడిగింది.

పావని మొహం ఎర్రబడిపోయింది.

"ఏంమాట్లాడుతున్నావో తెలుసుకుని మాట్లాడు. ఏదో పట్టించుకోక ఇలా ఉండిపోయానుగానీ"

"లేకుంటే మిస్ ఇండియావైపోయేదానివా లేక మిస్ యూనివర్స్‌వయేదానివా?"

"మనుషులంటే మిస్ ఇండియాలూ, మిస్ యూనివర్స్‌లే కాదు, ఇంకా చాలా రకాల గొప్పతనాలున్నాయి"

"ఓహో... మాటలు బాగానే వచ్చే సర్లే ఏమయ్యేదానివబ్బా?" ఆలోచిస్తున్నట్లు గడ్డం మీద వేలువేసుకుని భంగిమ ఇచ్చింది ప్రియాంక.

పావనికి ఒళ్లు మండిపోయింది.

"ఏమైనా అయ్యేదాన్ని. కానీ నీలాగా చిన్న అచీవ్‌మెంట్‌కే ఎగిరెగిరి పడేదాన్ని మాత్రం కాదు" విసవిసా బయటకు వచ్చేసింది.

మనసంతా పాడైపోయింది. ఇలాటి స్థితిలో పావనిని ఆదుకునేది రుచిక ఒక్కతే. పొద్దున్న క్లాసుకి రుచికరాలేదు. ఇప్పుడైనా వస్తుందా లేకపోతే

పావని ఆలోచిస్తుండగానే రుచిక ఎదురుగా వస్తూ కనిపించింది.

"ఏమయిందే? పొద్దున్న రాలేదేం?"

"షాపింగ్‌కి వెళ్ళానే" చేతిలోని పాకెట్లు చూపిస్తూ చెప్పింది రుచిక. రుచికకి బట్టలంటే ప్రాణం.

"అలా కూర్చుందాంరా" అంటూ పావని రుచికని లాన్‌వైపు నడిపించింది. అప్పటికి రుచికకి షాపింగ్ మత్తు వదిలి, తిరిగి పరిసరాల్ని గమనించటం మొదలుపెట్టి, పావనిని చూసి ఆమె మూడ్ బాగాలేదని గ్రహించింది.

"ఏంటి? అదోలా ఉన్నావ్?" అడిగింది.

"ఆ ప్రియాంక ఏమందో తెలుసా?" అంటూ పావని జరిగిందంతా చెప్పింది.

"మిస్ ఎ.పి.నని తెగ నీలుగుతోంది" పావని కసిగా ఏమేమో తిట్టేసింది.

రుచిక ప్రశాంతంగా వింది.

తర్వాత యోగిలా ప్రశాంతంగా చూసింది.

"ఏమోగానీ అది అన్న మాటల్లో కూడా సత్యం ఉందనిపిస్తోందే" అంది మెల్లగా.

పావనికి గుండె ఆగిపోయినట్లయింది.

"ఎందుకలా అన్నావ్?"

"ఎందుకంటే..." రుచిక చెప్పాలా వద్దా అన్నట్లు పావనివంక చూసింది.

"చెప్పు... ఎందుకలా అన్నావ్?" పావని రుచిక భుజాల్ని పట్టి కుదిపేస్తూ అడిగింది.

"అది వన్‌వే ట్రాఫిక్కని ఊరికే అనలేదనిపిస్తోంది. హర్ష మనతో మాట్లాడాలంటే తెగ నీలుగుతాడు కదా? ఎక్కడికక్కడ కట్ చేసి పోతాడు. కానీ ఆ పల్లెటూరునుంచి వచ్చింది. ముద్దుగా, బొద్దుగా ఉంటుంది. దాని పేరేంటో జ్ఞాపకం రావటంలేదు" రుచిక మాటలు విని పావనికి గుండెల్లో బాంబు పేల్చినట్లయింది.

"ఎవరు? పద్మప్రియా?" పావని అరుస్తూ అడిగింది.

"ఆ...ఆ... పద్మప్రియే. ఇందాక నేను వస్తూవస్తూ కంప్యూటర్ లాబ్‌లోకి వెళ్ళాను. ధాని పక్కనే చాలా దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చుని, కంప్యూటర్ నేర్పిస్తున్నాడు"

"ఆ... నిజమా? పోదాంపద చూద్దాం" పావని గభాల్న లేస్తూ అడిగింది.

"నువ్వు గొడవ చెయ్యకూడదు అక్కడ" రుచిక ముందుగానే వార్నింగ్ ఇచ్చింది.

"చెయ్యను. ఊరికే చూసి వచ్చేద్దాం. నడు" పావని గబగబా అడుగులు వేసింది. రుచిక ఆమెతోపాటూ నడిచింది. ఇద్దరూ క్షణాల మీద కంప్యూటర్ లాబ్‌లోకి

వెళ్లారు.

కంప్యూటర్ లాబ్‌లో అంతా బిజీగా ఎవరిపని వాళ్ళు చేసుకుంటున్నారు. కొంత మంది బొమ్మలూ, ముగ్గులూ కూడా ట్రై చేసుకుంటున్నారు.

ఒక మూలగా ఎవరి డిస్టర్బెన్సూ సోకని చోట కంప్యూటర్ ముందు దగ్గరదగ్గరగా కుర్చీలు జరుపుకుని కూర్చుని ఉన్నారు హర్షా, పద్మప్రియా.

పద్మప్రియ గులాబీరంగు జాకెట్ ఓణీ వేసుకుని, చిలకపచ్చరంగు పట్టులంగా, జాకెట్టు ధరించి ఉంది. చెవులకున్న ఎర్ర రాళ్ల జూకాలు తల కదిపినప్పుడల్లా తళుక్కుమంటూ మెరుస్తూ కదులుతున్నాయి. హర్ష మొహంవైపు శ్రద్ధగా చూస్తూ అతను చెప్పేది వింటోంది.

"ఇప్పుడు మౌస్‌ని పైకి ఎత్తు" అన్నాడు హర్ష. పద్మప్రియ వెంటనే మౌస్‌ని చేతిలోని తీసుకుని వీలైనంత పైకి లేపింది.

హర్ష విరగబడి నవ్వాడు.

"పైకెత్తమంటే యారో పైకి వెళ్లేట్లు నడిపించమని. అంతేగానీ ఇది కాదు" అన్నాడు.

పద్మప్రియ కూడా విరగబడి నవ్వింది. మౌస్‌ని ప్యాడ్‌మీద ఉంచి జరపటం నేర్పిస్తున్నాడు హర్ష. పావని గుండె భగ్గుమంది.

"ఇక్కడున్నావా?" హర్ష దగ్గరకు వెళ్ళి పలకరించింది పావని. మనసులో అలజడినీ, కోపాన్నీ దాచుకుని, వీలైనంత శాంతంగా మాట్లాడటానికి ప్రయత్నిస్తోంది.

"అవును. ఈ అమ్మాయికి కంప్యూటర్ నేర్పిస్తున్నాను. పాపం కాస్త వెనకబడి ఉంది" అన్నాడు హర్ష.

"ఏదన్నా ఇన్‌స్టిట్యూట్‌లో చేరి నేర్చుకోవచ్చుగా. హర్షా నీకెక్కడ టైమ్ ఉంటుంది ఇవన్నీ నేర్పుతూ కూర్చోవటానికి" అంది పావని. ఆమె గొంతులో అసూయ, ద్వేషం ప్రతిధ్వనించి హర్ష ఆశ్చర్యంగా చూశాడు. ఏదో చెప్పబోయి ఆగిపోయాడు. అది పావనికి తెలిసిపోయింది. ఏం చెప్పాలనుకున్నాడు? పావనికి అర్థం కాలేదు. కొంపదీసి ప్రియాంక మాటల్లో ధ్వనించినట్లు హర్షకి పద్మప్రియంటే ఆకర్షణగానీ ఏర్పడిందా? పావనికి పద్మప్రియని చూస్తే కారం రాసుకున్నట్లు ఉంది. కోపంగా పద్మప్రియవైపే చూస్తోంది.

పద్మప్రియ నవ్వుతూ హర్షవైపు చూస్తోంది.

"హర్ష నేర్పిస్తానన్నాడు. నాకు టైమ్, మనీ కూడా సేవ్ అవుతుంది" అంది.

"అవును. అసలు అక్కడికి వెళ్తే అంతా నిన్నుచూసి నవ్వుతారు కూడా" అంది పావని.

పద్మప్రియ కళ్ళెత్తి పావనివైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"అవునుమరి నవ్వరా? మౌస్‌ని పైకి తీసుకెళ్ళమంటే ఇలా పైకెత్తావు చూడు అక్కడ అలాచేస్తే ఎంత నవ్వేవాళ్ళు. నీలాటివాడే మన అకౌంట్స్ లెక్చరర్... ఆయన గురించి పాత జోక్ ఉంది తెలుసా?" అంది పావని.

హర్ష పావనివైపు వారిస్తున్నట్లు చూశాడు. పావని అది గమనించే స్థితిలో లేదు. పావని మనసునిండా పద్మప్రియ మీద ద్వేషం.

"ఆయనేం చేశాడో తెలుసా? ఆయనకి మొదట్లో కంప్యూటర్‌లో ఓనమాలు రావుట. వాళ్ళందరికీ కంప్యూటర్ ట్రైనింగ్‌కి ఒక మాస్టారుని పెట్టారుట. ఒకసారి మన అకౌంట్స్ లెక్చరర్‌గారికి, కంప్యూటర్ ముందు కూర్చునేసరికి అది పనిచేయక పోయేసరికి ఆ ట్రెయినింగ్ మాస్టారుని పిలిచాడుట. ఆయన వచ్చి ఏంటిసార్ విండోస్ ఓపెన్ కావటంలేదా అని అడిగాడుట. మన వాడు గది కిటికీ గురించి అడుగుతున్నాడనుకుని, 'లేదే తెరుచుకుంటాయి' అని వెళ్ళి కిటికీలు తెరిచేశాడుట. అంతా నవ్వలేక

చచ్చారుట. నీ పల్లెటూరు మొహం చూస్తే అంతా అలా నవ్వుతారు" విరగబడి నవ్వుతూ చెప్పింది పావని.

చుట్టుపక్కలవాళ్ళు కూడా అంతా విరగబడి నవ్వారు. పద్మప్రియ కళ్లల్లోకి నీళ్ళు వచ్చేశాయి.

హర్ష చిరాకుని ఆపుకోలేకపోయాడు. "ఎవరన్నా ఏదన్నా నేర్చుకుంటున్నప్పుడు ప్రోత్సహించాలి. చాలా బార్బరిక్‌గా మాట్లాడుతున్నావు. ఎవరికీ అన్నిటిలోనూ ప్రావీణ్యం వుండదు. ఏదన్నా కొత్తగా నేర్చుకుంటున్నప్పుడు అన్నీ తప్పులే చేస్తారు. సిల్లీగా అనిపిస్తుంది కూడా. అది ఎవర్కైనా జరిగేదే. అంత మాత్రాన మనమేదో తెలివైనవాళ్ళం, వాళ్ళు తెలివి తక్కువవాళ్ళని కాదు. నీకు మాట్లాడటం చేతకాకపోతే నోర్మూసుకుని కూర్చోవాలి. ఒకళ్ళని నొప్పించే హక్కు నీకు లేదు" ఇంక గెట్ లాస్ట్ అన్నట్లు ఒక్కచూపు చూశాడు హర్ష.

పావని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తను ఎవరినైనా, ఎన్నడైనా నొప్పించిందా?. ఇన్నాళ్ళనుంచీ చూస్తున్నాడు హర్షకి అది తెలీదా? ఎవరితోనైనా పొరపాటునైనా కటువుగా మాట్లాడదు తను. మరి పద్మప్రియని ఎందుకు తీసిపారేసి మాట్లాడింది. తను హర్షని ప్రేమించబట్టే కదా? మరి హర్ష తన ప్రేమని గుర్తించి, అది ప్రేమవల్ల కలిగిన అసూయ అని తెలుసుకోవాలి కదా? ఎప్పుడూ అందరితో ప్లీజింగ్‌గా మాట్లాడే మనిషి, ఎవరినీ ఎన్నడూ నొప్పించటం తెలియని మనిషి, ఎందుకిలా కరుగ్గా మాట్లాడిందని అతను ఆలోచించలేడా? ఎవరెవరినో పలకరించి, కంప్యూటర్ నేర్పించటానికి సిద్ధపడిన హర్ష తనని అర్థంచేసుకోవటానికి మాత్రం ఎందుకు ప్రయత్నించటంలేదు.

పావని కళ్ళల్లోంచి జలజల నీళ్ళు కారుతున్నాయి.

"పోదామే" అంది రుచిక పావని చేతిని నొక్కుతూ.

"సారీ... సారీ" పద్మప్రియకి కాకుండా హర్షకి సారీ చెపుతూ, వెనక్కి తిరిగింది పావని.

పావనీ, రుచికా కారిడార్లోంచి నడుస్తున్నారు.

"నువ్వలా మాట్లాడకుండా ఉండాల్సింది" అంది రుచిక.

"ఏమిటో కోపం ఆపుకోలేకపోయాను" అంది పావని.

రుచిక గార్డెన్‌లోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టింది పావనిని.

పావని మనసు మొత్తం అలజడీ, ఆందోళనా. రుచిక ఏదో మాట్లాడుతోంది. పావనికి ఒక్కమాట కూడా చెవిన పడటం లేదు. మనసంతా హర్ష తలపులే. నిలవలేకుండా ఉంది. కూర్చోలేకుండా ఉంది. ఇంటికి వెళ్ళబుద్ధికావటం లేదు. ఇక్కడ ఉండలేకపోతోంది. ఏం చేయాలి? తీరని అశాంతి. ఎడారిలో మండుటెండలో దాహం కోసం పరితపిస్తున్న బాటసారిలా, హర్ష ప్రేమకోసం పరితపించిపోతోంది. హర్ష పద్మప్రియని ప్రేమిస్తున్నాడా ఏమిటన్న భయం మనిషిని నిలువెల్లా వణికిస్తోంది.

"మరీ ఎమోషనల్‌గా ఉంటావే నువ్వు" అంది రుచిక.

"నేను ఫూల్‌ని" అంది పావని కళ్లనీళ్లతో.

★ ★ ★

పావనీ, రుచికా కాంటీన్లో కూర్చుని ఉన్నారు. కూల్‌డ్రింక్ తాగుతున్నారు. రుచిక ఏదో చెపుతుంటే పావని వింటోంది.

"ఏదీ... నేనేం చెపుతున్నానో చెప్పు" అంది రుచిక హఠాత్తుగా పావని చెయ్యి తట్టి.

పావని ఉలిక్కిపడింది. టేబుల్ మీద పెడుతున్నాననుకుని, బాటిల్‌ని నెమ్మదిగా అలా గాలిలో ఉంచింది. అది భళ్లున కింద పడి పగిలిపోయింది.

పావని బిక్కమొహం చూసి రుచిక పగలబడి నవ్వింది.

"అబ్బ. ఏం పరధ్యానం? ఎందుకే ఇలా తయారయ్యావు? ఎలాటిదానివి ఎలా అయిపోయావు! టెంత్‌లో, ఇంటర్‌లో నీ మార్కులెంత అద్భుతంగా ఉన్నాయి. డిగ్రీకి రాగానే నీ తెలివంతా ఏమైపోయింది? ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటావు. డల్‌గా ఉంటావు. మూడీగా ఉంటావు. ఇలా అయితే నీ దగ్గరకు ఎవరూ రారు" అంది రుచిక.

"ఏం చెయ్యమంటావే" పావని నిట్టూర్చింది.

"ఇందాక ఏదో ఆలోచిస్తూ ఉండిపోయావు" అంది.

కొందరు అమ్మాయిలు వాళ్ళముందు నుంచి వెళ్లారు.

"పోనీ ఇప్పుడు మనముందు నుంచి వెళ్ళింది ఎవరో చెప్పు? " అంది రుచిక.

పావని తెల్లమొహం వేసింది. ఎవరో ఎంత ఆలోచించినా గుర్తురాలేదు.

"నీ బుర్రని మొద్దుబారుస్తున్నావు. ఇంకొన్నాళ్లు పోతే అందులో ఇంకేమీ మిగలదు" అంది రుచిక కోపంగా. రుచికకి ఆశ్చర్యంగా అనిపిస్తోంది. ప్రేమ ఇన్ని మ్యాజిక్‌లు చెయ్యగలదా? ఒక తెలివైన మనిషిని ఇంత డల్‌గా చెయ్యగల శక్తి ప్రేమకుందా?

"ఏంటి? నన్నని నువ్వేదో ఆలోచిస్తూ ఉండిపోయావు" అంది పావని.

"ప్రేమకున్న శక్తి గురించి"

"ఆ..."

"అవును. కానీ పావనీ నువ్వేమనుకోనంటే ఒక విషయం అడగనా? "

"అడుగు"

"ఎంతోమంది ప్రేమిస్తున్నారు. కానీ ఇలా సర్వం మరిచి, అవతలి వ్యక్తికోసమే నేను ఊపిరి పీలుస్తున్నాను అనుకునే వాళ్ళెంతమంది ఉంటారు? నీకు... నీకంటూ ఒక వ్యక్తిత్వం ఉండాలి కదా? "

"హర్ష ఉంటే చాలు. నాకింకేం అఖ్ఖర్లేదు" అంది పావని.

రుచిక పావని మొహంలోకి చూసింది. అమాయకంగా మెరుస్తున్న ఆ కళ్లని చూసి ఇంకేం మాట్లాడలేకపోయింది. హర్ష కూడా పావనిని ప్రేమిస్తున్నాడా లేదా అన్నది ఒక పెద్ద పజిల్.

ఇంత ఘోరంగా, దారుణంగా హర్షని ప్రేమిస్తున్న పావని, ఒకవేళ అతను తనని తిరస్కరిస్తే బతకగలదా? ప్రేమ ఫలించక ఆత్మహత్య చేసుకున్నవాళ్ల లిస్టులో పావని పేరు కూడా చేరదు కదా? రుచిక ఒక్క క్షణం భయంతో వణికిపోయింది. నిజమైన స్నేహితురాలు కాబట్టి, పావనికి అంతా మేలు జరగాలని దేవుడ్ని ప్రార్థించింది.

★ ★ ★

పావనికి హర్షతో తన ప్రేమ ఎలా ప్రకటించాలో అర్థంకావటంలేదు. హర్ష ఇంత మొద్దు రాచిప్పా. తన ప్రేమ నిండిన కళ్లు, అతన్ని చూడగానే వెలిగిపోయే తన మొహం, పెదవులమీదికి తోసుకునివచ్చే నవ్వు, ఇవన్నీ అతనికి తన గురించి చెప్పటం లేదా? ఇంత మొద్దు మనిషా? ఎలా తన ప్రేమని తెలియచేయటం? ఆలస్యంచేస్తే ఎవరో ఒకరు అతన్ని ఎగరేసుకుపోవటం ఖాయం.

ఆలోచిస్తూ కూర్చుండిపోయింది.

ఇంతలో ఒక ఆకారం వాళ్ల పక్కనుంచి వెళ్ళింది. జీన్‌పాంట్, టీ షర్ట్ వేసుకుని, పోనీటైల్ కట్టిన ఆ ఆకారాన్ని పావని గుర్తుపట్టలేకపోయింది. రుచిక పావని చేతి మీద గీరి, అటు చూడమన్నట్లు చూసింది.

"ఎవరు? " అంది పావని.

"పద్మప్రియ"

"ఆ? " పావని నిర్ఘాంతపోయింది.

"ఆ అవును. పద్మప్రియే. హాలీవుడ్‌స్టార్‌లా తయారైంది చూశావా? అంతా మారిపోతున్నారు. నువ్వే ఇలా ఉన్నావు"

పావని పద్మప్రియ వెళ్ళినవైపే చూస్తూ ఉండిపోయింది.

రుచిక ఒక మాగజైన్‌లో డ్రెస్‌మీద డిజైన్ చూస్తోంది.

"ఈ కలర్ నాకు బ్రహ్మాండంగా ఉంటుంది కదూ?" అడిగింది రుచిక.

"అవును" అంది పావని ఆలోచిస్తూనే.

"నీకైతే ఈ కలర్ అద్భుతంగా ఉంటుంది. ఎంచక్కా ఈ కలర్‌లో ఇదే డ్రెస్ కుట్టించుకోరాదూ? చూశావుగా. అంతా మారిపోతున్నారు. నువ్వూ మారిపో" అంది రుచిక.



"ఊ" అంది పావని పరధ్యానంగా.

"ఏమిటే. డ్రెస్ కుట్టించేసుకుంటావా? నిజంగానా? పద ఇప్పుడే పోదాం. అసలు ఏమిటే ఈ వేషం. అప్పలమ్మలు కూడా గెటప్ మార్చేసి, మిడీలూ, చుడీదార్లూ వేసుకుంటున్నారు. మా పనిమనిషి కూడా మోడ్రన్ దుస్తుల్లో వస్తుంది. నువ్వేంటి ఇలా పిచ్చిపిచ్చిగా లంగా ఓణీలు? ఏదో

వెరైటీగా ఒకటి కుట్టించుకుంటే ఫర్వాలేదు గానీ అవే చూసిచూసి బోర్‌కొట్టేస్తోంది. ఇప్పుడు టైలర్ దగ్గరికి పోదాం. పదపద" రుచిక లేచి, ఎగిరి గంతేసి, స్కూటర్ స్టాండ్‌వైపు పరుగెత్తబోయింది.

"ఆగాగు. ఏమిటే ఈ రన్నింగ్. ఎక్కడికెళ్తున్నావ్? " పావని ఈ లోకంలోకి వచ్చిపడి, రుచిక ఎక్కడికెళ్తోందో అర్థంకాక, ఆశ్చర్యపోతూ అడిగింది.

ఈ డ్రెస్ కుట్టించుకుంటానన్నావుగా? " రుచిక అంది.

"ఇంకా నయం. ఏదో ఆలోచించుకుంటూ అని ఉంటాను" పావని నవ్వేసింది.

"ఏమి ఆబ్సెంట్ మైండెడ్‌నెస్? అనవసరంగా నన్ను రన్స్ తీసేట్లు చేశావు" రుచిక ఉసూరుమంటూ వెనక్కి వచ్చి కూర్చుంది.

★ ★ ★

పావని పద్మప్రియ గురించి ఇంకొన్ని వివరాలు సేకరించింది. పద్మప్రియ ఇక్కడ హాస్టల్లో ఉండటానికి డబ్బులేక, బంధువులింట్లో ఉండి చదువుకుంటోందిట. వాళ్లకి ఆడపిల్లలు లేరని పద్మప్రియని కాస్త ప్రేమగానే చూసుకుంటూ, బట్టలు కూడా కుట్టిస్తున్నారుట.

హర్షకి పద్మప్రియతో స్నేహం ఎలా కుదిరిందో పావనికి అర్థంకాలేదు. అంతకుముందు వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నట్లు కూడా లేదు.

"నంగనాచుల్లా ఉండి కొంపలు ముంచుతారు. గోముఖ వ్యాఘ్రం. తేనెపూసిన కత్తి. మేకవన్నె పులి" పావని కసిగా తిట్టేసింది.

"ఎవర్నే? "

"అదే. పద్మప్రియ. వచ్చినప్పుడు ఎలా ఉండేది చూడు. ఇప్పుడేమో పెద్ద స్టైల్ పోతోంది"

"అది హర్ష ఫ్రెండని దాన్ని అంత తిడుతున్నావు పాపం" రుచిక నవ్వేసింది.

"లేదే. దానికి బాగా పొగరెక్కింది. మనం హర్ష ఫ్రెండ్స్‌మని తెలుసుకదా. అయినా కూడా ఎదురుపడితే నవ్వటం లాంటివి చెయ్యదుచూడు. నాలుగు డ్రెస్సులు కుట్టించుకుని బ్యూటీక్వీన్‌లాగా పోజు"

"పోనీలే... ఎవరి సంతోషం వాళ్లది"

"సరే పోనిస్తాను. ఇక దాని గురించి మాట్లాడను" అనేసి సీరియస్‌గా కూర్చుంది పావని.

హర్ష స్పీడ్‌గా మోటార్‌బైక్ మీద రావటం కనిపించింది. అతను బైక్‌మీద వచ్చినప్పుడల్లా పావనికి గుండె ఝల్లుమంటుంటుంది. అతని వెనక కూర్చుని, అతని నడుముని చేత్తో చుట్టేసి, మీదికి వాలిపోయి, అన్నీ మర్చిపోయి కబుర్లు చెపుతూ బైక్‌మీద వెళ్తుంటే ఎంత బాగుంటుంది. ఆ మధురానుభూతి తనకు ఎప్పుడు దక్కుతుంది? ఈ మధుర స్వప్నం ఎప్పుడు నిజం అవుతుంది?

హర్ష బైక్‌ని పార్క్‌చేసి, హడావిడిగా వెళ్లటం కనిపించింది. పావని అతను వెళ్ళినవైపే చూస్తోంది.

హర్ష తిరిగి వచ్చాడు. అతనితోపాటే పద్మప్రియ కూడా వచ్చింది.

పావని ఉలిక్కిపడింది.

పావని నిర్ఘాంతపోయి, కలవరపడుతూ, భయంతో కంపిస్తూ రకరకాల భావాలు ఒకేసారి చుట్టుముట్టడంతో ఉక్కిరిబిక్కిరవుతూ చూస్తోంది.

హర్ష చరచరా బైక్ దగ్గరకు వచ్చాడు. పద్మప్రియ అతని వెనకే వెళ్ళింది.

కాలేజ్‌లో అమ్మాయిలూ, అబ్బాయిలూ బైక్‌మీద కలసి వెళ్ళటం మామూలే. ఎవరూ పట్టించుకోలేదు. కాకపోతే అది హర్ష కాబట్టి కొంతమంది కాస్త ఆశ్చర్యపోయి చూశారు అంతే.

పావని నిలువెల్లా అసూయ, కోపంతో మండిపోతోంది. గబగబా వాళ్లదగ్గరకి నడిచింది. అప్పటికే హర్ష బైక్ స్టార్ట్‌చేసి

కూర్చున్నాడు. పద్మప్రియ అతని వెనక కూర్చుంది.

"ఎక్కడికి వెళ్తున్నారు?" కోపంగా అరుస్తూ అడిగింది పావని.

"పావనీ" పద్మప్రియ ఏదో చెప్పబోయింది.

"నువ్వు నోరు ముయ్యవే. నువ్వొక వ్యాంప్‌వి. నీతో మాట్లాడే అవసరం నాకు లేదు" పావని అరుస్తూ అంది.

పద్మప్రియ ఇంకేం మాట్లాడకుండా ఎటో చూస్తూ కూర్చుంది.

"హర్షా, నిన్నే. ఎక్కడికీ?" అంది పావని.

హర్ష కళ్లలోంచి నిప్పులు కురిశాయి.

పావని వైపు చూస్తుంటే, ఆ చూపుల్లోని అగ్ని భరించలేక పావని తలవంచేసుకుంది. అది కేవలం ఒక్క క్షణం. మళ్లీ భయం, అనుమానం, ద్వేషం చుట్టుముట్టాయి. తననితాను మర్చిపోయింది.

"ఎక్కడికి వెళ్తున్నారు?" అడిగింది మళ్లీ.

"బస్ స్టేషన్"

"ఎందుకు?"

"నీకన్నీ చెప్పాలా?" హర్ష కోపంగా విసుగ్గా అన్నాడు.

"అవును. ఈ పద్మప్రియ నువ్వు ఇన్నోసెంట్ ఫెలోవని అన్యాయం చేస్తోంది. నిన్ను ఎక్స్‌ప్లాయిట్ చేస్తోంది. ఏం? నీకు బస్సులూ, ఆటోలూ లేవూ? హర్ష బైక్ మాత్రమే కావల్సి వచ్చిందా నువ్వు స్టేషన్‌కి వెళ్లటానికి?" పావని వికృతంగా అరిచింది.

"హర్షా. పావని అన్నది నిజమే. నేను వెళ్ళిపోతాను" పద్మప్రియ బైక్ దిగిపోయింది.

"అన్నీ వేషాలు. నిజంగా వెళ్ళాలంటే ఎన్ని లేవు. పోనీ రుచిక స్కూటీమీద వెళ్ళొచ్చుగా. అడిగితే కాదంటుందా? ఈవిడ స్టైల్‌కి మొగాళ్ల వెనకాలే ఎక్కి వెళ్ళాలి కాబోలు" పావని కోపం ఇంకా తగ్గలేదు. సర్వం మరచిపోయి పద్మప్రియని తిట్టేస్తోంది. పద్మప్రియ భోరుమంది.

"పావనీ. సీన్స్ క్రియేట్ చెయ్యకు పద్మా...." హర్ష పద్మప్రియవైపు ఎక్కమన్నట్లు చూశాడు. ఆ చూపులో ఏ సందేశం ఉందోగానీ, పద్మప్రియ వెంటనే బైక్ ఎక్కేసింది. పావని కళ్లముందే బైక్ వేగంగా కదిలిపోయింది.

రుచిక వచ్చి పావని పక్కనే నిలబడింది. పావని కళ్లనిండా నీళ్లు.

తనని ఎంతో దూరంలో ఉంచే హర్ష పద్మప్రియతో ఎంత చను .



వుగా మసులుతున్నాడు.

అసలెందుకిలా చేస్తున్నాడు?

ఏమిటతని ఉద్దేశం?

పావనికి హర్షమీద కోపం రావటంలేదు. హర్ష చాలా మంచివాడనీ, అమాయకుడనీ పావని ఉద్దేశం. కోపం, ద్వేషం, అసహ్యం అన్నీ పద్మప్రియమీదే ఉన్నాయి.

**"పావనీ, నీకన్నీ తొందరలే! అనవసరంగా ఆ పద్మప్రియతో పెద్ద సీన్ క్రియేట్**

చేసి పోట్లాడావు. తీరా చూస్తే అసలు కథ వేరే ఉంది" అంది రుచిక.

"ఏమిటసలు? ఏదో ఇన్వెస్టిగేట్ చేసి కనుక్కున్నట్లున్నావే" అంది పావని.

"అవును. నీకోసం ఇన్వెస్టిగేట్ చెయ్యక చస్తానా? "

"అసలు ఏం జరిగింది? ఏం కనుక్కున్నావు? " పావని.

"ఆ పద్మప్రియది పెద్ద ట్రాజడీ స్టోరీట. తల్లి చచ్చిపోయిందిట. తండ్రి ఇంకో పెళ్ళి చేసుకున్నాడుట. ఆ సవితితల్లి దీన్ని రాచి రంపాన పెడుతోందిట"

"పాత సినిమాల్లో హీరోయిన్‌కి ఉండే కష్టాలన్నీ ఉన్నాయా? ఒక కుంటి తమ్ముడు కూడా ఉన్నాడా? " ఇన్ని విన్నా ఇంకా కసితీరని పావని కోపంగా అడిగింది.

"లేదు. ఆ స్టెప్ మదర్ దీన్ని చదువు మాన్పించేయాలని చూస్తే బంధువులెవరో అడ్డుపడి, దాన్ని ఈ ఊరు తీసుకువచ్చి మన కాలేజీలో చేర్పించారుట"

"చేర్పించకున్నా పోయేది" పళ్లు కొరికింది పావని. "ఇంతకీ హర్షతో ఎలా ఫ్రెండ్‌షిప్ పెట్టిందిట? " అడిగింది.

"అదే చెప్పబోతుంటే వినిపించుకోవటం లేదు నువ్వు. పద్మప్రియ కజిన్ హర్షకి ఫ్రెండుట. అతను కూడా ఏవో స్పోర్ట్స్ ఆడుతుంటాడట. అతను హర్షని పద్మప్రియకి హెల్ప్ చేస్తుండమని రిక్వెస్ట్ చేశాడుట. హర్ష పద్మప్రియ పరిస్థితికి జాలిపడి ఆమెకి దగ్గరుండి అన్నీ నేర్పించాడుట. పద్మప్రియ కారమ్స్ బాగా ఆడుతుందిట. దాన్ని అందులో ఛాంపియన్ చేయాలని హర్ష అనుకుంటున్నాడుట"

"జాలిలోంచి ప్రేమ పుడుతుందంటారు కదా? "

"అన్నీ సినిమాల్లో చూపించినట్లు జరగవు. వాళ్ల నాన్నకి ఏదో జబ్బు చేస్తే దాన్ని ఊరు వెళ్లే బస్సు ఎక్కించాడులా ఉంది. నువ్వు ప్రతిదీ మిస్ అండర్‌స్టాండ్ చేసుకుంటావు"

"ఏంటో? హర్షమీద ప్రేమతో నాకు కిందామీదా ఏదీ తెలియటంలేదు. దేన్ని ఎలా అర్థంచేసుకోవాలో ఏంటో అంతా కన్‌ఫ్యూజింగ్‌గా ఉంది"

"అంత దుడుకు ప్రేమ ఉండకూడదు. కాస్త బాలన్స్ చేసుకోలేవూ"

"నావల్లకాదు" అంది పావని. ఆమె మనసంతా రిలీఫ్‌గా ఉంది.

ఎందుకోగానీ పావని ప్రవర్తనా, ఆమె తనవంకే చూస్తూ అలాగే ఉండిపోవటం అన్నీ అనుమానాన్ని రేకెత్తిస్తున్నాయి హర్షకి. ఆ అనుమానం పావని పద్మప్రియతో మాట్లాడినప్పుడు దృఢపడింది. తన అనుమానం నిజమో కాదో రూఢి చేసుకునే ప్రయత్నంలో పడ్డాడు. వెంటనే అవకాశం కూడా లభించేసింది.

పావని ఫ్రెండ్ రుచిక పావని ఇంటికి వచ్చింది.

"ఒక డ్రెస్ కొనుక్కోవాలి. తోడురావే" అడిగింది.

ఇద్దరూ షాపింగ్ గురించి మాట్లాడుకుంటూ బయల్దేరుతుంటే హర్ష సంగతి గ్రహించేశాడు. రుచికతో షాపింగ్ అంటే మాటలు కాదు. పావని ఇప్పట్లో తిరిగి రాదు.

వెంటనే పావని ఇంటికి వెళ్ళాడు.

"ఆంటీ... పేపర్ కావాలి" అడిగాడు. బేబీ పర్వతవర్ధని హర్ష తమ ఇంటికి వచ్చినందుకు ఉబ్బితబ్బిబ్బయింది.

"ఇవాల్టిదా? " ఆప్యాయంగా అడిగింది.

"కాదు ఆంటీ. మొన్నటి పేపర్. అందులో నాకు కావల్సిన ఇన్ఫర్మేషన్ ఉంది"

"మొన్నటిదా? " నీరసపడిపోతూ అడిగింది బేబీ పర్వతవర్ధని.

ఇంతవరకూ ఎన్నడూ, ఏదీ అడగని హర్ష ఈనాడు ప్రప్రథమంగా తన ఇంటికి వచ్చి పేపర్ అడగటమూ, అది తాము ఇచ్చే

పొజిషన్‌లో లేకపోవటమూ బేబీ పర్వతవర్ధనికి చాలా నిరాశ కలిగించాయి.

"ఏం ఆంటీ? ... లేదా? "

"లేకేం నాయనా... కానీ... అయినా కానీ లేనట్లేలే" ఒకదానికీ మరొకదానికీ పొంతనలేకుండా మాట్లాడింది పర్వతవర్ధని.

"ఏంటి ఆంటీ? ఏం అర్ధంకావటంలేదు. ఇంతకీ... ఉందా. లేదా? " అయోమయంగా చూస్తూ అడిగాడు.

"లేనట్లే నాయనా... మా పావని ఎప్పటి పేపర్లు అప్పుడు పారేస్తుంది" బేబీ పర్వతవర్ధని కోపంగా చెప్పింది.

"పోనీలెండి ఆంటీ... ఇంకోచోట ప్రయత్నిస్తాను" హర్ష వెనుతిరిగాడు.

"అయ్యయ్యో... ఉండు నాయనా. పక్కనే ఉన్నా ఎన్నడూ మా ఇంటికి రానే రావు. రాకరాక వచ్చావు. కాస్త స్వీట్ తిని, కూల్‌డ్రింక్ తాగి వెళ్లు. ముందు కూర్చో" అంది బేబీ పర్వతవర్ధని.

హర్ష సోఫాలో కూర్చున్నాడు.

"వద్దు ఆంటీ. స్పోర్ట్స్‌మాన్‌ని కదా. బాడీ ఫిట్టుగా ఉంచుకోవాలి. ఎప్పుడంటే అప్పుడు, ఏది పడితే అది తినెయ్యకూడదు" అన్నాడు హర్ష.

"అయ్యో... మరెలా? మా ఊరినుంచి కాజాలూ, లడ్డూలూ వచ్చాయి. కాస్త రుచి చూస్తావనుకున్నాను" అంది బేబీ పర్వతవర్ధని నిరాశగా చూస్తూ.

"కాస్త టీ చేసి ఇవ్వండి ఆంటీ, చాలు" అన్నాడు హర్ష.

"అలాగే... ఇప్పుడే నిమిషంలో టీ చేసి తెస్తాను. టీవీ పెట్టనా? " రిమోట్ చేతిలో తీసుకుంటూ అడిగింది బేబీ పర్వతవర్ధని.

"వద్దు ఆంటీ... ఏమన్నా బుక్స్ ఉంటే"

"అదుగో. అదే పావని గది. తెలుసుగా. టేబుల్‌మీద బుక్స్, మాగజైన్స్ ఉంటాయి. నీక్కావల్సింది తీసుకో. నేను ఇదుగో ఇప్పుడే వెళ్లి చిటికెలో టీ చేసి పెడతాను"

"చిటికెలో వద్దు ఆంటీ. మీక్కావల్సినంత టైమ్ తీసుకుని టేస్టీగా పెట్టండి చాలు" నవ్వుతూ చెప్పాడు హర్ష.

"నాటీ బాయ్" అనేసి నవ్వుకుంటూ కిచెన్‌లోకి వెళ్ళింది బేబీ పర్వతవర్ధని.

ఆమె కిచెన్ లోపలకి వెళ్ళిందని రూఢీ చేసుకుని, గబగబా పావని గదిలోకి దూరాడు.

గదంతా ఒకసారి కలయచూశాడు. కవర్లూ, డబ్బాలూ తీసి చూశాడు. అనుమానం వచ్చి డ్రా లాగి చూశాడు. ఏమీ కనిపించలేదు.

గదంతా చూస్తుండగా, గది గోడకి ఒక మూలగా ముదురు గులాబీ రంగులో వున్న వాల్ హాంగింగ్ కనిపించింది. హృదయం ఆకారంలో వుండి, రబ్బరుతో చేయబడి, స్మూత్‌గా, నిగనిగా మెరుస్తూ కనిపిస్తోంది అది.

దాన్ని తీసి చూశాడు. ఒకమూల బిరడాలా కనిపించింది. గబగబా దాన్ని ఊడదీసి దాంట్లోకి చూశాడు.

అతనికి కావల్సినవి కనిపించాయి. వాటిని అరచేతిలోకి ఒంపుకున్నాడు.

జలజలా రాలాయి.

న్యూస్ పేపర్లలోంచి నైపుణ్యంగా, జాగ్రత్తగా కట్‌చేసిన అక్షరాలు.

అలమారులో ఒక మూల గమ్ బాటిల్... అరలో జాగ్రత్తగా దాచిన గులాబీరంగు కాగితాలు.

చిక్కుముడి విడిపోయింది.

అంటే తనకి గులాబీరంగు కాగితాల ప్రేమలేఖలు రాసి విసురుతున్నది పావనే అన్నమాట.

అతని కళ్ళు ఎరుపెక్కాయి.

పావని... తనకి ఎంతో ఫ్రెండ్‌లా నటిస్తూ, అమాయకంగా ప్రవర్తిస్తూ, ఆప్యాయత చిలకరిస్తున్న పావని... ఆఖరికి పావని కూడా తనని ఇబ్బంది పెట్టిందన్న మాట.

# ఏరినముత్యాలు

* ఒక సమర్థుడి వెనుక తప్పక కొందరు సమర్థులైనవారు ఉంటారు.

  \- చైనాసూక్తి

* సామర్థ్యమే పేదవాని సంపద!

  \- యం.రెన్

* మంచి పనులు చెయ్యనప్పుడు, దైవాన్ని పూజించడంలో ప్రయోజనం లేదు!

  \- గురునానక్

* మొదట మదిరను మనిషి తీసుకుంటాడు. పిమ్మట మదిర మనిషిని తీసుకుంటుంది!

  \- ఒక సూక్తి

* కోపం రావడం అనేది కొద్దిసేపు పిచ్చితనం ఆవహించడం వంటిది!

  \- హారేస్

* ప్రశాంతంగా, నిగ్రహంతో ఉండు. అప్పుడు నువ్వు అందరినీ శాసించగలుగుతావు.

  \- నెయిండ్‌జెస్ట్

* రచయితలు గడిచిన కాలానికి చిహ్నాలు.

  \- బుల్‌వెర్

* గుబురు గడ్డాన్ని చూసి అది మేధావితనానికి చిహ్నమని నమ్మకూడదు!

  \- ఫుల్లర్

* అందం శరీరం యొక్క రంగులో, శరీరసౌష్టవంలో ఉండదు. అది వ్యక్తి నిజాయితీలో ఇమిడి ఉంటుంది.

  \- మహాత్మాగాంధీ

* సంతోషాన్ని మించిన సౌందర్య సాధనం వేరొకటిలేదు!

  \- లేడీ బెస్సింగ్‌టన్

* ప్రవర్తన ఒక అద్దం వంటిది. ప్రతీవారు అందులో తమ ప్రతిబింబాన్ని చూడవచ్చును.

  \- గోథె

* చరిత్రను జీవితచరిత్రగా రాయడం మంచిది, జీవితచరిత్రను చరిత్రగా రాయడంకన్నా!

  \- జగత్‌మన్

* ధైర్యవంతులు చెల్లించిన మూల్యం రక్తం!

  \- సుభాష్‌చంద్రబోస్

* మానవ శరీరం ఒక సంగీత సాధనం వంటిది!

  \- మహాత్మాగాంధీ

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

అన్నీ చకచక సర్ది, యథాస్థానంలో వుంచి ఏవీ ఎరగనట్లు వచ్చి డ్రాయింగ్ హాల్లో సోఫాలో కూర్చున్నాడు.

బేబీ పర్వతవర్ధని టీ తయారుచేసి తీసుకొచ్చింది.

"తాగు" అంది ఆప్యాయంగా కప్పుని అందిస్తూ.

తాగేసి కప్పు ట్రేలో పెట్టాడు.

పర్వతవర్ధని ఏవేవో కబుర్లు చెపుతోంది. అయిదు నిముషాలు అవి వింటూ, తల ఊపుతూ ఆ తర్వాత శలవు తీసుకుని బయటపడ్డాడు.

★ ★ ★

పావని ఇంటికి రాగానే పర్వతవర్ధని హర్ష రాక గురించి చెప్పింది.

"ఇంతసేపు చేశారు షాపింగ్...ఏంకొన్నారేంటి? మనింటికి హర్ష వచ్చాడు ఇందాక" అంది.

"ఆ! హర్ష వచ్చాడా? దేనికీ?" కంగారుగా, ఆత్రంగా అడిగింది పావని.

"మొన్నటి పేపర్ కావాలన్నాడు. ఏదో ఇన్ఫర్మేషన్ ఉందిట. పాపం ఎంత ముఖ్యమైందో ఏంటో? అడక్క అడక్క అడిగితే ఇవ్వలేకపోయాను. నువ్వు పేపర్లన్నీ చింపి, అక్షరాలు కత్తిరించి పోగులు పెడతావు" అంది పర్వతవర్ధని.

"కొంపతీసి ఆ సంగతిగానీ చెప్పావా?" గుండెలు అదురుతుండగా, హడలిపోతూ ప్రశ్నించింది పావని.

"అలా చెప్పటానికి నేనేమన్నా పిచ్చిదాన్నా? నీ మమ్మీనంటే, నీ అంత లేకున్నా నాకూ ఉంటాయి తెలివితేటలు" నిష్టూరంగా అంది బేబీ పర్వతవర్ధని.

"సర్లే. ఇంతకీ ఏంచెప్పావు?"

"నువ్వు ఎప్పటి పేపర్లు అప్పుడు పారేస్తావని మాత్రం చెప్పాను. అది కూడా తప్పేనా? హర్ష ఇంత హఠాత్తుగా వచ్చి అడుగుతాడని నేను కలకన్లేదుగా. ఏంచెప్పాలో తెలీక తడబడ్డా, నా నోటికి వచ్చింది చెప్పాను. అతికినట్లు ఉందో, లేదో మరి"

"ఏం ఫర్వాలేదు. వుందిలే" అంది పావని.

"హమ్మయ్య. సరేగానీ, మన ఊరునుంచి ఇందాక స్వీట్లు వచ్చాయి. ఇందాక హర్షకి పెడతానంటే వద్దన్నాడు. నువ్వు తింటావా? తేనా?" అడిగింది పర్వతవర్ధని.

పావని ఎప్పుడూ స్వీట్లంటే ఎగిరి గంతేస్తుంది. కానీ ఈరోజు ఏదీ తినబుద్ధి కాలేదు. పాపం హర్షకి ఆ పేపర్లో ఏంకావాలో ఏమో? ఎందుకు అడిగాడో?

హర్ష కోసం ఏంచేయాలన్నా, ఎంత కష్టమైనా పావని ఎప్పుడూ రెడీనే. వెంటనే ఆ పేపర్ ఎవరెవరి ఇంట్లో దొరుకుతుందా అని ఆలోచించింది.

రోజా వాళ్ళింట్లో తెప్పిస్తారు. ఆ మూల ఇంట్లో వుండే పరంజ్యోతి అంకుల్ వాళ్ళు తెప్పిస్తారు.

వెంటనే బయల్దేరింది.

"ఎక్కడికే వెళ్తున్నావు? ఇప్పుడేగా వచ్చింది. అప్పుడెప్పుడో తిన్న తిండి. రెండు స్వీట్లన్నా తినిపో" వెనకాల నుంచి బేబీ పర్వతవర్ధని అరుస్తోంది.

పావని వినిపించుకోకుండా పరుగు తీసింది. రోజా వాళ్ళింట్లో పేపర్ దొరకలేదు. పరంజ్యోతిగారు పాతపేపర్లు వాడికి అమ్మేయాలని ఇవాళే అన్నీ స్టోర్‌లో ఒక మూల పడేశారుట.

"ఫర్వాలేదు. వెతుక్కుంటాను" అంది పావని.

"అక్కడ ఎలకలూ, పంది కొక్కులూ, బల్లులూ ఇంకా చాలా రకాల జంతువులు వున్నాయి. విఠలాచార్య సినిమాల్లో కనిపించే జంతువులు కూడా వుంటే ఉండొచ్చు నిన్ను కొరికేస్తాయి జాగ్రత్త" పరంజ్యోతి గారి భార్య బెదిరించింది.

"నాకేం భయంలేదు"

"అక్కా! డైనోసార్స్ కూడా వున్నాయి.

నాకు కనిపించింది తెల్సా" అన్నాడు పరంజ్యోతిగారి అబ్బాయి.

"అమ్మాయిలు అబ్బాయిల్లా భయపడరు" నవ్వేసి స్టోర్ రూమ్‌వైపు నడిచింది పావని.,

అక్కడ వాళ్ళు చెప్పినంత ఘోరంగా లేకపోయినా కాస్త భయంకరమైన వాతావరణమే వుంది. రెండు ఎలకలు పావనిని చూడగానే కంగారుగా పరుగెత్తాయి. తలుపు తెరవగానే ఒకపెద్ద బల్లి జరజరా గోడమీదికి పాకింది.

పావని ఒళ్ళు జలదరించింది. బల్లి అంటే చచ్చేంత భయం పావనికి. అయినా హర్ష మీద వున్న ప్రేమ అన్నిటినీ జయించేట్లు చేసింది. బల్లికాదు పాము వచ్చినా పావని బెదిరేది కాదు.

స్టోర్‌లో చీకటిగా వుంది. లైట్ వేసింది. మూలన వున్న పేపర్ల గుట్ట దగ్గర వంగి కూర్చుని, వెతకటం మొదలుపెట్టింది.

ఎలాగూ అమ్మేస్తున్నాం కదా అని కాబోలు పేపర్లన్నీ కలిపేశారు. చాలా కష్టపడి వెతకాల్సి వచ్చింది. చివరికి ఆ పేపర్ దొరికింది. కానీ అది మెయిన్ ఎడిషన్ మాత్రమే. అందులో హైదరాబాద్ అనుబంధం లేదు. హర్షకి కావల్సింది మెయిన్ పేపరా, హైదరాబాద్ అనుబంధమా? ఏమో, ఎందుకైనా మంచిదని హైదరాబాద్ అనుబంధం కోసం వేట సాగించింది పావని. కలగాపులగమైపోయిన ఆ పేపర్ల గుట్టలో, బల్లులూ, ఎలకలూ తిరుగుతున్న ఆ గదిలో, ఏ కంపరమూ లేకుండా దీక్షగా వెతికి వెతికి, చివరకి మొత్తం పేపర్ని సాధించింది పావని.

గదిలో ఫాన్‌లేదు. చెమటలు పట్టేశాయి. అసలు ఇందాకే రుచికతో తిరిగి తిరిగి నీరసం వచ్చేసింది కూడా. రుచిక హోటల్లో ఏదన్నా తిందామని అడిగినా, మళ్ళీ ఇంటికివచ్చి అన్నం తినకపోతే మమ్మీ తిడుతుందని చెప్పి, ఏం తినకుండా వచ్చింది. అసలు కారణం అదికాదు. హర్షని మళ్ళీ ఈరోజుకి ఇంకోసారి చూడాలన్న కోరిక. హర్ష ఏడు గంటలకి ఇంటికి వస్తాడు. అతను రోజూ బయటకి వెళ్ళేటప్పుడూ, లోపలకి వచ్చేటప్పుడూ కూడా చాటుసుంచో, వీలైతే ఎదురుగానో చూడకుండా పావని బతకలేదు. కేవలం చూస్తే ఏమొస్తుందని తననితాను ఎన్నోసార్లు ప్రశ్నించుకుంది కూడా. కానీ, చూడకుండా మాత్రం బతకలేదు. ఆ చూడటంలో వున్న ఆనందం ప్రేమించే వాళ్ళకి అర్థమవుతుంది. భాషలోని భావం అది తెలిసిన వాళ్ళకే అర్థమవుతుంది. ప్రేమ కూడా ఒక భాష. అది తెలిసినవారికే ఆ భావం అర్థమవుతుంది. తెలియనివారికి అవి పిచ్చిచేష్టల్లా ఉంటాయి.

పావని పేపర్ని గుండెలకి హత్తుకుని, లేచి నిలబడింది. స్టోర్‌రూమ్‌లోంచి బయటపడింది.

"దొరికిందా? " అడిగాడు పరంజ్యోతిగారబ్బాయి.

"ఆ" అంటూ పరుగు తీయబోయింది పావని.

"చీకట్లో ఏంటా పరుగు? పడిపోతావు. అయినా పేపర్ దొరికింది కదా. దాన్ని అలాగే పట్టుకుపోవటమేనా? థాంక్స్ చెప్పటంలాంటివి లేవా? " పరంజ్యోతిగారబ్బాయి నవ్వుతూ అడిగాడు.

"అవును కదూ. మర్చిపోయాను"

పావని గేటు దగ్గరకు గబగబా నడిచింది.

"మర్చిపోయానంటున్నావుగానీ థాంక్స్ మాత్రం చెప్పటంలేదు. ఒక్కసారి థాంక్‌యూ అంటే ముత్యాలు రాలిపోతాయా? "

"అయ్యయ్యో. అవును. చెప్పనేలేదుకదూ. థాంక్యూ... థాంక్యూ" అనేసి పరుగుతీసింది పావని.

గబగబా వెళ్ళాలి.

హర్షకి ఈ పేపర్ ఇవ్వాలి.

ఆకలీ దప్పికా ఏవీ పావనిని బాధించటం లేదు. నిండా మునిగిన వాడికి చలి వుండదు. ప్రేమలో నిండా మునిగిపోయిన వాళ్ళకి అసలు ఏదీ ఉండదు. ఆకలీ, దప్పికా, చలీ, వేడీ ఏదీ ఉండదు. మండు టెండలో వెన్నెల షికార్లు, మంచుసీమల్లో వెచ్చటి విహారాలు, కరకర ఆకలి వేస్తున్నా పట్టించుకోకుండా కమ్మని ప్రేమని మాత్రమే ఆస్వాదించి ఆరగించగలగటం, ఇవన్నీ ప్రేమికులకే సాధ్యం.

పావని చీకట్లో చెప్పులైనా వేసుకోకుండా పేపర్ తీసుకుని పరుగుపెట్టింది. తన ప్రియమైన హర్షకి కావల్సింది ఇస్తున్నాననే ప్రేమతో, తృప్తితో.

అక్కడ అతను తన గురించి అంతా తెలుసుకున్నాడనీ, తను అక్కడికి వెళితే ఏంమాట్లాడాలో, ఏంచేయాలో నిర్ణయించేసుకున్నాడనీ ఆమెకి తెలీదు.

గబగబా హర్ష ఇంటిని చేరుకుంది. గేటు తీసింది. కాలింగ్‌బెల్ నొక్కింది.

హర్ష తల్లీ, తండ్రీ ఇంట్లో లేరు. బంధువుల ఇంటికి వెళ్ళారు.

వంటమనిషి మాత్రం వుంది. ఆమే వచ్చి తలుపు తీసింది.

"హర్ష ఉన్నాడా? " రొప్పుతూ అడిగింది పావని.

"ఉన్నాడు. ఏంటి, అంత కంగారుగా ఉన్నావు? " ఆశ్చర్యపోతూ అడిగింది వంటమనిషి.

"ఏంలేదు. పేపర్ అడిగాడుట. తెచ్చాను"

"పైన గదిలో వున్నాడు. వెళ్ళు" అంది వంట మనిషి.

పావని దూకుతూ రెండేసి మెట్ల చొప్పున గబగబా ఎక్కేసి పైకి వెళ్ళింది.

హర్ష గదిలో వున్నాడు.

పావని గదిలో అడుగు పెట్టింది.

తనకు ఎలాటి సంఘటన ఎదురవబోతుందో పావనికి తెలియదు.

అక్కడ గదిలో హర్ష కూర్చుని, దీక్షగా ఏదో చదువుకుంటున్నాడు.

అతన్ని ఒంటరిగా చూస్తూ పావని నిగ్రహించుకోలేకపోతోంది. వెంటనే వెళ్ళి అతన్ని చేతులతో చుట్టేయాలనీ, కొంచెం ముడుచుకున్నట్లు కనిపించే ఆ మూతిని కొరికేయాలనీ, బలంగా కనబడే ఆ చేతుల్ని లాక్కుని తన నడుము చుట్టూ బలవంతంగా చుట్టేసుకుని, అతని కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూస్తూ బలంగా, ప్రబలంగా బిగుసుకుపోయిన కౌగిలిలో ఒకరి అధరామృతం ఒకరు రుచి చూస్తూ సర్వం మరిచిపోవాలనే...

ఊహల్లో తేలిపోతూ అలాగే నిలబడిపోయింది పావని. అతను చటుక్కున తనవైపు తిరిగేసరికి తుళ్ళిపడి, ఊహల్లోంచి బయటపడి, అతనివైపు చూసింది.

కాస్త ముడుచుకున్నట్లు అందంగా కనిపించే అతని మొహం పావనిని చూడగానే మరికాస్త ముడుచుకుంది. కనుబొమలు కూడా ముడేసి, కోపంగా చూశాడు.

పావని ఉలిక్కిపడింది. గుండెల్లోంచి వణుకు మొదలైంది. ఏంజరిగింది?

హర్షకి తనమీద కోపమా? ఏమై ఉంటుంది? అతని ఉదాసీనతని భరించలేక అతనివైపు భయంగా, దీనంగా చూసింది.

"ఏంటి ఇప్పుడు వచ్చావు? " అతను కనుబొమలు ముడుచుకునే అడిగాడు.

"పేపర్... మొన్నటి పేపర్ కావాలని అడిగావుట కదా? " పావని తడబడుతూ భయంభయంగా అంది.

"అయితే? "

"ఇదుగో... తీసుకువచ్చాను" చేతిలో పేపర్ని అతని ముందుకి చాపింది.

అతను తీసుకోలేదు.

"ఎట్లా తెచ్చావు? " అన్నాడు.

"చాలా కష్టపడి సాధించాను తెలుసా? చివరికి పరంజ్యోతిగారింట్లో దొరికింది"

"మీ పేపర్ ఏమైంది? " అతను కోపంగా

చూస్తూ అడిగాడు.

"ఏమైందంటే" పావని తొట్రుపడింది. అతను అలాగే కోపంగా చూస్తున్నాడు. పావని అతని కళ్లల్లోకి చూడలేక, తడబడి పోయి, తలవంచేసుకుని నిలబడింది.

"ఏమైందంటే చెప్పవేం? " అతను గద్దిస్తూ అన్నాడు.

పావని జవాబు చెప్పలేదు. బుగ్గల్లోంచి వెచ్చటి ఆవిరి వస్తోంది. మొహం ఎర్రబడి పోయింది. పెదవులు వణుకుతున్నాయి. మనిషి చిగురుటాకులా కంపించిపోతోంది.

ఏంటి అసలు హర్ష ఉద్దేశం?

"ఏమైంది? " అతను హూంకరిస్తున్నట్లు అడిగాడు.

"పోయింది"

"ఏమైపోయింది? " అతను వెటకారం, కోపం జోడించి అడిగాడు.

"ఏమో! ఎటో పోయింది"

"ఏమైపోయిందో, ఎటుపోయిందో నాకు తెలిసిపోయింది" అతను కోపంగా అరి చాడు.

గబగబా వెళ్ళి తన కప్ బోర్డ్‌ని తెరి చాడు. ఒక బాక్స్‌లో జాగ్రత్తగా దాచిన గులాబీరంగు కాగితాలని బయటకు తీశాడు.

ఒక్కొక్కదాన్నీ విప్పి బిగ్గరగా చదివాడు.

"నీ బుగ్గ చూస్తే కొరకబుద్ధేస్తుంది"

"నీ క్రాఫ్ చూస్తే చెరపబుద్ధేస్తుంది"

"నీ ఒళ్లు చూస్తే నలపబుద్ధేస్తుంది"

"నీ పోజు చూస్తే దులపబుద్ధేస్తుంది"

అతను గట్టిగా అరుస్తున్నట్లు చదువు తుంటే పావని బిత్తరపోయి చూస్తోంది.

"ఇది ఎవరు రాశారంటావు? ఆడవా ళ్లేనా? ఇంత పచ్చిగా రాయగలరా? ఛీ ఛీ' ' అన్నాడతను.

పావనికి భూమి కృంగిపోయి తను అందులో కూరుకుపోతే బాగుండుననిపి స్తోంది.

హర్ష ఆ కాగితాన్ని పావని మొహం ముందు ఆడించాడు.

"చెప్పు. వీటిని ఎవరు విసిరారు? దాచి లాభంలేదు. మీ ఇంటికి వచ్చి అన్నీ చూసే శాను. నిజం చెపితే కనీసం ఆ గౌరవ మన్నా నీకు దక్కుతుంది" అన్నాడు.

పావని తల దించేసుకుంది. హర్షకి అంతా తెలిసిపోయిందన్నమాట.

"చెప్పు. నువ్వే కదూ" గద్దించాడు హర్ష. పావని తడబడుతూ తల ఊపింది. అడ్డం గానో, నిలువుగానో, అసలు ఎటు ఊపుతు న్నాననే స్పృహ కూడా లేని అయోమయ స్థితిలో తల ఊగించేసింది.

"గానుగెద్దులా తల ఊపుతున్నావు. ఏం నోటితో చెప్పలేవూ? "

"నీకు చాలామంది విసురుతున్నారు. అన్నీ నేను విసరలేదు" అంది పావని.

"తెలుసులే. నీ ఫేవరెట్ కలర్ పింక్ కదూ. పింక్ కలర్ కాగితాలు మాత్రమే నీవి. తెలుసు. ఈ కాగితాలు విసిరింది నువ్వే కదూ? "

"అవును. నేనే" పావని వణుకుతున్న గొంతుతో చెప్పింది.

మరుక్షణం...

ఏం జరుగుతున్నదో పావనికి తెలిసేలో పలే పావని కళ్లముందు మెరుపులు మెరి శాయి.

హర్ష కళ్లల్లోంచి నిప్పులు కురిశాయి.

హర్ష పావని చెంప ఛెళ్లుమనిపించాడు. అతనెంత బలంగా కొట్టాడంటే పావనికి కాసేపు ప్రాణం దిమ్మెరపోయింది. కళ్ల లోంచి గిర్రున నీళ్లు తిరిగాయి. చెంప మండిపోతోంది. లేత చర్మం ఆ బలమైన దెబ్బకు కొరడాతో కొట్టినట్లు చరచర మండుతోంది.

పావని చెంప పట్టుకుని అలాగే స్థాణు వులా నిలబడిపోయింది.

హర్ష పావని స్థితిని ఏమాత్రం గమనిం చటం లేదు.

"ఛీ... నీకు సిగ్గులేదూ? నిన్ను

నమ్మాను. ఎంతో కాలం నుంచీ నాకు తెలిసిన మనిషివి. నా ట్రూ ఫ్రెండ్‌లా నిన్ను భావించాను. వెర్రి వెధవలా నా బాధలూ, సుఖాలూ నీతో వెళ్లబోసుకున్నాను. నాకు కొండంత అండగా ఉన్న నిజమైన స్నేహితురాలివనుకున్నానుగానీ, నన్ను దగాచేస్తున్న వాళ్లలో నువ్వూ ఒకరివని తెలుసుకోలేకపోయాను. ఆ కాగితాలు వచ్చి పడ్డప్పుడల్లా ఫూల్‌లా నీతో నా బాధ వెళ్లబోసుకున్నాను. యూ ఆర్ ఎ చీట్. నువ్వొక దగాకోరువి మాత్రమే కాదు. పెద్ద ఆర్టిస్టువి. నేనేదో ప్లేయ్‌నని విర్రవీగానుగానీ, నీ నటనముందూ, ఒడుపుగా ఎవరు విసిరారో కూడా తెలీకుండా అద్భుతంగా కాగితాలు విసిరి, అమాయకంగా నిలబడే నీ టాలెంట్ ముందూ నేనెందుకూ పనికిరాను. పో ముందు. ఇక్కడ్నుంచిపో. నా కళ్లకి మరి కనిపించకు" అన్నాడు.

పావని కంపించిపోయింది.

ఆమె గుండె బద్దలైపోయింది.

గట్టిగా ఏడ్చేసింది.

"హర్షా. ప్లీజ్ నన్ను అపార్థం చేసుకోకు. హర్షా నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నా ప్రేమ నీకు తెలియాలని మాత్రమే ఇలా చేశాను. ప్లీజ్, నన్ను క్షమించు" భోరున ఏడుస్తూ చెప్పింది పావని.

"నువ్వు నా మనసుని తీవ్రంగా గాయపరిచావు. నిన్ను క్షమించాను కాబట్టే ఈ మాత్రమన్నా చెప్పాను పో. ఇంక ఎప్పుడూ ఈ వైపుకి రాకు. నాతో మాట్లాడాలని ప్రయత్నించకు"

"హర్షా అలా అనకు. ఐలవ్‌యూ. నా ప్రేమని స్వీకరించు. ప్లీజ్"

"పావనీ, వెళ్లు" అతను సీరియస్‌గా చెప్పాడు.

"హర్షా. నన్ను ప్రేమించాననను. ప్లీజ్"

"నాకు ప్రేమా, దోమా అంటూ కూర్చునే తీరికలేదు. నాముందు ఒక పెద్ద టాస్క్ ఉంది. దాన్ని సాధించాలి. అంతే"

"నన్ను ప్రేమిస్తున్నానను చాలు. ఇంకేం అక్కర్లేదు. నీ టాస్క్‌లకీ, టార్గెట్‌లకీ నేను అడ్డురాను. నా ప్రేమ అంగీకరిస్తే చాలు, నీకోసం ఎన్నాళ్లయినా వేచి ఉంటాను" పావని వెక్కుతూ చెప్పింది. అతనివైపు ఆశగా, వేడుకోలుగా, ఆత్రంగా చూస్తోంది.

"వెళ్లు. నాకు ఇవన్నీ ఆలోచించే తీరిక లేదని ఎప్పుడో చెప్పాను. వెళ్లు" అతను తరిమి కొడుతున్నట్లు అన్నాడు.

"ప్లీజ్"

"పావనీ. వెళ్లు. నీకు ఒక లక్ష్యం లేదు. క్రమశిక్షణలేదు. నీతో మాట్లాడితే టైమ్ వేస్ట్. పో ఇక్కడ్నుంచి"

"హర్షా... నువ్వు కాదంటే నేను చచ్చిపోతాను"

"ఇలాటి బెదిరింపులకి నేను లొంగను. ఈ మాట చాలామంది అన్నారు"

"అంతేనా? "

"అంతే" హర్ష మొహం తిప్పేసుకున్నాడు.

"హర్షా. నన్ను కాదంటే చాలా బాధపడతావు. నీకు బోలెడుమంది అమ్మాయిలు, నాకంటే చాలా అందగత్తెలూ, గొప్పగొప్ప వాళ్లూ దొరకవచ్చు కానీ వాళ్లు ఎవరూ నాలా నిన్ను ప్రేమించరు. నేను నిన్ను ఈ ప్రపంచంలో అందరికన్నా ఎక్కువగా చాలా చాలా గొప్పగా ప్రేమిస్తున్నాను హర్షా. నువ్వు లేంది నేను బతకలేను"

"ఇలాటి కబుర్లంటే నాకు పరమ అసహ్యం" మొహం రోతగా పెట్టుకుని చెప్పాడు హర్ష.

"అంతేనా"

"అంతే... వెళ్లు" అతను పావని చెయ్యి పట్టుకుని, గది తలుపు దాకా తీసుకువచ్చి వెళ్లమన్నట్లు చెయ్యి చూపాడు.

పావని అభిమానం గాయపడ్డది. అవమానంతో గుండె మండిపోతోంది.

వెనకనుంచి అతను తన రూమ్ తలుపుల్ని భళ్లున మూసుకోవటం వినిపించింది.

మండుతున్న చెంప, మండిపోతున్న గుండె ఆమె అహాన్ని ఎగదోస్తున్నాయి.

ఎట్లా వచ్చి పడిందో కూడా తెలీకుండా, ఇంట్లోకి వచ్చి పడింది.

ఇంటికి రాగానే ఒక ఆలోచన హఠాత్తుగా మెరుపులా వచ్చింది.

ఏదో వెర్రి...

ఏదో ఆవేశం...

హర్షకి తను అతన్ని ఎంత ప్రేమిస్తోందో, ప్రత్యక్షంగా తెలియచెప్పాలి.

వెంటనే వెళ్ళి వంటింట్లో ప్రవేశించింది. కత్తులు ఉన్న షెల్ఫ్‌వైపు నడిచింది. బ్రెడ్ కోసే కత్తి, పళ్లు కోసే కత్తి, కూరగాయలు తరిగే కత్తి, గట్టిరకాల్ని కోసేకత్తి, రకరకాల కత్తులున్నాయి.

తనకు కావల్సిన పదునైన కత్తిని తీసుకుంది. వెర్రి ఆవేశంతో ముందుకి నడిచింది.

తన గదిలోకి వెళ్ళి టేబుల్ సొరుగు లోంచి తెల్లకాగితాన్ని లాగింది. దాన్ని టేబుల్ మీద పెట్టి, కుర్చీలో కూర్చుంది.

కుడిచేత్తో కత్తిని బలంగా పట్టుకుని, వెర్రి ఆవేశంతో, తెగింపుతో మెరుస్తున్న కళ్లతో కత్తితో బలంగా ఎడమచేతిని కోసుకుంది.

రక్తం జివ్వున చిమ్మింది.

వెంటనే కలం తీసుకుంది. ధారలుగా రక్తం కారుతున్న చోట దాన్ని ముంచి రాయటం మొదలుపెట్టింది.

"ప్రియాతి ప్రియమైన హర్షా... ప్లీజ్ నన్ను అర్థంచేసుకో. నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నానని ఎందుకు తెలుసుకోవు? హర్షా నన్ను నమ్ము. ఐలవ్‌యూ. నాది స్వచ్ఛమైన ప్రేమ"

కలం రక్తంలో మునిగి కాగితంమీద సాగిపోతోంది. మల్లెపూల రాశి మధ్య ఎర్ర గులాబీల్లా తెల్లటి కాగితంమీద ఎర్రటి రక్తాక్షరాలు.

హర్ష గదిలో లైట్ వెలుగుతోంది.

వెంటనే గబగబా వెళ్ళి తలుపుకొట్టింది. ఇంట్లో ఎవరూ లేరు. హర్ష తనే వచ్చి తలుపు తీశాడు. పావనిని చూడగానే అతని కనుబొమలు ముడుచుకున్నాయి.

"ఏంటి? మళ్ళీ ఎందుకు వచ్చావు? మెడ పట్టి బయటకు తోసినా సిగ్గురాలేదా?" తీవ్రంగా చూస్తూ అడిగాడు.

"హర్షా" గాయపడ్డట్లు చూస్తున్న పావనిని చూసినా అతని కళ్లల్లో బాధ కనిపించలేదు.

"హర్షా, ఇది తీసుకో" అంది పావని అతని మాటలని పట్టించుకోకుండా.

"ఏమిటిది?"

"ఉత్తరం"

"కనిపిస్తూనే ఉందిలే. ఎదురుగా ఉన్నాను. నాకు నేరుగా చెప్పకుండా ఆ ఉత్తరం ఏంటి?" చిరాగ్గా అడిగాడు.

"నా రక్తంతో రాశాను" అంది పావని.

"ఏమిటీ? రక్తంతోనా? ఎందుకూ? ఇంట్లో రీఫిల్స్ లేవా?" అతను విరగబడి నవ్వుతూ అడిగాడు.

పావనికి గుండె రగిలిపోయింది.

"హర్షా. నన్ను అర్థంచేసుకో" అంది జాలిగా.

"ఏమిటి అర్థంచేసుకోవాలి. నువ్వెప్పుడో అర్థమైపోయావు" హర్ష తేలిగ్గా చూస్తూ అన్నాడు.

"అర్థమైపోయానా?"

"అవును"

"ఏం అర్థం అయాను. నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. అందుకే ప్రాణాల్ని కూడా లెక్క చెయ్యకుండా కత్తితో చీరుకుని, నా రక్తంలో పెన్ను ముంచి రాశాను. నువ్వంటే నాకెంత ఇష్టమో ఇప్పుడన్నా అర్థమైందా?" అడిగింది పావని. ఆవేశంతో, దుఃఖంతో ఆమె శరీరం ఒణుకుతోంది. పెదవులు కంపిస్తున్నాయి. ఎగిసిపడుతున్న దుఃఖాన్ని అదిమి పడుతూ వెర్రిగా అతనివంక చూస్తోంది.

"ఇప్పుడు ఇంకా బాగా అర్థమైంది. నీలాం

టివాళ్లకి బద్ధకం ఎక్కువ. ఏపనీ చేయడానికి ఒళ్లొంగదు. నీకు ఏ టాలెంటూ లేదు"

"అయితే? " పావనికి అసలు అతడేం మాట్లాడుతున్నాడో, ఎందుకు మాట్లాడుతున్నాడో కూడా అర్థంకాలేదు.

"అందుకని నాలాగా ఎవరన్నా దొరికితే వాళ్లని పట్టుకుని వేళ్లాడతారు. ప్రేమ, పెళ్లీ అంటూ కబుర్లు చెప్పి పెళ్లిచేసుకుంటారు. ఏదన్నా సాధించాలంటే చాలా కష్టం. సొంతంగా ఏది చెయ్యాలన్నా నీలాటి అసమర్థులకి చేతకాదు. అందుకని షార్ట్‌కట్, మేడ్ఈజీ మెథడ్స్ వెతుక్కుంటారు. డబ్బు సంపాదించాలంటే బోలెడు కష్టం. అదే డబ్బున్నవాడిని వలలో వేసుకుని పెళ్లిచేసుకుంటే చిటికెలో ధనవంతులైపోవచ్చు. నీకు పేరు, ప్రఖ్యాతులు, డబ్బూ, గొప్పా కావాలి. అవి సొంతంగా సంపాదించే సామర్థ్యం, తెలివీలేవు. అందుకని నన్ను పట్టుకున్నావు"

"చాలా దారుణంగా మాట్లాడుతున్నావు" పావని నిలువునా కంపించిపోతూ అంది.

"నేను మాట్లాడుతున్నాను. నువ్వు చేసి చూపిస్తున్నావు. ఎవరన్నా చెవిలో పువ్వు పెట్టుకున్నవాళ్లుంటే వెళ్లి వాళ్లకి ఈ కబుర్లు చెప్పు"

"నీకోసం నేను ఇంజనీరింగ్ సీట్ వదిలి బి.కామ్ లో చేరాను."

"నాకోసం కాదు, చేతకాక మానుకున్నావు"

"మంచి మార్కులు వచ్చాయి నాకు, నీకన్నా కూడా"

"బట్టీ పట్టావు. రాకేం చేస్తాయి"

"ఇంకానయం. కాపీ కొట్టాననలేదు" కళ్ల నీళ్లు బుగ్గలమీదకి జారిపోతున్నాయి. పావని తుడుచుకునే ప్రయత్నం కూడా చేయకుండా అంది.

"అది నీకే తెలియాలి"

"ఛీ.. నువ్వింత దుర్మార్గుడివనుకోలేదు" పావని నిలువునా ఒణికిపోయింది.

"దుర్మార్గమా? నేనేం చేశాను? నీకేమన్నా మాయమాటలు చెప్పి మోసం చేశానా? " హర్ష తీవ్రంగా చూస్తూ అడిగాడు.

పావని దగ్గర సమాధానంలేదు. మౌనంగా ఎటో చూస్తూ ఉండిపోయింది.

"వెళ్లిరా. ఎవరైనా చూస్తే బాగుండదు. నాకేం నష్టం లేదు. నీకే"

"నామీద నీకెందుకు జాలి? "

"జాలి లేదు. నాకు చాలా చిరాగ్గా ఉంది. వెళ్లిపో"

"ఆఖరుసారి అడుగుతున్నాను. నా ప్రేమ అంగీకరించవా? "

"ఎన్ని సార్లు అడిగినా ఒకటే. నీ మీద నాకు సదభిప్రాయం లేదు. డిసిప్లిన్ లేని వ్యక్తులమీద నాకెప్పుడూ సదభిప్రాయం ఉండదు"

"అంతేనా? "

"అంతే. ఒకటే విషయం నాకు నవ్వు పుట్టిస్తోంది. నువ్వు అన్నిటిలోనూ అసమర్థురాలివి. అంతేకాదు, షార్ట్‌కట్‌లో నా ప్రేమ పొందాలనుకున్నావు. ఆఖరికి అందులో ఫెయిలయ్యావు. చేతకాని చవటవి. నీవల్ల ఏదీ కాదు. నీకు ఏదీ చేతకాదు" అతను భడాల్న తలుపు వేసేశాడు.

పావని ఏడుస్తూ ఆ తలుపులవైపే చూస్తూ నిలబడి పోయింది.

"ఏమీ చేతకాని చవటవి" హర్ష మాటలు మారు మోగుతున్నట్టు అనిపిస్తున్నాయి. చెవుల్లో హోరు. ఒళ్లు వణుకుతోంది.

గుండెనిండా విషాదం.

రక్తనాళాలు తెగిపోతున్నట్టు అనిపిస్తోంది.

"అయ్యో..." గుండె పగిలిపోతోంది.

భరించరాని వేదన, ఆవేదన.. చెప్పనలవికాని బాధ, నరాలు తెగిపోతున్నట్టున్న ఆవేశం... ఆక్రోశం...

పావని ఒళ్లంతా ఒణికిపోతుంటే, ఏడుస్తూ అక్కడే నిల్చుండిపోయింది.

ఏడ్చిపడ్చి ఎప్పటికో ఇంటికి తిరిగి

వచ్చింది.

పావని ఇంటికి తిరిగి వచ్చింది.

హర్ష తనని ప్రేమించడు. హర్ష లేకుండా తను బతకలేదు. అందుకని దీనికి వున్న ఒకేఒక సొల్యూషన్.. చచ్చిపోవటం... అంతే..

చచ్చిపోవాలని గట్టిగా నిర్ణయం చేసుకున్నాక మనసు కాస్త గట్టిపడింది. ఆ తర్వాత ఎలా చావాలా అని ఆలోచించింది.

ఫాన్‌కి ఉరేసుకునా? ప్రయత్నించి చూసింది. చేతకాలేదు.

నిద్రమాత్రలు తింటేనో? దానికి ప్రిస్కిృప్షన్ ఉండాలన్నారు.

ఎన్నడూ ఒంటరిగా ఎక్కడికీ వెళ్లే అలవాటు లేదు పావనికి. స్నేహితులో, తల్లితండ్రులో ఎవరో ఒకరు తోడు ఉంటారు. అయినాసరే ఎలాగో ఒకలాగ పురుగులమందు కొనుక్కుని తాగాలని నిర్ణయించుకుంది. ఒక్కత్తే బయలుదేరి ఒక డిపార్ట్‌మెంటల్ స్టోర్‌కి వెళ్లి, అక్కడ బొద్దింకల మందు కొంది.

ఇంటికి వచ్చి ప్రశాంతంగా కూర్చుంది. మామూలుగా భోజనం చేసింది.

రాత్రి తన గదిలోకి వెళ్లాక రహస్యంగా దాచిన ఆ ప్యాకెట్‌ని బయటకి తీసింది. ప్యాకెట్ తెరిచి అందులో ఉన్న బాటిల్‌ని బయటకి తీసింది. గభాల్న నోట్లో వేసుకోబోయింది.

తలుపు దగ్గర చప్పుడు....

ఎవరో పావని నోటి దగ్గరున్న బాటిల్‌ని గభాల్న లాగేశారు. పావని హతాశురాలైచూసింది.

ఎదురుగా అమ్మా, నాన్నా...

"నన్ను చచ్చిపోనివ్వండి.. ఎందుకు ఆపారు?" భోరుమంది పావని.

"మేము ఆపలేదు. అలాగే చచ్చిపో" అన్నాడు బాబూరావు కఠినంగా చూస్తూ.

పావని అయోమయంగా చూస్తుంటే బేబీ పర్వతవర్ధని కోపంగా చూసింది.

"పావనీ! ఆ మందేదో తప్పకుండా తీసుకుని చచ్చిపో. కానీ అదేదో పుచ్చుకునే ముందు మాక్కూడా కాస్త ఇవ్వు. నువ్వు ఆత్మహత్య చేసుకుని చచ్చాక మాకు మాత్రం ఈ లోకం ఎందుకు? ఈ మందు చూస్తే మన ముగ్గురికీ చాలదులా ఉంది. ఒక పని చెయ్యి. ముందు మేం ఇది తాగి చస్తాం. ఆ తర్వాత నువ్వు ఇంకో బాటిల్ తెచ్చుకుని పుచ్చుకో" అన్నాడు బాబూరావు.

బాబూరావు మొండిమనిషి. అన్నాడంటే ఊరికే అనడు. పావని భయంగా చూసింది.



"అవును పావనీ. ఇది నిన్ను బెదిరించటానికో, భయపెట్టటానికో చెప్పటం లేదు. నువ్వెందుకు చావాలనుకుంటున్నావో మేము ఊహించగలం. ఎవరో లేకపోతే బతుకే లేదని నువ్వెలాగ చావాలనుకుంటున్నావో, నీమీదే ప్రాణం పెట్టుకుని బతుకుతున్న మేం అలాగే నువ్వు లేకపోతే చావాలనుకుంటున్నాం. ఇది తాగి మేం ఇద్దరం చస్తాం. నువ్వు రేపొద్దున్న మరొక బాటిల్ తెచ్చుకో" బాబూరావు సీసాని ఎత్తి తాగబోయాడు.

పావని ఏడుస్తూ బాటిల్‌ని లాగేసింది. భోరున ఏడుస్తూ కింద పడిపోయింది.

బాబూరావు ఆమె పక్కనే కూర్చున్నాడు.

"పావనీ! నువ్వెందుకు ఈ నిర్ణయం తీసుకున్నావో తెలీదు. ఎంత తీవ్రమైన మానసిక క్షోభకి గురై ఈ నిర్ణయం తీసుకున్నావో మాత్రం అర్థం చేసుకోగలను. పావనీ.... ఏ మానసికక్షోభ అయినా, ఎంత తీవ్రమైన వేదన అయినా దాని ఉద్రిక్తత కొన్నాళ్లే. కొన్నాళ్లు భరించు. ప్లీజ్.. మాకోసం.... కొన్నాళ్ల య్యాక అంతా సర్దుకుంటుంది. ప్లీజ్... ఆవేశం తగ్గించుకుని ఆలోచించు" అన్నాడు.

"నాకు చచ్చే స్వతంత్రం లేదా?" పావని ఏడుస్తూ అడిగింది.

"లేదు. దేవుడిచ్చిన జీవితాన్ని చివరి దాకా గడపాల్సిందే" అన్నాడు బాబూరావు.

"ఏదీ లేదంటే మేం చెప్పిన మార్గం ఉండనే ఉంది. ఆ విషమేదో ముందు మాకివ్వు" అంది బేబీ పర్వతవర్ధని.



బాబూరావు పావని వీపుమీద మెల్లగా తట్టాడు.

"పావనీ! నువ్వు లేకుండా మేం బతకలేం తల్లీ... ఇంకెప్పుడూ ఇలాంటి పనిచేయనని మాకు మాటివ్వు. మమ్మల్ని కడుపుకోతకి గురి చెయ్యకు. ప్లీజ్..." అన్నాడు.

తనకి చచ్చే హక్కు లేదని పావనికి అర్థమైపోయింది. తల్లితండ్రుల మొహాలు చూసి, వాళ్ల ఆందోళనా, క్షోభా చూసి పావని గుండెని ఎవరో మెలి తిప్పినట్ట యింది.

"సరే" అంది ఏడుస్తూనే.

★ ★ ★

పావని పిచ్చిదానిలా కంప్యూటర్‌ముందు కూర్చుంది. సాధారణంగా కంప్యూటర్ ముందు కూర్చోగానే అంతా సర్వం మర్చిపో తూంటారు. ఎంతసేపు కూర్చున్నా ఏమీ తెలియదువాళ్లకి. కానీ పావనికి మాత్రం ఎక్కడ కూర్చున్నా హర్షమీద ధ్యాసే. తీరని అలజడి, అశాంతి, దిగులు, దుఃఖం, ఒళ్లంతా కుదిపేస్తున్న అమితమైనబాధ. కంప్యూటర్ మీద ఏం వస్తున్నాయో, పోతు న్నాయో కూడా గమనించటంలేదు. కళ్ల ల్లోంచి కారే నీటిని తుడుచుకోవాలన్న ధ్యాస కూడా కలగలేదు.

ఉన్నట్టుండి వెర్రిగా ఎవరో నవ్వినట్టు వినిపించింది. ఉలిక్కిపడి చూసింది.

ప్రియాంక. ఆమె మొహంలో వెటకారపు నవ్వు చూడగానే పావనికి ఒళ్లు దహించుకు పోయింది.

"ఏమైంది నీ లవ్?" వెక్కిరింపుగా అడి గింది ప్రియాంక.

"నీకెందుకు? నోర్మూసుకుని పో" అంది పావని కోపంగా.

"అరవకు. అంతా నవ్వుతారు. ఇప్పటికే అంతా నిన్ను తల్చుకుని చచ్చేట్టు నవ్వుకుం టున్నారు" అంది ప్రియాంక.

"నన్ను తల్చుకునా? దేనికీ?"

"నువ్వు హర్ష దగ్గర భంగపడ్డ సంగతి అందరికీ తెలిసిపోయింది" ప్రియాంక మొహంలో అదే కొంటెనవ్వు.

"అయితే...?"

"నవ్వు రాదా మరి?"

"ఏడిసినట్టుంది" అంది పావని.

"వాళ్లకి నవ్వినట్టుంది"

"నీకు ఎందుకో అంత సంతోషం?" పావని కోపంగా అంది.

"సంతోషం ఏంలేదు. అయినా పాపం హర్ష నిన్ను ఏంచూసి ప్రేమిస్తాడు? అందమా? సాధారణమైన రూపం. ఏం స్పెషాలిటీ ఉంది నీలో?"

ప్రియాంక గర్వానికీ, అహంకారానికీ పావని గుండె గాయపడింది.

"నువ్వు మిస్ ఆంధ్రావి కదూ! అందరూ నిన్ను గొప్పగా చూస్తారని గర్వం నీకు"

"ప్రతివాళ్లూ నన్ను అదేపనిగా చూస్తుం టారు. వాళ్లచూపులు నాలో గర్వాన్ని పెంచుతాయి. నా అంత అందంగా ఉంటే నీకూ అందం యొక్క పవరేంటో తెలిసేది" అంది ప్రియాంక నిర్లక్ష్యంగా చూస్తూ.

పావని ప్రియాంకవైపు చూస్తూ ఉండిపో యింది.

"ఏంటలా చూస్తున్నావు?" ప్రియాంక అడిగింది.

"చూస్తూ ఉండిపోతారన్నావు కదా, అందుకే చూశాను. సరే, నువ్వు చాలా అందంగా ఉంటావు. ఓ.కే. అనుకుందాం. దానికి చిన్న పరీక్ష పెడదామా?" పావని అడిగింది.

"ఇంకేం పరీక్షలు. నాకు ఆల్రెడీ మిస్ ఆంధ్రా టైటిల్ వచ్చేసింది"

"నాకు అది చాలదు. నీ గొప్పతనం నాకు తెలియాలంటే..." పావని ఆగింది.

"ఏంచేయాలంటావు?"

"హర్షని నీ అందంతో పడేయగలిగితే... అతను నీ ప్రేమలోపడి తన ఆటను కూడా నిర్లక్ష్యం చేస్తే, నువ్వు నిజంగా అందగత్తెవే నని నేను ఒప్పుకుంటాను" అంది పావని.

ప్రియాంక సూటిగా పావనివైపు చూస్తోంది. ఆ చూపులు తట్టుకోలేని పావని తనకళ్ళు తిప్పేసుకుంది.

ఉన్నట్టుండి ప్రియాంక గట్టిగా నవ్వేసింది. "ఇదొక పరీక్షా?... రెండ్రోజులు పట్టదు" అంది.

"నీ ఇష్టం, నీకు కావాల్సినంత సమయం తీసుకో. నువ్వు ఆ పనిచెయ్యగలిగితేనే నువ్వు అందగత్తెవని నేను ఒప్పుకుంటాను"

"ఆ తర్వాత నేను చెప్పింది నువ్వు చెయ్యాలి మరి"

"ఏంటది? "

"తప్పనిసరేంలేదు. నీకిష్టమైతేనేలే"

"గెల్చినట్లే మాట్లాడుతున్నావే? "

ప్రియాంక నిర్లక్ష్యంగా తల ఎగరేసింది.

"గెలుస్తాను. నువ్వే చూస్తావు" ప్రియాంక విరగబడి నవ్వుతూ బయటికి వెళ్ళిపోయింది.

ఆ నవ్వు చూసి పావని గుండె మరికాస్త మండింది.

ప్రియాంక... తనని వెక్కిరించి, వేళాకోళం చేస్తూ, పురుగుని తీసిపారేసినట్లు తీసిపారేస్తున్న ప్రియాంక...

హర్ష... తన ప్రేమని తృణీకరించి, తనని దారుణంగా నిరాదరించి, అవమానించిన హర్ష...

హర్షపై పగ సాధించుకోవటానికి ఇంతకన్నా మార్గంలేదు.

కానీ తనకి హర్షపై నిజంగా పగవుందా? పావనికి సమాధానం దొరకలేదు. పగలేకపోవచ్చు కానీ అతని అహంకారాన్ని అంతం చేయాలన్న పట్టుదల మాత్రం తనకి వుంది.

ఒకవైపు అతను పతనంలో పడిపోతాడు. మరోవైపు తను ఎలాగైనా పట్టుపట్టి కృషి చేసి ఏదో ఒకటి చేసి, నలుగురిచేతా శభాష్ అనిపించుకుని తీరాలి. అప్పుడు హర్ష దగ్గరికి వెళ్ళాలి. వెళ్ళి, 'చూశావా ఇప్పుడు నీకన్నా నేనే గొప్ప కానీ ఇప్పటికీ నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నా ప్రేమ స్వచ్ఛమైంది, నిజమైనది, తెలుసుకో' అని చెప్పాలి.

కంప్యూటర్ రూమ్‌లోంచి బయటకు వచ్చింది.

దడదడమంటూ చప్పుడు. హర్ష మోటార్ బైక్ మీద వస్తున్నాడు.

పావని అణువణువూ అతనితో మాట్లాడాలని పరితపించిపోయింది. అతన్ని చూడకుండా ఉండలేకపోయింది. కళ్ళల్లో నీటిపొర...చూపు మసకబారుతోంది. అయ్యో, కనీసం కళ్ళారా చూసే అదృష్టం కూడా లేదా?

పావని ఏడుస్తూ మెట్లమీద కూర్చుండిపోయింది.

మర్చిపోవాలి. హర్షని మర్చిపోవాలి. హర్షని మర్చిపోతేగానీ తను ఏమీ చెయ్యలేదు. ఏదీ సాధించలేదు.

పావనికి దిగులుగా వుంది. దుఃఖంగా వుంది. ఏంచేయాలో తెలీని కోపంగా ఉంది. ఏదో చెయ్యాలి. ఏంచెయ్యాలి? ఏదో ఒకటి చెయ్యాలి. తననుతాను రుజువుచేసుకోవాలి. తనంటే ఏమిటో తడాఖా చూపించాలి.

కసిగా అనుకుంది. దవడ కండరం బిగుసుకుంది. పట్టుదలకు సూచనగా పెదిమలు బిగుసుకున్నాయి.

కాసేపు అలాగే కూర్చుండిపోయింది. ఆ తర్వాత లేచి తన ఫ్రెండ్ శ్యామకి ఫోన్‌చేసింది. శ్యామకి బొత్తిగా కుదురులేదు. అదోమాదిరిగా ఉండేది. నిలకడ లేకుండా ఉండేది. మాట్లాడుతూ మాట్లాడుతూనే మధ్యలో మనిషి ఎటో వెళ్ళిపోయేది. వస్తానన్న టైమ్‌కి వచ్చేదికాదు. చేస్తానన్న పని చేసేదికాదు. మూడీగా వుండేది. ఒకటే మిటి, చివరికి పిచ్చి వుందన్న లెవెల్ వరకూ వెళ్ళిపోయింది. శ్యామ ఎవర్నో ప్రేమించిందనీ, అతను తిరస్కరిస్తే అలా అయిపోయిందనీ అంతా చెప్పుకునేవాళ్ళు.

శ్యామని చూసి నవ్వుకునేవాళ్ళు నవ్వుకుంటుంటే, జాలిపడేవాళ్ళు జాలిపడేవాళ్ళు. ఎవ్వరినీ లెఖ్ఖచేయకుండా తన లోకంలో తాను ఉండేది శ్యామ. ఒకసారి ఒక పెళ్ళికివచ్చి మధ్యలో వెళ్ళిపోయింది. ఇంకోసారి వాళ్ళు పిలవకపోయినా ఒక పెళ్ళికి వెళ్ళి చివరిదాకా కూర్చుని వచ్చింది. కానీ అదంతా కొన్నాళ్ళ క్రితం సంగతి. ఇప్పుడు శ్యామ పూర్తిగా మారిపోయింది. కుదురూ, నిలకడాలేని ఆ శ్యామే ఈ శ్యామ అంటే ఎవరూ నమ్మలేనంత మారిపోయింది. సూటిగా చూడటం, శ్రద్ధగా వినటం, టైమ్ మెయిన్‌టైన్ చెయ్యటం, క్రమశిక్షణతో పనులన్నీ క్రమబద్ధంగా పూర్తిచేసుకోవటం, ఒకటేమిటి, అన్ని రకాలుగానూ మనిషి మారిపోయింది. పాటలు నేర్చుకుని పాడుతోంది కూడా. దానికోసం పొద్దున్నేలేచి ప్రాక్టీస్ చేస్తోంది. అంతా శ్యామను మెచ్చుకుంటున్నారు ఇప్పుడు.

శ్యామ అదంతా ఎలా సాధించగలిగింది. తన మూడీతత్వాన్నీ, నిలకడలేని ప్రవర్తననీ ఎలాగ మార్చుకోగలిగింది? ఇన్నాళ్ళూ పావనికి ఆ విషయం పట్టలేదు. కానీ ఇప్పుడు తను కూడా ఏదో సాధించాలనే సరికి అది ఎలా సాధించాలి, ఏంచేయాలి అన్న ఆలోచన పెరిగి శ్యామ గుర్తుకువచ్చింది.

"హలో" శ్యామ గొంతు వినిపించింది.

"హలో శ్యామా, నేను పావనిని"

"ఓ పావనీ, బాగున్నావా? ఏంటి, ఇన్నాళ్ళకి జ్ఞాపకం వచ్చానా? " శ్యామ నవ్వుతూ అడిగింది.

"కష్టాల్లో దేవుడు గుర్తుకొస్తాడుట"

"బాబోయ్, నాకంత గొప్పలేదుగానీ ఏంకావాలో చెప్పు"

"ఏదో కావాలని ఎలా తెలిసింది? " పావని నవ్వేసింది.

"ఊరకే ఫోన్‌చేయరు మహాత్ములు. నువ్వూ, నీ ధోరణీ అంతా నాకు తెలుసు కానీ సూటిగా చెప్పరాదూ? " శ్యామ కూడా నవ్వుతూ అంది.

"బొత్తిగా ఏకాగ్రత కుదరటంలేదు. ఏంచేయాలన్నా శ్రద్ధ ఉండదు. దేనిమీదా శ్రద్ధ ఉండదు"

ఫోన్‌లో శ్యామ విరగబడి నవ్వటం వినిపించింది. "అర్థమైంది. నీ రోగానికి తగ్గ మందు నా దగ్గర లభిస్తుంది. వెంటనే రా" అంది.

పావని శ్యామ ఇంటికి వెళ్లింది. శ్యామ తలుపులు తెరిచింది.

"మమ్మీలేదు. ఊరికి వెళ్ళింది. నేనే ఇంటి పని చూస్తున్నాను" అంది.

ఇల్లంతా శుభ్రంగా సర్దిపెట్టి వుంది. ఎక్కడి సామాన్లక్కడ పొందికగా వున్నాయి. వంటగదిలో అన్నీ ఎక్కడివక్కడ అమర్చి తీరుగా ఉన్నాయి. శ్యామకి ఇంత కుదురు ఎలా వచ్చిందా అని ఆశ్చర్యంగా చూసింది పావని.

"అలాచూడకు. నీ అనుమానం అర్థమైపోయింది" శ్యామ నవ్వింది.

వంటగదిలోకివెళ్ళి డబ్బాలో పోసి వున్న మురుకులూ, చేగోడీలూ తెచ్చింది.

"నేనే చేశాను, తిను" అంది స్టౌ వెలిగిస్తూ.

"కాఫీనా, టీనా. బోర్న్‌విటానా? ఏంకావాలి" అంది.

"ముందు నా ప్రశ్నకి సమాధానం కావాలి. నువ్వు ఏం అనుకోకుగానీ, ఇదివరకు తిక్కతిక్కగా ఉండే దానివికదా. ఇలా ఎలా అయావు" పావని సూటిగా అడిగేసింది.

శ్యామ నవ్వేసింది.

"ఇదివరకు సంగతి వేరు. అప్పుడు నేను అజ్ఞానంలో ఉన్నాను. ఇప్పుడు నేను వేరు. పూర్తిగా మారిపోయాను" అంది.

"అదే ఎలా? "

"టీ తాగుతూ తీరిగ్గా నా కథ విను" శ్యామ టీ కలుపుతూ అంది.

టీ కలిపి ఇద్దరికీ చెరో కప్పులో పోసింది. "పద హాయిగా సోఫాల్లో కూర్చుని మాట్లాడదాం" అంది.

ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

శ్యామ తన కథ చెప్పటం మొదలుపెట్టింది.

శ్యామ ఇంజనీరింగ్ చదువుతోంది. అదే కాలేజీలో కిరణ్ రెండో సంవత్సరం చదువుతున్నాడు.

ఫస్ట్ ఇయర్‌లో సీనియర్స్ ర్యాగింగ్ చేసినపుడు శ్యామ చాలా భయపడిపోయింది. కిరణ్ ఆమెతో పరిచయంచేసుకుని ఆ భయాన్ని పోగొట్టాడు. అన్నీ సీరియస్‌గా తీసుకోకూడదని ధైర్యం చెప్పాడు. ర్యాగింగ్ చేసిన విద్యార్థుల్ని మందలించాడు. అతను అలా చేసి ఉండకపోతే శ్యామ చాలా నష్టపోయి వుండేది. ఎందుకంటే ఆ ర్యాగింగ్ ఎంత భయంకరంగా ఉందంటే శ్యామ అసలు చదువు మానేసి ఇంట్లో కూర్చుందామా అని అనుకునేంత లెవెల్ కి వెళ్ళింది.

కిరణ్ గిటార్ వాయిస్తూ పాటలు పాడతాడు. కారుని స్పీడ్‌గా డ్రైవ్ చేస్తాడు. ముఖ్యంగా స్నేహంగా ఉంటాడు. కళ్ళల్లో ఎఫెక్షన్ కురుస్తూ ఉంటుంది. అతని కళ్ళు అయస్కాంతంలా మనుషుల్ని లాగేస్తాయి. అతని నవ్వూ, మాటలూ చూసినవాళ్ళెవరైనా అతనితో మాట్లాడకుండా ఉండలేరు. ఎంత సేపు మాట్లాడినా మనసు నొప్పించకుండా తియ్యగా మాట్లాడటం అతని ప్రత్యేకత.

శ్యామ ర్యాగింగ్ గురించి అంతకు ముందు వినివుంది. వాళ్ళ పిన్ని కొడుకు హరీష్‌ని కర్ణాటకలో ఏదో కాలేజీలో చేర్పించటానికి తీసుకువెళ్ళారు. వేలకి వేలు డొనేషన్‌కట్టి, అక్కడ చేర్పించి తిరిగి వచ్చారు. వాళ్ళు ఇంటికివచ్చి 'హమ్మయ్య' అనుకున్నంతసేపు పట్టలేదు, ఆ అబ్బాయి తిరిగి వచ్చేయటానికి.

అక్కడి హాస్టల్లో తిండి, ఇతర సౌకర్యాలు మాత్రమే చూసి వచ్చారు తల్లిదండ్రులు. అన్నీ బాగున్నాయి అనుకున్నారు. స్నానానికి వేడినీళ్ళు కూడా ఇస్తారుట అని సంబరపడ్డారు. కానీ క్లాసులు మొదలయ్యాక తెలిసింది.

ర్యాగింగ్ మొదలుపెట్టాక అసలు కథ మొదలయింది. వాణ్ని బలవంతంగా లాక్కుని, బస్‌స్టాప్‌కి తీసుకెళ్లారు. అక్కడ అమ్మాయిలు కొందరు బస్ కోసం వెయిట్ చేస్తున్నారు.

"వెళ్ళి వాళ్ళ కొలతలేంటో అడిగిరా? " అన్నారు. హరీష్‌కి తల తిరిగిపోయింది.

"ఛీ, తప్పు" అన్నాడు.

వాళ్లంతా నవ్వారు.

"అయితే బట్టలు విప్పేసి, అలా నడిచిరా" అన్నారు.

"నేను విప్పను" అన్నాడు హరీష్.

"అన్నీకాదులే, డ్రాయర్ వుంచుకో. ఫర్వాలేదు" అన్నారు.

"అస్సలు కుదరదు. నేనలాటివి చెయ్యను" అన్నాడు హరీష్.

హరీష్‌కి బాగా సైట్ వుంది. ఎప్పుడూ పవర్‌ఫుల్ కళ్ళజోడు పెట్టుకునే ఉండాలి. లేకపోతే ఏమీ కనబడదు. వాళ్ళకి అతని ఐ సైట్ సంగతి చూడగానే తెలిసిపోయినట్లుంది.

"అరే వీడికి సోడాబుడ్డీ కళ్ళద్దాలు ఉన్నాయిరా. అవిలేంది ఏమీ కనబడదు. వాటిని లాగేయండి" అన్నాడు ఒకడు.

అతని కళ్ళజోడు లాగి దూరంగా విసిరేశారు. బస్సు ఒకటి దానిమీద నుంచి పోయింది. కళ్లజోడు పూర్తిగా విరిగిపోయింది. హరీష్ తడుముకుంటూ నడుస్తుంటే ఆఖరికి అమ్మాయిలుకూడా నవ్వారు. అలాటి సంఘటనలు మరో రెండు జరిగాయి. వాళ్ళ రాగింగ్ ఎన్నాళ్ళకీ తగ్గేట్టులేదు.

"ఏడాది పొడుగునా రాగింగ్ చేస్తారుట" అన్నాడు ఒకతను.

కొంతమంది కొన్నాళ్లాగి మళ్ళీ వస్తామని ఇళ్ళకు తిరిగివెళ్ళారు. మరికొంతమంది అక్కడే ఉండి బాధలు పడుతున్నారు. ఒక తను మరీ సెన్సిటివ్‌గా వుండి ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

హరీష్ కూడా సెన్సిటివ్. తను ఆ రాగింగ్ ఇక భరించలేననుకుని తిరిగి వచ్చే శాడు.

"ఇక ఆ కాలేజీకి వెళ్ళను" అన్నాడు.

"వెళ్ళనంటే ఎలా? బోలెడంత డొనేషన్ కట్టాం. అది తిరిగి ఇవ్వరు" అంది తల్లి.

"కట్టింది ఎలాగూ ఇవ్వరు. కానీ మీవాడు మానేస్తే మాకు ఒక 'సీట్‌పో యింది కదా మరి అని మిగతా మూడేళ్ళకీ ఫీజు కట్టి మరీ కదలమంటారు. లేకుంటే సర్టిఫికేట్లు ఇవ్వరు" అన్నాడు తండ్రి.

"ఏంచేద్దాం మరి? " అంది తల్లి.

చుట్టాల్ని కూడా పిలిచి మీటింగ్ పెట్టారు.

"డబ్బుపోతే పోనీండి. పిల్లాడు ఏదన్నా అఘాయిత్యం చేసుకుంటే కష్టం. చదువు లేకపోతేపోయింది. బతికివుంటే బలుసాకు తినొచ్చు ఈసారి ఇక్కడ ఎంట్రన్సుకు బాగా చదివి ప్రిపేర్ అయితే ఇక్కడే సీట్ వస్తుంది. మరీ అక్కడ హాస్టల్లో కూడా ఉండాల్సి వచ్చేసరికి రోజంతా రాగింగ్ ఉంటుంది. భరించడం కష్టం పాపం. పోనీలే. వాడినేం అనకండి" అన్నారు అంతా.

చివరికి హరీష్ ఇక్కడే ఉండిపోయి మళ్ళీ ఎంట్రన్సురాసి, సీట్ సంపాదించి, ఎలాగో ఇంజనీరింగ్ చదువుతున్నాడు.

శ్యామకి హరీష్‌ని చూస్తే నవ్వు వచ్చేది. "ఎంతోమంది వెళ్ళి, చదివి వస్తున్నారు. హరీష్ ఏంటి ఇలాచేశాడు' అనుకునేది. కానీ తను నేరుగా ఆ బాధ అనుభవించాక రాగింగ్ . అంటే ఏమిటో అర్థమైంది.

కాలేజీ కాంపస్‌లో యాంటీ రాగింగ్ స్క్వాడ్ అని ఉంది. రాగింగ్‌ని నిషేధిం చారు. కఠిన చర్యలు తీసుకుంటామని సీని యర్లని హెచ్చరించారు.

కాలేజ్‌కి స్పెషల్ బస్ ఉంది. అందులో ఎక్కితే రాగింగ్ ఉండదు. ఇద్దరు స్టాఫ్ మెంబర్లు ఉంటారు. రాగింగ్ చేయకుండా చూస్తుంటారు. కానీ ఆ బస్సు మెయిన్ బస్‌స్టాప్‌లలో ఆగినపుడు చాలామంది దిగి పోతారు. కాలేజీ కాంపస్‌లోనూ, బస్‌లోనూ కూడా రాగింగ్‌ని తప్పించుకున్న పిల్లల్ని ఆ బస్‌స్టాండ్‌లో దిగగానే సీనియర్స్ పట్టే స్తారు. తమ ప్రతాపమంతా చూపిస్తారు.

తనుకూడా హరీష్‌లాగే చదువు మానే ద్దామా అన్నంత బాధ కలిగింది శ్యామకి. కానీ పరిస్థితి ఆలోచిస్తే అందుకు ఎంత మాత్రం కుదిరేట్లు లేదు. శ్యామకి పేమెంట్ సీట్ దొరికింది. ఏడాదికి యాభైవేల దాకా ఫీజు కట్టాలి. ఇప్పుడు మానేస్తే మిగతా మూడేళ్ళకీ కడితేగానీ ఊరుకోరేమో. దాదాపు రెండు లక్షల రూపాయల్నీ, ఒక విద్యాసంవత్సరాన్నీ వ్యర్థంగా వదులుకో వాలా? ఏంచేయాలి. ఆడపిల్ల అని నిరు త్సాహపరచకుండా తల్లిదండ్రులు ఇంతంత ఫీజులు తమ శక్తికి మించినవి అయినా కూడా కట్టి చదివిస్తుంటే, తను బాగా చదు వుకుని వాళ్ళ కలల్ని నిజం చేయడానికి బదులుగా, అర్థాంతరంగా మానేసి వాళ్ళకి అన్నివిధాలా నష్టం కలిగించాలా?

శ్యామకి ఏంచేయాలో తెలియని ఆ నిస్స హాయస్థితిలో కిరణ్ చేసిన సాయం చాలా గొప్పది. రాగింగ్ భూతం నుంచి శ్యామను బయటపడేశాడు. అమ్మాయిల్ని అమ్మా యిలు కూడా రాగింగ్ చేసేవారు. సీనియర్ అమ్మాయిల్ని కూడా కిరణ్ మందలించాడు. కిరణ్ బాగా డబ్బూ, పలుకుబడీ వున్న కుటుంబానికి చెందినవాడు. అందువల్లనో మరి ఏకారణంవల్లనోగానీ అంతా అతని మాటను గౌరవించేవాళ్ళు.

శ్యామకి కిరణ్ అంటే ఆరాధ్యభావం ఏర్పడి, అది ప్రేమగా మారింది. తన అబు

వణువులోనూ కిరణ్‌మీద ప్రేమ నిండిపోయినట్లు అనిపించేది. కిరణ్‌కోసం శ్రద్ధగా తయారయ్యి వచ్చేది. అంతకుముందు బ్యూటీపార్లర్ మొహం చూడని శ్యామ జుట్టుని అందంగా కట్ చేయించుకుని, ఐబ్రోస్ షేప్ చేయించుకుని మంచి మంచి డ్రెస్‌లు వేసుకుని ఆకర్షణీయంగా తయారయింది. అతన్ని ఆకట్టుకోవాలని ప్రయత్నించటం మొదలుపెట్టింది.

కిరణ్ మాత్రం శ్యామతో కేవలం ఫ్రెండ్లీగా ఉండటం తప్ప, ఏవిధంగానూ ముందుకి రాలేదు. శ్యామ తన ప్రేమని పరోక్షంగా బయటపెట్టినా అతను గమనించలేదు.

శ్యామకి ఇక ఊరుకోబుద్ధి కాలేదు. ఆమెకి లోకంలో కిరణ్‌తప్ప మరేం కనిపించటంలేదు. అనుక్షణం, ప్రతీకణం 'కిరణ్ కిరణ్' అని కలవరిస్తోంది.

తన ప్రేమ అంతా ప్రకటిస్తూ ఒక ప్రేమ లేఖ రాసింది. డైరెక్ట్‌గా కిరణ్ చేతికిచ్చింది.

కిరణ్ దాన్ని చదివాడు. అతని రియాక్షన్ ఏమిటా అని ఊపిరి బిగబట్టి చూస్తోంది శ్యామ. కిరణ్ దాన్ని చదివి, మౌనంగా మడిచి శ్యామకి తిరిగి ఇచ్చాడు.

శ్యామ బిత్తరపోయింది.

"సారీ శ్యామా... నేను మరొకరిని ప్రేమిస్తున్నాను" అన్నాడు కిరణ్.

శ్యామ నెత్తిన పిడుగుపడ్డట్టయింది. అక్కడే నిలువునా కూలిపోయింది.

కిరణ్ ఆమెని లేపి కూర్చోబెట్టాడు. కూల్ డ్రింక్ తెచ్చి ఇచ్చాడు.

"సారీ శ్యామా" అన్నాడు.

శ్యామ వెక్కివెక్కి ఏడుస్తోంది. అతను ఆమెని ఓదార్చాడు. ధైర్యం చెప్పాడు. జీవితాంతం స్నేహంగా ఉంటానని మాట ఇచ్చాడు. కానీ ఆమెని ప్రేమిస్తున్నానని మాత్రం అనలేదు.

శ్యామకి లోకం శూన్యంగా అనిపించింది. ఇంటికి ఎలా వచ్చిందో ఆమెకే తెలీదు.

కిరణ్ నవ్వు, కిరణ్‌స్నేహం, కిరణ్ మొహం...ఏదీ ఆమె క్షణం కూడా మరిచిపోలేకపోయింది.

మెదడు చీలిపోతున్నట్లు, రక్తనాళాలు తెగిపోతున్నట్లు, శరీరంలో మాంసం మొత్తం కత్తుల్లా మారి చర్మాన్ని చీల్చేస్తున్నట్లు బాధ. గుండె ముక్కలైపోయిన భావన.

అతను లేకుండా తను బతకగలదా? అసంభవం. కానీ అతను తనని ప్రేమించటంలేదే. ఎలాగ?

మనస్సూ, శరీరమూ, మెదడూ కూడా కలిసి చేసిన తిరుగుబాటుని శ్యామ తట్టుకోలేకపోయింది. ఎంత ఏడ్చినా బాధ తీరలేదు. అది తీరే బాధ కాదని శ్యామకి అర్థమైపోయింది.

కిరణ్ లేకుండా తను బతకలేదు.

కిరణ్ తనని ప్రేమించటంలేదు.

మరి ఏం చేయాలి?

ఒకటే మార్గం.

అతను లేకుండా బతకలేదుకాబట్టి చచ్చిపోవాలి. అవును. చచ్చిపోవాలి. ఈ టెన్షన్‌నీ, దిగులునీ, దుఃఖాన్నీ భరించేశక్తి తనకిలేదు. ప్రేమ భగ్నమైతే ఇంత విషాదం ఉంటుందని తెలిస్తే ఎవరూ ప్రేమించరేమో? ఈ బాధ తను భరించలేదు. చచ్చిపోవాలి. కానీ ఎలా? తను చచ్చిపోతే తన తల్లీ, తండ్రీ ఏమవుతారు?

విద్యార్థుల జీవితాల్లో ఆత్మహత్యలు కొత్తవేం కావు. మార్కులు బాగా రాలేదనో, ప్రేమలో విఫలం అయామనో, ఏదో ఒక కారణంతో చచ్చిపోయినవాళ్ళు శ్యామకి కూడా తెలుసు. ఆత్మహత్య చేసుకున్న ఇద్దరిని శ్యామ వెళ్ళి చూసింది కూడా. ఆ విషాదకరమైన, ఘోరమైన సీన్లు శ్యామకి ఇంకా కళ్ళముందు తిరుగుతూనే వున్నాయి. వాసంతి అనే అమ్మాయి చచ్చిపోతే వాళ్ళమ్మ ఏడ్చిన ఏడుపు శ్యామ చెవుల్లో గింగుర్లు తిరిగింది. ఆవిడ ఏడ్చి ఏడ్చి చివ

# ఏరినముత్యాలు

- ప్రేమకు మార్పు తెలియదు. మారేది ప్రేమకాదు.

  – స్వామి సుందరచైతన్యానంద

- జీవితంలో ఏదీ నిశ్చితం కాదు. జీవితానికి నిశ్చితం మృత్యువు మాత్రమే.

  – డా॥దాశరథి రంగాచార్య

- ప్రేమ బాధలను సహిస్తుందేకాని, ప్రతీకారాన్ని తలపెట్టదు.

  – గాంధీజీ

- ఏదైతే నిషిద్ధమో దానిపైన ఆసక్తి అధికంగా వుండటం మానవ నైజం.

  – కె.రామచంద్రమూర్తి

- ఏం చేయాలో చెప్పేది విజ్ఞానం. ఎలా చేయాలో తెలిపేది బుద్ధికుశలత. అలా చేయగల్గడం ప్రజ్ఞ.

  – గార్టన్

- మూర్ఖుల ప్రశంసకన్నా బుద్ధిమంతుల తిట్లు నయం.

  – షేక్స్పియర్

- జీవితమనే విందు తర్వాత, మృత్యువనే పానీయం ప్రతివారూ సేవించాలి.

  – గాలిబ్

- అసత్యం, హింసలవల్ల శాశ్వతమైన మంచి జరుగదు అని నా అనుభవం ద్వారా బోధపడింది.

  – గాంధీజీ

- సాహిత్యం జాతి సంస్కృతిని ప్రతిబింబించాలి.

  – విశ్వనాథ సత్యనారాయణ

- ప్రశాంతంగా జీవించడమే దీర్ఘాయుస్సుకు రాచబాట.

  – సిసిరో

- ఎక్కువగా మాట్లాడే వారు గొప్పవారుకాదు, గొప్ప పనిచేయలేరు.

  – ఒకసామెత

- ఆత్మ విశ్వాసం వున్నవాడు తప్పక విజయం పొందుతాడు.

  – చైనా సామెత

- శీలసంపద వుండి, జ్ఞానం లోపించినవాడు కడు బలహీనుడు. గుణవంతుడు కాని జ్ఞాని ప్రమాదభరితుడు.

  – స్వామి రామదాసు

సేకరణ: **డి.శ్రీధరాచార్య**

రకు పిచ్చిదైపోయింది. ఆ అమ్మాయి తండ్రి పోయిన కూతురికోసం ఏడుస్తూ, పిచ్చిదైపోయిన భార్య గురించి బాధపడుతూ చావ లేక బతుకుతున్నాడు.

"అంతే ఈకాలం పిల్లలు. తమ సంగతి తమకేగానీ కన్నవాళ్ళు ఎన్ని ఆశలతో పెంచుతున్నారు. తమకేమన్నా అయితే వాళ్ళ సంగతేంటి? వాళ్ళు ఏమైపోతారు అని మాత్రం ఆలోచించరు" అంటారు వాళ్ళ సంగతి తెలిసినవాళ్ళు.

లోతుకుపోయిన బుగ్గలూ, గుంటలుపడి నల్లటి వలయాలతో వున్న కళ్ళూ, దీనంగా ఉన్న మొహం, ఎవరన్నా కనబడితే 'మా వాసంతికి ఫస్ట్ క్లాస్ వచ్చింది తెలుసా. ఈ వేసవిలో దానిపెళ్ళి చేస్తాం' అని పిచ్చిగా చెప్పే వాసంతి తల్లి గుర్తుకువచ్చి శ్యామ వణికిపోయింది.

కిరణ్‌మీద ప్రేమ బతకనివ్వటంలేదు. నిలువునా కాల్చేస్తూ 'శ్యామా చచ్చిపో' అంటోంది. తల్లిదండ్రుల మీద ప్రేమ శ్యామని చావనివ్వటంలేదు. 'వాళ్ళకోసం ఎంత కష్టమైనా కానీ నువ్వు బతకాల్సిందే' అంటోంది.

మనసులోని ప్రేమ శ్యామని నిలవనివ్వ టంలేదు. మెదడులోని వివేకం ఆమెని ఏ అఘాయిత్యమూ చేయనివ్వటంలేదు. మన సుకీ మెదడుకీ మధ్య జరుగుతున్న సంఘ ర్షణని శ్యామ భరించలేకపోయింది. దాంతో పిచ్చిపిచ్చిగా ప్రవర్తించటం మొదలయింది. బాలన్స్ తప్పింది. కంట్రోల్ చేసుకోలేకపో యింది. ఫలితం పిచ్చిచూపులు చూడటం, ఏమాత్రం కుదురు లేకపోవటం.

ఎక్కడికన్నా వెళ్ళాలని బయల్దేరటం, అంతలోనే మానుకోవటం, ఇంట్లో ఉంటే బయటకు వెళ్ళాలనీ, బయటికొస్తే ఇంటికెళ్ళి పోవాలనీ, ఎటోచూస్తూ ఆలోచిస్తూ ఉండి పోవటం, పిలిస్తే పలకకపోవటం, ఒకటే మిటి ఇన్నిచూశాక 'శ్యామకి మెంటల్ బాలన్స్ తప్పిందని' కొందరు మర్యాదగా అనుకుంటే, కొంతమంది శ్యామకి ఏకంగా 'పిచ్చే ఎక్కిందని' ప్రచారం చేసేశారు.

శ్యామ తల్లిదండ్రులకి కలవరం మొదల యింది. బుద్ధిగా చదువుకునే శ్యామ అసలు పుస్తకాల జోలికే పోకపోవడం, ఏమాత్రం సెల్ఫ్ కంట్రోల్ లేకుండా ప్రవర్తించటం చూసి వాళ్ళ గుండె బేజారెత్తింది.

"ఏ గాలో సోకి వుంటుంది"

'దెయ్యం పట్టినట్లుంది. ఈ కాలేజీలు ఊరవతల ఎక్కడో పెడతారు. మీ పిల్ల కాలేజీ నాకు తెలుసు. ఊరు పొలిమేరలు దాటి పదిమైళ్ళు ప్రయాణం చేశాక ఎక్కడో చివర మలుపు తిరిగి వెళితే భూత్‌బంగ్లా లాగా ఈ కాలేజీ ఉంటుంది. దార్లో తాటి చెట్లు, చింతచెట్లు బోలెడు ఉంటాయి. ఈ కాలేజీ పిల్లలుతప్ప మరో నరసంచారం ఉండదు. క్లాసులు లేవని ఒకోసారి మధ్యా హ్నాలు అటూఇటూ తిరుగుతుంటారు. ఏ పిశాచమో పట్టి ఉంటుంది. భూతవైద్యుడికి చూపిస్తే శుభ్రంగా ఆ దెయ్యాన్ని వదిలి స్తాడు" శ్యామా వాళ్ళమ్మకి క్లోజ్ ఫ్రెండ్ అయిన సునంద సలహా ఇచ్చింది.

సునంద మోడర్న్ మనిషి. అంత వయసు వున్నా ఆవిడ జుట్టు కత్తిరించు కుని, బుగ్గలకీ, పెదవులకీ, మొహానికీ, కను బొమలకీ, అన్నిటికీ తలా ఒకరంగూ పూసి తిరుగుతుంటుంది. కారుని స్పీడ్‌గా నడప టంలో ఆవిడ పెట్టింది పేరు. ఆవిడ భావాలు మాత్రం తాతలనాటివి. ఆవిడతో పడలేకో మరి ఏ ఇతర కారణాలవల్లనో లేక బుద్ధివంకర తిరిగోకానీ, ఆవిడ భర్త ఒక సారి తన ఆఫీసులోనే ఉద్యోగం చేస్తున్న మరో ఆవిడ ప్రేమలో పడ్డాడు. ఇద్దరూ షికార్లూ, సినిమాలూ తిరిగారు. హాయిగా నవ్వుతూ, తుళ్ళుతూ గడిపేశారు. పాపం ఎవరిప్రేమ వాళ్ళది కాబోలు. ఆయన ఇన్నాళ్ళకి తన జీవితంలో వసంతం తిరిగి వచ్చిందని కొంతమందితో చెప్పుకుని ఆనం దించాడు.

ఇంతలో సునందకి ఈ విషయం తెలిసి పోయింది. వెంటనే కార్లో ఒక చీపురుకట్ట పెట్టుకుని, ఆయన ఆఫీసుకి వెళ్ళి, నేరుగా ఆ అవతల పార్టీని చీపురుపెట్టి ఆఫీసులోనే బాదేసింది. సునంద భర్త సహజంగానే చాలా బాధపడ్డాడు. ఆమె ప్రవర్తన ఆయనకి మరికాస్త అసహ్యం కలిగించింది. తన స్నేహితురాలిమీద ఇంకాస్త ప్రేమ పెరిగింది. చివరికి డైవోర్స్ తీసుకుని ఆమెని పెళ్ళిచేసుకోవాలన్న నిర్ణయానికి వచ్చేశాడు.

సునందకి ఏంచేయాలో అర్థంకాక చివరికి ఒక భూతవైద్యుడిని ఆశ్రయించింది. అతను సునంద భర్తకి అవతల స్త్రీ మందు పెట్టి వశపరుచుకుందని అంజనం వేసుకుని చెప్పాడు. తను ఇచ్చిన మందు అతనికి తినిపిస్తే అంతకుముందు ఆ స్త్రీ పెట్టిన మందుకి విరుగుడుగా పనిచేసి, దాని పవర్పోయి భార్యమీద ప్రేమ పుట్టుకొస్తుందన్నాడు.

సునంద అతను ఇచ్చిన మందు తీసుకుని, వెయ్యిరూపాయలు సమర్పించుకుని వచ్చింది. భర్తకి తెలియకుండా, ఆయన భోజనంలో ఆ మందు రహస్యంగా కలిపింది. ఆయన తినేశాడు. రెండురోజులు కాగానే దాని ఫలితం కనిపించింది.

అది తినగానే అవతలి స్త్రీ మీద ప్రేమ విరిగిపోతుందని భూతవైద్యుడు చెప్పాడు. ప్రేమ విరగడం, మనసు విరగడంలాటివి జరగలేదుగానీ ఆయన రక్తం మాత్రం విరిగిపోయింది. ఆ మందు భూతవైద్యుడు ఏంవేసి తయారుచేశాడోగానీ అది తిన్న రెండురోజుల్లో ఆయన ఆరోగ్యం మొత్తం పాడైపోయింది. ఆయనకి జ్వరం వచ్చింది. ఆకలి చచ్చిపోయింది. ఏది తిన్నా అరిగించుకోలేకపోయాడు. చివరికి హాస్పటల్లో చేర్పించారు. డాక్టర్లు ఆయన జబ్బేమిటో కనిపెట్టలేక తికమకపడ్డారు.

"ఏదో రియాక్షన్లాగుంది. ఇంతకుముందు ఏమన్నా మందులు వాడారా?" అని అడిగారు.

ఆయన ప్రాణంమీదికి వచ్చినా సునంద మాత్రం తన మందు ప్రయోగం గురించి వాళ్ళకు చెప్పలేదు. కానీ సునంద భూతవైద్యుడి దగ్గరకు వెళ్లి మందు తేవటం తెలిసినవాళ్ళు, కొంతమందికి ఆ విషయం చెప్పారు. చివరికి చాలామందికి ఆ సంగతి తెలిసిపోయింది. వాళ్ళు డాక్టర్లకి ఆ విషయం చెప్పటం, డాక్టర్లు తమకు తోచిన విరుగుడు డోస్ ఇచ్చి ఆయన ప్రాణాల్ని కాపాడటం జరిగాయి. ఆయనని తిరిగి తన వైపు తిప్పుకోవటానికి సునంద మందు పెట్టిందనీ, అది వికటించిందనీ తెలిశాక ఆయన స్నేహితురాలికి మనసు విరిగిపోయి ఆయనతో మాట్లాడటం మానేసింది.

"ఆయన ఆరోగ్యంగా ఆనందంగా వుంటే చాలు. పిల్లలూ, భార్యా వీళ్లను వదిలి నన్ను పెళ్ళిచేసుకోవాలని నేను ఎన్నడూ అనుకోలేదు. ఆవిడ అనవసరంగా లేనిపోనివి చేసి ఆయన ఆరోగ్యం చెడగొట్టింది" అని ఆత్మీయుల దగ్గర బాధపడిందిట.

సునందకి అంత జరిగినా ఏమాత్రం చలనం కలగలేదు.

"ఏదో పొరపాటు జరిగి ఉంటుంది. లేకపోతే విరుగుడు మందు అంత వికటించదు. ఈయనకి అది అంతకుముందు పెట్టిన మందులో ఏదో ఉండి ఉంటుంది. అది నెమ్మదిగా ఫలితం చూపించి ఉంటుంది" అంది తాపీగా.

తన అభిప్రాయాలు మార్చుకోకపోగా వాటికి ఇంకాస్త విశేషప్రచారం కలిగిస్తూ తిరిగేస్తుంటుంది.

"మన జానకీబాయి కూతురికి ఇలాగే అవుతే భూతవైద్యం చేయించాము. వేప మండలు తీసుకుని వారంరోజులపాటు తెగ బాదాడు. ఇక ఆ దెయ్యం నిలవలేక పారిపోయింది" అంది సునంద.

"ఆ అమ్మాయికి ఫిట్స్ రోగం ఉంది.

అది ఇంకా తగ్గలేదు. ఆవిడ మూఢనమ్మకా లతో ఆ అమ్మాయికి భూతవైద్యం చేయించి ఆరోగ్యం ఇంకాస్త చెడగొట్టింది" అంది శ్యామ తల్లి.

"మీరంతా ఇంతే. ఏదీ నమ్మరు. చివరికి అనుభవిస్తారు. అయినా ఒక రాయి విసిరి చూడటానికేం" అంది సునంద కోపంగా.

"వేపమండలతో దాన్ని చావగొడుతుంటే నేను చూసి సహించలేను" నిష్కర్షగా చెప్పింది శ్యామ తల్లి.

"మీ పిల్లకు కాదు ఆ దెబ్బలన్నీ తగిలేది. దెయ్యానికి" అంది సునంద.

"నేనివన్నీ నమ్మను" అంది శ్యామ తల్లి. శ్యామ అంతా వింటూనే ఉంది. తల్లికి తన మీద ఉన్న ఆప్యాయతకు శ్యామ గుండె కదిలిపోయింది.

"మరి ఏంచేద్దామనీ. దాన్ని చూస్తే చదువుకొనసాగించేలా లేదు. ఇలా ఉంటే పెళ్ళి కూడా కాదు. ఏం చేస్తావు మరి? " అడిగింది సునంద.

"ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి మంచి వైద్యం చేయిస్తాను. పిల్ల డిప్రెషన్‌లో ఉంది. ఎవరన్నా సైకియాట్రిస్ట్‌కి చూపిస్తాను. చదువుకోకపోతే పోనీ. డబ్బు దండగవుతే అవనీ. పిల్లకన్నా నాకు ఏదీ ముఖ్యం కాదు" అంది శ్యామ తల్లి.

శ్యామకు ఆ మాటలు వింటుంటే తన మీద తనకే అసహ్యం వేసింది. ఎంత డబ్బిచ్చినా దొరకనిది కన్నతల్లి ప్రేమ. తల్లి ప్రేమానురాగాలు, ఆప్యాయతలూ మనిషికి దొరికే అమూల్యవరం. కన్ను ఉన్నంత కాలం కన్ను విలువ తెలియదుట. చూపులేకపోతేనే ఆ విలువ తెలుస్తుందంటారు. అలాగే తల్లి విలువ తెలియని మూర్ఖులు కూడా ఉంటారు. తనని ఇంత ప్రేమిస్తూ, తనకోసం ఏమైనా చేసేందుకు సిద్ధంగా ఉన్న తల్లితండ్రులపట్ల తన బాధ్యత నెరవేర్చాలి. వాళ్లను ఆనందపరచాలి. తను ఇలా ఉంటే వాళ్లు కృంగిపోతారు. వాళ్లకోసం తను మామూలు మనిషి కావాలి. తప్పదు.

శ్యామ దృఢంగా నిర్ణయించేసుకుంది. కానీ దాన్ని అమలుపరచటం మాత్రం నిర్ణయం తీసుకున్నంత తేలికకాదు.

ముందు చదువులో మనసు లగ్నంచేయాలి. మనసు చదువుమీదికి మళ్లించటం ఎలాగ? మనసునిండా కిరణ్ నిండిపోయి ఉన్నాడు. ఎప్పుడూ అతనే కళ్ళముందు మెదుల్తూ ఉంటాడు. మనసూ, శరీరం రెండూ అతని సాన్నిహిత్యాన్ని కోరుకుంటూ ఉన్నాయి. ఒక్కక్షణమైనా అతడ్ని మర్చిపోవటం అసంభవం. అతడ్ని మర్చిపోకుండా తను మామూలు మనిషి కావటం అంత కన్నా అసంభవం.

ఏంచేయాలి?

శ్రేయోభిలాషుల్నీ, ఆత్మీయుల్నీ సలహా అడిగింది. ఏకాగ్రత సాధించటానికి ఏంచేయాలని అంటే తలా ఒక సలహా చెప్పారు.

యోగా ప్రాక్టీస్ చెయ్యమని కొందరూ, ధ్యానం చేస్తే బాగుంటుందని కొందరూ, రేకీ చేయమని కొందరూ, పర్సనాలిటీ డెవలప్‌మెంట్ కోర్సులో చేరమని మరి కొందరూ, ఆధ్యాత్మిక గ్రంధాలు చదవమని ఇంకొందరూ, హిప్నటిజమ్‌కి వెళ్ళమని మరొకరూ ఇలా ఎన్నో సలహాలు దొరికాయి.

కొన్ని పాటించింది. ఫలితం కనిపించలేదు.

చివరికి ఒక విషయం తెలుసుకుంది శ్యామ. మనసుని కంట్రోల్‌లో పెట్టుకోవటం మనిషి చేతిలో పని. కానీ దానికి కావాల్సిందల్లా దృఢ సంకల్పం. అంతే.

'నేను కిరణ్‌ని మర్చిపోతాను. మర్చిపోవాలి' అని గట్టి నిర్ణయం తీసుకుంది. పాఠాలు మళ్ళీ చదవటం మొదలుపెట్టింది. మొదట్లో కుదరలేదు. ఏదీ బోధపడేది కాదు. అంతా శూన్యంగా అనిపించేది. అట్లాంటప్పుడు బట్టీ పెడుతుండేది.

"విల్‌పవర్ ఉంటే సాధించలేనిది లేదు"

అని అంతా చెప్పిన మాటను గట్టిగా నమ్మి ఆచరణలో పెట్టింది.

కిరణ్ గురించి తలపులు క్రమంగా తగ్గి పోయాయి. ప్రేమ ఉధృతం తగ్గుముఖం పట్టింది. చదువులో మనసు లగ్నం చేయ గలిగింది. సంగీతంలో చేరింది. స్కూటర్ డ్రైవ్ చేయటం నేర్చుకుంది.

మెల్లగా మనుషుల్లోపడి ఇంతకు ముందు శ్యామకన్నా ఎంతో బెటర్‌గా కూడా తయా రయింది.

"అదీ నా కథ. సరే నీ బాధ ఏంటో చెప్పు" అంది శ్యామ.

పావని శ్యామవైపు చూసింది.



ఆత్మవిశ్వాసంతో మెరుస్తున్న శ్యామ కళ్లు ఆమె మొహానికి కొత్త అందాన్ని ఇస్తున్నాయి. మొహంలో తృప్తీ, ఆనందం.

తను ఎప్పటికైనా అలా ఉండగలుగు తుందా? పావనికి గుండె కలుక్కుమంది.

శ్యామది దీర్ఘమైన ప్రేమ కాదు. కేవలం కొన్ని నెలలు, మహాఅయితే ఒక సంవ త్సరం అయి ఉంటుంది. తను అలా కాదు. ఎప్పటినుంచో హర్షని ప్రేమిస్తూనే ఉంది.

మరి తను అతన్ని తేలిగ్గా మర్చిపోగలదా? మర్చిపోవటం అసాధ్యం. కానీ కనీసం ఈ బాధ మనసుని మెలితిప్పి, గుండెని సన్నటి రంపంతో కోస్తున్నట్లున్న ఈ బాధ తగ్గితే చాలు. అది సాధ్యమా? హర్ష గుర్తు ఉన్నంతకాలం ఈ బాధ కూడా ఉంటుంది. హర్షని మర్చిపోవాలా? నిజమే. విల్‌పవర్ ఉంటే ఏదైనా సాధించవచ్చు. కానీ హర్షని మర్చిపోయేందుకు తన మనసు అంగీకరిం చదు. తన మనసు తనకి సహకరించక పోతే ఇక ఏ ప్రయత్నాలు చేసి ఏం ప్రయో జనం? హర్షని హృదయపూర్వ కంగా, గాఢంగా ప్రేమిస్తున్న తను అతన్ని మర్చిపోవాలని నిజాయి తీగా ప్రయత్నించటం లేదా? పావని తననితాను ప్రశ్నించుకుంది. అవునని సమాధానం వచ్చింది. ఈ ప్రేమలో ఏ మాయ ఉందో ఏమిటో గొప్ప గొప్ప వాళ్లకే అంతుపట్టలేదు. ఇక తను ఏపాటి?

★ ★ ★

"అసలు నీ బాధ ఏంటి చెప్పు? " అంది శ్యామ. పావని తన సంగతంతా చెప్పింది.

"ముందు నువ్వు హర్షని మర్చిపోవటా నికి ప్రయత్నించు" అంది శ్యామ.

"అది సాధ్యపడే విషయం కాదు" అంది పావని.

"అసాధ్యం అన్నదేదీ లేదు. ప్రయత్నిస్తే అన్నీ సాధ్యమే. నీకు నువ్వు గట్టిగా నిర్ణయించుకోవాలి. ఇక అతని గురించి ఆలోచించను అని గట్టిగా అనుకో. ఒక్కో జ్ఞాపకాన్నీ తుడిచెయ్యి. వేరే పనుల్లో నిమగ్నం అవు. రోజూ ఒక గంట సేపు కళ్లు మూసుకుని కూర్చుని నేను హర్షని మర్చిపోయాను అని నీకు నువ్వే చెప్పుకుని, వేరే విషయాల గురించి ఆలో చిస్తూ ఉండు. పుస్తకాలు చదువు, ఆటలు ఆడుకో, పూజ చేసుకో. ఏం చేస్తావో తెలీదు. చేసే పనిమీద ధ్యాస ఉండేట్లు చూసుకో" అంది శ్యామ.

"ఏదీ చేయలేకపోతున్నాను"

"కొన్నాళ్లు పనిమనిషిని మాన్పించి ఇంట్లో పనులన్నీ నువ్వే చెయ్యి పోనీ. వంటలో మీ అమ్మకి సాయం చెయ్యి. క్షణం తీరికలేకుండా గడుపు. పూర్తిగా మర్చిపోవటం సాధ్యంకాకపోయినా, కనీసం ఈ ఆవేశం చల్లారవచ్చు" అంది శ్యామ.

"ట్రై చేస్తాను" అంది పావని.

"ఒక్కరోజులో సాధ్యంకాకపోయినా, క్రమేణా మనసు గట్టి పడుతుంది" అంది శ్యామ.

"అసలు ఏనాటికైనా హర్షని మర్చిపోగలను అన్న ధైర్యం ఉంటే చాలు" అంది పావని.

★ ★ ★

పావని హర్షని మర్చిపోవటానికి తీవ్రంగా ప్రయత్నించింది.

మహాక్లిష్టమైన, అతికష్టమైన, అత్యంత సున్నితమైన పరిస్థితి అది. దాన్ని అనుభవించే వాళ్ళకే తెలుస్తుంది అదెంత దారుణమైన పరిస్థితో. మామూలుగా అయితే "ఆ...తిని కూర్చుని ప్రేమా, దోమా అని వెధవ్వేషాలు. అన్నీ శుభ్రంగా అమరిపోతుంటే ఒళ్ళు పొగరెక్కి, మాయరోగాలు" అని అంతా విమర్శించేస్తారు. కానీ మనసు అనేది ఒక మహా మాయావి. మనిషిని కోతిని చేసి ఆడిస్తుంది. మనసు మనిషికి తీరని శతృవు. దారుణంగా బాధించే అంతర్గత శతృవు. ఆ మనసుని కంట్రోల్‌లో పెట్టలేకపోతే మనిషి జీవితంలో దారుణంగా ఓడిపోతాడు. జీవితం శృతితప్పిపోతుంది.

పావని హర్షమీద ప్రేమనీ, గుండెని పగలగొట్టేస్తున్న ఆవేదననీ అణుచుకోవటానికి శతవిధాలా ప్రయత్నించింది. చాలాసేపు ఒంటరిగా ఉండిపోయి, కళ్ళుమూసుకుని హర్షని మర్చిపోవాలి, మర్చిపోతాను, మర్చిపోయాను అని తనకుతాను చెప్పుకుంటూ గడిపేసేది. మంచి పుస్తకాలు చదివింది. మానసిక శాస్త్ర గ్రంథాలు చదివింది. ఏదన్నా పనిలో మునిగిపోయి మనసు మరల్చుకోవాలని హాబీ ఏదన్నా అలవర్చుకోవాలనుకుంది.

పావనికి తనలో వచ్చిన మార్పు తనకే ఆశ్చర్యం కలిగిస్తోంది.

ఇదివరకులా ఏ పనీ చేయకుండా ప్రతి క్షణం హర్ష గురించి ఆలోచిస్తూ ఉండిపోవటంలేదు. ఇప్పుడు హర్షంటే ప్రేమలేదని కాదు. గాఢమైన ప్రేమ. ఏమాత్రం చెక్కుచెదరకుండా అలాగే నిలిచి ఉంది. కానీ ఆ ప్రేమ మునుపటి ప్రేమలా పరవళ్లు తొక్కే ప్రవాహంకాదు. కొండలమీదనుంచి విరుచుకుపడే జలపాతమూ కాదు. ఇది నిశ్చలమైన ప్రేమ. స్వచ్ఛమైన తటాకంలాంటి ప్రేమ. ఆ ఉడుకూ, ఉధృతం తగ్గాయి.

తను ఏదో ఒకటి చేయాలి అని ఆలోచించుకున్నాక, ఏం చేయాలన్న ప్రశ్న ముందు వచ్చి నిలిచింది.

డాన్స్ నేర్చుకోవాలా? పాటలూ, సంగీతమా? కంప్యూటర్ కోర్సుల్లో చేరాలా? ఏవన్నా డిప్లొమాలు సాధించాలా? ఫాషన్ డిజైనింగ్ ఇంటీరియర్ డెకరేషన్‌లాటివి చేయాలా? ఏంచేయాలని ఆలోచిస్తోంది.

"నీకు ఆసక్తి ఉన్న రంగం ఏమిటి? అది తెలుసు కోవాలి నువ్వు? నీకే రంగం ఇష్టమో తెలుసుకుని అందులో ప్రవేశించు" అంది శ్యామ.

"ఇన్నాళ్లూ హర్ష గురించి తప్ప మరేం ఆలోచించలేదు నేను. ఇక ఆసక్తి దేనిమీదా లేదు. అవునూ ఆసక్తి ఉంటేగానీ అందులో విజయం సాధించటం కుదరదా? " పావని అమాయకంగా అడిగేసింది.

శ్యామ నవ్వింది.

"మనిషికి తప్పనిసరిగా ఆసక్తి ఏదో ఒక దానిమీద ప్రత్యేకంగా ఉంటుంది. అది నీలో అంతర్గతంగా ఉంటే నీకు కూడా తెలీదు. సమయం వచ్చినపుడు అది బయటపడుతుంది. వేటగాడు పక్షుల జంటని

కూల్చడం చూసి అప్రయత్నంగా వాల్మీకి నోట శ్లోకం వెలువడి రామాయణ మహాకావ్యానికి దారితీసిందిట. మా చిన్నాన్న కూతురికి తను పొయెట్రీ రాయగలనన్న సంగతే తెలీదు. దానికి ఏడిపించుకుని తినే మొగుడు దొరికేసరికి ఆ బాధలు భరించలేక, ఎవరితోనూ చెప్పుకోలేక చివరికి కాగితంపై కవిత్వరూపంలో పెట్టింది. అట్లాగే నీకు కూడా నీలో ఉన్న టాలెంట్ బయటకి వస్తుంది"

"బాబోయ్. ఇప్పుడు నన్ను కూడా చితకబాదే వాళ్ళెవరన్నా దొరికితేగానీ ఆ టాలెంట్ తనంతతాను బయటపడదా? " పావని నవ్వేసింది.

"ఛ... నా ఉద్దేశం అది కాదు. ప్రతీమనిషికీ ఎన్నో ప్రత్యేకతలు ఉంటాయి. అవి నువ్వు గుర్తించలేకపోయినా సమయంవస్తే తమంతతామే బయటపడతాయని చెప్పటానికి ఆ ఉదాహరణ. అంతే" శ్యామ చెప్పింది.

పావని ఇంకా దిగులుగానే చూస్తోంది.

పిచ్చిమొహమా. ఊరికే అన్నాను ఆసక్తి ఉన్నరంగం అని. ఆసక్తి ఉన్నంత మాత్రాన అందులో ఏదో శిఖరాలు అధిరోహించేస్తారని లేదు. నైపుణ్యం కూడా ఉండాలి. దానికి పట్టుదల తోడవ్వాలి. మా పద్మజ లేదూ. దానికి నృత్యం అంటే ఎంతో ఆసక్తి ఉంది. కానీ ఏంలాభం. ఎంత ప్రయత్నించినా దానికి అందులో మెలకువలు తెలియలేదు. అడుగులు వేయటం, భంగిమలు చూపటం చేతకాలేదు. ప్రాక్టీసు చేసి కూడా ప్రయోజనం లేకపోయింది. చివరికి తను నృత్యం చేయలేనని తెలుసుకుంది. భరతనాట్యం, కథక్, కూచిపూడి అన్నీ ప్రయత్నించి, మానేసి చివరికి కంప్యూటర్ కోర్స్‌లో చేరింది. అది అందులో చాలా నైపుణ్యం సంపాదించింది. దాన్ని చూసి ముచ్చటపడి వాళ్ళు అడ్వాన్స్ కోర్స్‌లన్నీ చాలా తక్కువ ఫీజుకి నేర్పించారు. అందరూ అన్నీ చేయలేరు. మనకి ఆసక్తి ఉండటమే కాకుండా మనం దాన్ని చేయగలమా లేదా అని కూడా తెలుసుకోవాలి. చేయలేక పోయినంత మాత్రాన నిరాశ చెందాల్సిన అవసరం లేదు. ఇదికాకపోతే ఇంకోటి ఏదిచేయగలం అని ఆలోచించి దానిలో ప్రవేశించాలి. అంతే. ఛాలెంజ్‌గా తీసుకుని చేయాల్సిందే. కాదనను. కానీ ఎంత ఛాలెంజ్‌గా తీసుకున్నా కొన్నిసార్లు ఏవీ రావు. అట్లాంటప్పుడు గుడ్డిగా వాటినే పట్టుకుని వేళ్ళాడేకన్నా ఇంకోటి చూసుకోవటం మంచిది. మన గోల్స్ ఎప్పుడూ రెండు మూడు పెట్టుకోవాలి. ఇది సాధించలేకపోతే అది. అంతే" శ్యామ చెపుతుంటే పావని కళ్ళు పెద్దవిచేసి వింటోంది.

"మా సంగీతం క్లాస్‌కి రా" అంది శ్యామ.

పావని తల ఊపింది.

"మా టీచర్‌కి నేనంటే చాలా ఇష్టం. చక్కగా రాగం తీస్తానని ఎంతో మెచ్చుకుంటుంది నన్ను. మనం ఇలాగే వెళ్ళి ఆవిడ్ని కలుద్దాం. నువ్వు ఇంట్లో చెప్పివస్తావా? " అంది శ్యామ.

"ఫోన్‌చేసి చెపుతాలే. అయినా నేనేం చేస్తానన్నా మాఇంట్లో కాదనరు" అంది పావని.

పావని వాళ్ళు ఉండేది ఫ్లాట్స్‌లో. పక్క ఫ్లాట్‌లో ఆవిడ విరజాజి పూలు, కనకాంబరాలూ ఒక ప్లేట్‌లో తీసుకొచ్చింది.

"పెట్టుకోమ్మా. ఈకాలం పిల్లలకి జడలే ఉండటంలేదు. మా అమ్మాయి కూడా నీ అంతదే. జుట్టు శుభ్రంగా కట్ చేయించేసింది. అది జడ వేసుకుని పూలు పెట్టుకుని, పట్టులంగా ఓణీ వేసుకుంటే చూడాలని నాకెంతో కోరిక. అది లంగా ఓణీలు కుట్టించనివ్వనే లేదు. ఎప్పుడూ ప్యాంట్, షర్టు వేసుకుని తిరుగుతుంది. నీలా ఉన్నవాళ్ళని చూస్తే నాకెంతో ముద్దుగా ఉంటుంది" అంది.

"పూలు కొన్నారా? " పావని అడిగింది.

"లేదు. ఆంటీ చక్కటి గార్డెన్ బాల్కనీ లోనే మెయిన్‌టైన్ చేస్తున్నారు. పెద్దకుండీలో విరజాజి, జాజితీగెలు కూడా పెట్టారు. కనకాంబరాలు, లిల్లీలు, గులాబీలు గుత్తులుగుత్తులుగా పూస్తాయి" శ్యామ చెప్పింది.

అభిరుచి అంటే అదేకాబోలు అనుకుంది పావని. ఫ్లాట్ల సంస్కృతి పెరిగాక చెట్లు బొత్తిగా కరువై పోతున్నాయని హర్ష చెబుతూ ఉండటం గుర్తువచ్చింది. తమ ఇంటిదగ్గర ఎన్నో ఇళ్ళు చుట్టూ చెట్లతో ఎంతో బాగుండేవి. ఆ తర్వాత ఇళ్ళకి డిమాండ్ వచ్చాక కొన్నిచెట్లు కొట్టేసి ఇళ్ళు పెంచి కట్టారు. ఆ తర్వాత మిగిలిన చెట్లని కూడా కొట్టేసి, ఇళ్ళు పడగొట్టి ఫ్లాట్లు కట్టారు. వాతావరణం రోజురోజుకీ వేడెక్కిపోతోందనీ, కాలుష్య భరితమవుతోందనీ బాధపడతారు గానీ, కొన్ని చెట్లు పెంచి దాన్ని అరికడదామని ప్రయత్నించే వాళ్ళెంతమంది?

"మా అపార్ట్‌మెంట్స్‌కింద ఖాళీస్థలంలో మంచి మంచి చెట్లు నాటించారు. ఆంటీ స్వయంగా దగ్గర ఉండి వాటి పోషణ చూసుకుంటారు" శ్యామ చెప్పింది.

ఇద్దరూ మాల కట్టారు. పావని మళ్ళీ జడ అల్లుకుని, మొహం కడుక్కుని ఫ్రెష్‌గా తయారయింది. జడలో కనకాంబరాలూ, జాజులమాల పెట్టుకుంది. పూలని చూసినా, గాలి వీచినా హర్ష గుర్తుకు వస్తూనే ఉంటాడు. గుర్తు రావటానికి అసలు మర్చిపోతేగా. అయినా పూలని పెట్టుకున్నప్పుడు అతను చూస్తే ఎంత బాగుంటుందో అనిపిస్తుంది. చల్లగాలి వీస్తే అతను ఈ సమయంలో పక్కన ఉంటే ఎంత బాగుంటుందో అనిపిస్తుంది. అందమైన ఏ అనుభవమైనా అతనితో పంచుకోవాలనిపిస్తుంది.

గుండెని ఎవరో సన్నని కత్తితో కోస్తున్నట్లు వేదన. హర్ష ఇక తనకు ఎన్నటికీ దక్కడా? ఆవేదనని గుండెలోనే తొక్కిపట్టింది. ఇలా కాదు. తను మర్చిపోవాలి. అంతే. దృఢంగా అనుకుని శ్యామవైపు చూసింది.

శ్యామ తననే తదేకంగా చూస్తోంది. తన మనసుని చదివేయగలదు శ్యామ.

శ్యామ చుడీదార్ వేసుకుని వచ్చింది. ఇద్దరూ కిందికి వచ్చి శ్యామ స్కూటర్ ఎక్కారు.

"డ్రైవింగ్ నేర్చుకో పావనీ. స్కూటీలాటిది నీ సొంతానికి ఉంటే గబగబా ఎక్కడికి కావాలన్నా వెళ్లిరావచ్చు" అంది శ్యామ.

"నేర్చుకోవాలి" అంది పావని.

"హమ్మయ్య. ఇన్నాళ్ళకి నీలో కాన్ఫిడెన్స్ చూస్తున్నాను" శ్యామ నవ్వింది.

పావనికి అర్థం కాలేదు.

"ఏంటి? " అడిగింది.

"ఏంలేదు. ఇదివరకు నువ్వు బండి నేర్చుకోమని అడిగితే 'అమ్మో. నావల్ల అవుతుందా? ' అనో లేకపోతే 'బాబోయ్ నాకు బండి నడపటం మాత్రం చేతకాదు బాబూ' అనో అనేదానివి. ఇప్పుడు 'నేర్చుకుంటాను' అని సమాధానం ఇచ్చావు. అది నీలో ఆత్మ విశ్వాసం ఉందనటానికి నిదర్శనం" అంది శ్యామ.

పావని నవ్వేసింది.

స్కూటర్‌ని లాఘవంగా నడిపేస్తూ, కబుర్లు చెపుతోంది శ్యామ.

"ఏకాగ్రత కావాలంటే వెహికిల్ నడపటం కన్నా మరో మార్గం లేదనిస్తుంది నాకు. ఎందుకో తెలుసా? ఏమాత్రం తేడా వచ్చినా యాక్సిడెంట్ అయిపోతుంది. చాలా అటెంటివ్‌గా ఉంటాలి. దాంతో ఆటోమాటిక్‌గానే మనం శ్రద్ధగా నడుపుతాం" శ్యామ చెపుతూంటే వింటోంది పావని.

"అవునూ నువ్వు ఎప్పుడూ లంగా, ఓణీలే వేసుకుంటావేంటి. ఓహో హర్షకిలాగే ఉంటే ఇష్టం అని కాబోలు. అయినా నన్నడిగితే మనకేది కంఫర్టబుల్‌గా ఉందో చూసుకో

వాలి. అందులో అసభ్యత లేనంతవరకూ ఏ డ్రెస్ అయినా ఓ.కే. ఈ రోజుల్లో ఇంట్లో అందరూ నైటీలు వేసుకుంటారు. అలానే అమ్మాయిలు బయటకొచ్చినప్పుడు చుడీదార్లో, పాంటు, షర్టో వేసుకుంటున్నారు. మనకి వీలుగా ఉన్న డ్రెస్ మనం వేసేసుకోవాలి. అవునూ. ఇంతకీ హర్షకి లంగా ఓణీలు ఎందుకిష్టం? సంప్రదాయ వేషధారణ అనా? " అడిగింది శ్యామ.

"కాబోలు" అంది పావని.

"ఏం సంప్రదాయమో. ఒకప్పుడు భారతదేశమంతా ఆడవాళ్ళు అంటే మన వయసు వాళ్ళు లంగా ఓణీలే వేసుకునేవాళ్ళు. కావాలంటే పాత హిందీ సినిమాలు చూడు. హీరోయిన్లు అచ్చమైన తెలుగింటి అమ్మాయిల్లాగా పరికిణీ, ఓణీ వేసుకుని కనిపిస్తారు. ఆ తర్వాత అంతా పంజాబీ డ్రెస్సులు, మోడర్న్ దుస్తుల్లోకి మారారు. దేవాలయాల్లోనూ, ఇతరచోట్లా కనిపించే పాత శిల్పాల్ని చూడు. వాటిల్లో వస్త్రధారణ ఎలా ఉంటుందో చూడు. సంప్రదాయం అని చూసుకుంటే, వస్త్రధారణ అనేది రకరకాల మార్పులు చెందింది. అనువుగా, సులువుగా ఉండేవి చివరకు మిగులుతాయి. ఆ విధంగా ఆడవాళ్ళకి చీరె, మగవాళ్ళకి పంచె మిగిలాయి. చివరికి అవీ సాంస్కృతిక విప్లవంవల్ల మార్పులు చెందాయి. మగవాళ్ళు క్రాపులూ, ప్యాంట్లలోకి మారారు. ఆడవాళ్ళు కూడా నవీన పద్ధతుల్లోకి మారారు. ఫ్యాషన్ కొంత ఉంటుంది. ఎక్కువగా సులువూ, అనువూ వీటికే ప్రాముఖ్యత. ఏముంది ఏ చుడీదారో వేసుకుంటే హాయిగా ఎన్ని పనులైనా చేసేసుకోవచ్చు" శ్యామ చెబుతూవుంది.

ఇంతలో సంగీతం టీచర్ ఇల్లు వచ్చేసింది. స్కూటర్ పార్కుచేసి, పావనితో పాటు లోపలకు నడిచింది శ్యామ.

అది చిన్న ఇల్లు. ఇండిపెండెంట్ ఇల్లు. చుట్టూ చెట్లూ, మధ్యలో పొదరిల్లులా ఉంది ఆ ఇల్లు. లోపల్నుంచి వీణశబ్దం వినిపిస్తోంది. కొబ్బరాకుల గలగల దానికి తాళం పలుకుతున్నట్లు వినిపిస్తోంది.

లోపల సంగీతం టీచర్ చాపమీద కూర్చుని పిల్లలకు సంగీతం నేర్పిస్తోంది. ఇద్దరు చిన్నపిల్లలు తొడమీద తాళం వేస్తూ, ముద్దుగా పాడుతున్నారు.

శ్యామ మరో చాపమీద కూర్చుంది.

"మా ఫ్రెండ్ పావని సంగీతం నేర్చుకుంటానంటే తీసుకొచ్చాను" అంది.

పావని ఆవిడకి నమస్కరించింది.

"నీవు ఇదే కొత్తగా రావటమా? లేకపోతే ఇదివరకు ఎక్కడన్నా నేర్చుకున్నావా? " ఆవిడ పావనిని అడిగింది.

"ఇదే మొదలు" అంది పావని.

"సరే, ఫీజు సంగతి చెప్పావా మరి నీ ఫ్రెండ్‌కి" అంది ఆవిడ శ్యామవైపు తిరిగి.

"చెప్పలేదు. తను ఇచ్చేస్తుందిలెండి. వాళ్ళ ఇంట్లో ఎంతైనా ఏమీ అనరు" అంది శ్యామ.

"ముందు అన్నీ మాట్లాడుకోవటం మంచిది"

"పావనీ నా ఫీజు నెలకి మూడువందలు. వారానికి మూడు క్లాసులు. నువ్వు నేను నేర్పింది ఇంట్లో బాగా ప్రాక్టీస్ చెయ్యాలి. శ్రద్ధగా నేర్చుకోవాలి" అంది ఆవిడ.

"అలాగే" అంది పావని.

"ఇవాళ పంచమి. మంచిరోజు. ఇప్పుడే మొదలుపెట్టు. ఫీజు రేపు తెచ్చిఇవ్వు" అంది ఆవిడ.

పావని సరేనంది.

"ముందుగా ఈ అమ్మాయికి చెపుతాను. పిల్లలూ మీ పాఠం అయిపోయినట్లే. ఇంక వెళ్ళిపోండి" అంది ఆవిడ.

పిల్లలిద్దరూ లేచి తలుపు దగ్గర నిలబడ్డారు.

పావని ఎలా నేర్చుకుంటుందో చూద్దామని వాళ్ళకి కుతూహలంగా ఉన్నట్లుంది. వెళ్ళిపోకుండా అక్కడే నిలబడి చూస్తు

న్నారు.

ఆవిడ పావనికి తాళం ఎలా వేయాలో నేర్పింది.

"సరిగమ పదనిస ఆరోహణం" అంది.

సనిదప మగరిస అవరోహణం అంది

పావని తల ఊపింది.

"సా" అంటూ దీర్ఘం తీసింది ఆవిడ.

పావని ఆవిడని అనుసరిస్తూ పాడబోయింది. ఎన్నడూ పాట అలవాటులేని కారణం చేత కొంతా, ఆ పిల్లలూ, శ్యామా తననే గమనిస్తుండటంతో మరికొంతా జంకుగా అనిపించింది. గొంతు కాస్త కీచు పోయింది.

"అలాకాదు" ఆవిడ మళ్ళీ పాడింది.

పావనికి మళ్ళీ గొంతు కీచుపోయింది. ఆ రోజుకి పాఠం ముగిసింది. ఇదివరకు ఎవరన్నా పాడుతుంటే ఎన్నో వంకలు కనిపించేవి. ఇప్పుడు తను పాడటానికి ప్రయత్నించాక అర్థం అవుతోంది, పాడటం ఎంత కష్టమో.

"వెళ్తాను" అని ఆవిడ దగ్గరా, శ్యామ దగ్గరా సెలవు తీసుకుని బయల్దేరింది.

★ ★ ★

సంగీతం టీచర్ పేరు జానకీ కోలాహలం. ఆవిడ పేరుకు తగ్గట్లు కోలాహలంగానే ఉంటుంది. ఆవిడంటే ఇష్టంలేనివాళ్ళు ఆవిడని జానకీ హాలాహలం అంటారు. రెండు పేర్లూ ఆవిడకి సరిగ్గా సరిపోతాయనిపించింది పావనికి.

మనిషి ఎన్నిపనులు ఒకేసారి చెయ్యవచ్చో ఆవిడ్ని చూసి నేర్చుకోవచ్చు. ఆవిడ పిల్లలకి సంగీతం పాఠాలు చెపుతూ మధ్య మధ్య స్వెట్టర్లు అల్లుతుంటుంది. లోపలకు వెళ్ళి వంటచేస్తుంటుంది. ఫోన్‌లో మాట్లాడుతుంటుంది. ఇరుగుపొరుగుతో మాట్లాడుతుంటుంది. ఆవిడది చాలా భారీకాయం. అయినా చురుగ్గా అటూ ఇటూ తిరుగుతుంటుంది.

కానీ ఆవిడ బోధించే విధానమే పావనికి ఎంత మాత్రం మింగుడు పడటంలేదు. గబగబా దీర్ఘం తీసేసి పావనిని కంగారు పెట్టేస్తుంది ఆవిడ. ఏమాత్రం సహనం చూపించదు. కోపంగా చూస్తుంటుంది.

"నీకు రాగం తీయటం రావటం లేదు"

"తాళం వేయటమంటే తొడ వాయగొట్టుకోవటం కాదు. తాళం తప్పకూడదు. చెయ్యి ఎలా పడాలో అలాగే పడాలి"

"నువ్వు పాడితే పిల్లి ఏడ్చినట్లుంది"

చివరి కామెంట్‌కి పావని ఉలిక్కిపడింది. మరీ అంత ఘోరంగా ఉందా తను పాడే తీరు? జంకూ, భయం ఇంకాస్త పెరిగాయి.

"సంగీతం గొప్ప వరం. పాడగలగటం పూర్వజన్మ సుకృతం. నువ్వు ఏడిసినట్లు పాడుతున్నావు. బాగా సాధన చెయ్యి" అనేసింది ఆవిడ ఒకరోజు.

పావనికి ఏం అనాలో అర్థంకాలేదు. అందరూ ఒకేలా ఉండరు. నేర్చుకునే తీరులో ఒక్కొక్కరు ఒకోలా ఉంటారు. ఆవిడ రాగం తీయగానే వెంటనే అలాగే రాగం తీసేయాలంటే ఎలా? సహనంగా సాధన చేయించాలన్న ఆలోచన ఆవిడకి ఉండాలికదా. తప్పులు చేస్తే తెలియజేసి భుజం తట్టి ప్రోత్సహించాల్సిన గురువు తనే నిరుత్సాహపరుస్తూ, వెక్కిరిస్తూ మాట్లాడుతుంటే ఏంచేయాలో తెలియలేదు.

శ్యామ ఎలా నేర్చుకుందో ఆవిడ దగ్గర అని ఆశ్చర్యం వేసింది. ఆవిడ పావని తప్పుగా రాగం తీస్తే అలాగే తనూ తీసి వెక్కిరించటం మొదలుపెట్టింది.

'నేర్చుకోవాలన్న ఉత్సాహాన్నీ, ఆసక్తినీ కూడా చంపేసే గురువులు కొందరుంటారు' అని ఒకసారి హర్ష చెప్పటం గుర్తు వచ్చింది.

బోధించే స్థానంలో ఉన్నవాడు తన శిష్యుల్ని ప్రేమించగలగాలి. వాళ్ళు తప్పు చేస్తే దాన్ని మృదువుగా చెప్పి దిద్దగల నేర్పు ఉండాలి.

శ్యామకి అదే చెప్పి బాధపడింది పావని.

"ఇలా అయితే నువ్వేం చేయలేవు. పాత రోజులు కావు. ఆ రోజుల్లో కొద్దిమంది శిష్యులే ఉండేవాళ్లు. గురువు అవసరాలు కూడా కొద్దిగానే ఉండేవి. అందుకని గురు శిష్య సంబంధాలు పవిత్రంగా అలరారుతుం డేవి. ఇప్పుడంతా బిజినెస్, ఇది కమర్షి యల్ ప్రపంచం. ఇక్కడ సమయం డబ్బుతో ముడిపడి వుంది. తీరిగ్గా నిన్నే పట్టుకుని, తోముతూ కూర్చునే సమయం ఎవరికీ ఉండదు. నువ్వే అందుకుని పోవాలి. కార్పొరేట్ కాలేజీల్లో కూడా బాగా చదివి, చురుగ్గా ఉండే పిల్లలకే ఇంకా బాగా చెపుతారు. ఇది స్పీడు యుగం. స్పీడుగా బోలెడన్ని పనులు, కొద్దిపాటి సమయంలో పూర్తి కావాలి. సంగీతం టీచరనే కాదు, నువ్వు ఎక్కడికి వెళ్ళినా ఏ టీచర్ దగ్గరకి పోయినా గబగబా నువ్వే అన్నీ నేర్చుకోవా లనుకుంటారుగానీ, తీరిగ్గా కూర్చుని నేర్పరు" అంది శ్యామ.

వంటింట్లో పనిచేసుకుంటున్న శ్యామా వాళ్ళమ్మ 'స్పీడు యుగం' అన్నమాట విన బడి ఇవతలికి వచ్చింది.

"ఏమైంది?" అడిగింది ఆవిడ. శ్యామ పావని సంగతి, జానకీ కోలాహలం సంగతి వివరించింది ఆవిడకి.

"చెయ్యలేనన్ని పనులు నెత్తిన వేసుకుం టారు. ఆవిడ సంగీతం నేర్పిస్తోందికదూ. అది చాలదూ? స్వెట్టర్లు అల్లి అమ్ము తుంది. ఇంట్లో చిట్ ఫండ్ నడుపుతుంది. ఎన్నని చేయగలదు. ఇక ఇంట్లో వంటా వార్పూ సరేసరి. దాంతో సమయం దొరక్క సంగీతానికి ఎక్కువ టైమ్ కేటాయించలేక పోతోంది. ఇవి చాలవన్నట్లు మొన్న నన్ను ఏమడిగిందో తెలుసా? 'మీ తమ్ముడు సినిమా ప్రొడ్యూసరట కదా, ఆయనకి నన్ను పరిచయం చెయ్యండి' అంది. 'ఎందు కన్నాను'. వాళ్ళ ఫ్రెండ్ తీరిక సమయాల్లో సినిమాల్లో కోరస్ పాడటం, ఆర్కెస్ట్రాకి పని చేయటం చేస్తుందిట. తనకీ అలాచేసి ఎక్స్‌ట్రా మనీ సంపాదించాలని ఉందిట. ఇన్ని పనులు చేస్తూ, ఇంకో పని చెయ్యాగ లనా అన్న ఆలోచన లేదు. ఆ సినిమా ఛాన్సులొచ్చినా ఈ సంగీతం పాఠాలు మాత్రం మానదు. అప్పుడు శిష్యులమీద ఇంకాస్త అరుస్తుంది" అంది ఆవిడ.

పావని వింటోంది.

రెండురోజుల క్రితం కాలనీ మహిళామం డలిలో 'స్త్రీలు-ఒత్తిడి-ఆందోళన' అన్న అంశంమీద ఒక పేరున్న డాక్టర్‌గారితో ఇప్పించిన ఉపన్యాసం గుర్తు వచ్చింది పావ నికి.

"ఇదివరకు రోజుల్లో గ్రైండర్లు, గ్యాస్‌స్టౌ, వాషింగ్ మిషన్ లాటివేమీ మామూలు గృహిణికి అందుబాటులో ఉండేవి కావు. ఇంకా చాలాకాలం క్రితం ఆడవాళ్ళు బియ్యం కూడా దంచుకునేవాళ్ళు. ఇప్పుడు ఆ కాలం పోయింది. వంట సులువుగా చేసుకునేందుకు వీలుగా బోలెడన్ని సామాన్లు అందుబాటులో ఉన్నాయి. మరి గృహిణికి చాలా సమయం మిగలాలికదా. అయినా ఆనాడు స్త్రీలకి లేని టెన్షన్, స్ట్రెస్, ఎలర్జీలు ఈ కాలం ఆడవాళ్ళకి కలుగుతు న్నాయి. దానికి కారణం తక్కువ టైములో ఎక్కువ పనులు చేయాల్సి రావటం. స్పీడ్‌గా పనులన్నీ ముగించుకోకుంటే కుద రదు. అందుకే ఈ కాలం స్త్రీలకి అన్ని సౌక ర్యాలూ ఉండి కూడా బోలెడంత ఒత్తిడికి గురై రకరకాల రోగాల పాలవుతున్నారు

ఎన్ని పనులున్నా, ఇంకా ఏదో చేసి ఇంకాస్త సంపాదించాలన్న ధ్యాస ఎక్కువ యిపోయింది. శ్యామ తల్లి పావని భావాలు గమనించినట్లుగా మాట్లాడింది.

"మొన్న ఏమయిందో తెలుసా పావనీ. నా ఫ్రెండ్ ఒకావిడ డాక్టర్. ఆమె చాలా కాలం తర్వాత కలిసింది. తన కూతుర్ని తీసుకుని మా ఇంటికి వచ్చింది. ఆ పిల్ల నన్ను చూసి బోలెడంత ఆశ్చర్యపోయింది. నేను ఉద్యోగం చేయడంలేదని ఆమెకు

ఆశ్చర్యం. మీరు ఇంట్లో ఏం చేస్తారు? బోర్ కొట్టదా అంది. నాకు ఇంట్లో ఎప్పుడూ ఏదో ఒకపని ఉంటూనే ఉంటుంది. కానీ ఆ అమ్మాయికి అవేవీ లెక్కలోకి రాలేదు. చివరికి 'పోనీ సాఫ్ట్ టాయ్స్ అన్నా చేయటం నేర్చుకుని, అవి అమ్మి డబ్బు సంపాదించవచ్చుగా' అని అడిగింది. 'స్వెట్టర్లు అల్లి అమ్ముకోవచ్చు, అప్పడాలు, వడియాలు చేసి అమ్మవచ్చు. మీకు చాలా తీరిక ఉంది, ఏదో ఒకటి చేయకుండా ఎందుకు ఖాళీగా కూర్చుంటున్నారు?' అంది. ఆ అమ్మాయికి నేను తీరిగ్గా లేననీ, నాకూ ఏదో ఒకపని ఎప్పుడూ ఉండనే ఉంటుందనీ ఎంత చెప్పినా అర్థం కాలేదు. మనిషి అంటే డబ్బు సంపాదించే యంత్రంలాగా కనిపిస్తున్నారు వాళ్ళకి"

పావని తల ఊపింది. ఎప్పుడూ ఏదో ఒకపని చేసుకుంటూ, ఇంటిల్లిపాది అవసరాలూ కనిపెట్టుకుని ఉండే శ్యామా వాళ్ళమ్మ ఆ అమ్మాయి కంటికి సోమరిలా కనిపించిందన్నమాట. ఇంటిపనికి విలువే లేదు. ఆ మనిషి ఒకరోజు ఇంట్లో ఉండకపోతే తెలుస్తుంది. వాళ్ళెంత పనిచేస్తున్నారో.

"అన్నిచోట్లా అదే ధోరణి ఉంది పావనీ. ఏ పనిలోనూ ఎవరికీ తృప్తిలేదు. ఇప్పుడు చేస్తున్న పనిని శ్రద్ధగా చేద్దాం అని లేదు. ఇంకేదో చేయాలి, ఇంకేమిటో కావాలని ఆరాటం.

ఇక మీ సంగీతం టీచరు సంగతి అవతల పెడితే, కె.జి. నుంచి పి.జి. ఇంజనీరింగ్ వరకూ గురువుల ధోరణి కూడా అలాగే ఉంది. ఇంకేదన్నా మంచిపని దొరుకుతుందేమోనన్న ఆరాటం, వాటి కోసం వెతుక్కోవటం, ఫారిన్ ఛాన్స్‌ల కోసం ప్రయత్నించటం, రాగానే వెళ్లిపోవటం. ఎంత సంపాదిస్తున్నా తృప్తిలేదు. ఇంకేదో కావాలి. అందువల్ల గవర్నమెంట్ ఉద్యోగులలాగే ప్రైవేట్ ఉద్యోగాలు కూడా తయారవుతున్నాయి. చేసేపని శ్రద్ధగా, చక్కగా చేద్దాం అని లేదు. క్వాలిటీ కోసం ఎవరూ ప్రయత్నించటం లేదు. పైకి వెళ్ళాలనుకోవటం మంచి ఉద్దేశమే. కానీ దానికోసం వేరే వాళ్ళను బలిచేయటం తప్పు" అంది శ్యామ తల్లి.

ఎప్పుడూ మౌనంగా, శాంతంగా కనిపించే ఆవిడలో ఇన్ని ఆలోచనలున్నాయని పావనికి తెలీదు. ఆశ్చర్యంగా చూసింది.

"నేనూ లోకాన్ని చూస్తూనే ఉంటాను. పనిమనుషుల దగ్గర్నుంచి పెద్ద పెద్ద ఆఫీసర్ల వరకూ అందరిదీ ఒకే ఆలోచన. ఇంకేదో కావాలి అని. మాకు పనిమనిషి లేదు. నేనే అన్ని పనులూ చేసుకుంటాను. కానీ ఉన్నవాళ్ళు చెప్పే మాటలు వింటుంటాను. మా ఎదురు ఫ్లాట్‌లో ఒకమ్మాయి పనిచేస్తుంది. వీళ్ళ ఇంట్లో పనిచేస్తూ చాలా అసంతృప్తితో బాధపడేది. వేరే ఇల్లు వెతుక్కుంది. అక్కడ కూడా నిలవలేదు. మరో ఇల్లు చూసుకుంది. వీళ్ళకి చెప్పకుండా మానేసింది. చేసినన్ని రోజులూ అసంతృప్తిగా, అసహనంగా చేసింది. నాకు తెలిసిన మరో పెద్దాఫీసరు ఉన్నాడు. ఆయన గవర్నమెంట్ ఉద్యోగం మానేసి వేరే ప్రైవేట్ జాబ్‌లో చేరాడు. అదీ నచ్చక సొంతంగా బిజినెస్ పెట్టాడు. అదీ నచ్చక చివరికి అమెరికాకి వెళ్ళాడు. అక్కడ అయినా సెటిల్ అయ్యాడో లేదో. నాకు ఆయన్ని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. కేవలం సంతృప్తి లేకపోవటంవల్ల ఆయన అంత మంచి ఉద్యోగాన్ని వదిలేసుకుని రకరకాల అవతారాలు ఎత్తాడు. ఎందుకీ పెనుగులాట? మనిషి తను ఉన్న స్థితిలో తృప్తి పడిపోతే ఉన్నత శిఖరాలు ఎక్కలేడు. నిజమే. కానీ అందుకని హాయిగా గడపాల్సిన జీవితాన్ని అసహనంగా, అసంతృప్తిగా గడపడం మంచిది కాదుకదా. నేను ఇంట్లోనే ఉన్నా అందర్నీ గమనిస్తూనే ఉంటాను. ఎవరికీ తమ జీవితంపట్ల తృప్తి

లేదు. ఇంకా ఏదో దక్కలేదని నిరాశ. ఎందుకో ఏమోగానీ మనుషుల్లో అశాంతి, అసంతృప్తి పెరిగిపోతున్నాయి"

"అవసరాలు పెరుగుతున్నాయి. ఇదివరకు రోజుల్లోలాగా ఎవరి ఇంట్లో వాళ్లు బతకటం కాదు. అంతా బయటకి వచ్చి సంఘంలో కలిసి పని చేయాల్సివస్తోంది. ఒకరితో పోల్చుకుని బాధపడటం ఎక్కువయిపోతోంది" అంది శ్యామ.

"ఇదివరకు మేము ఒక సైకిల్ కొనుక్కుని ఎంతో ఆనందపడేవాళ్లం. దాన్ని హాయిగా జీవితాంతం వాడుకోవచ్చని సంతోషించేవాళ్లం. ఇప్పుడు అలా ఉందా? కారు కొన్నా తృప్తిలేదు. మామూలు కారు కొంటే ఎ.సి. కారు లేదని బాధ. ఎ.సి కారు కొని ఇంకాస్త మంచిది కొంటే బాగుండేదని ఆలోచన. ఇళ్లూ అంతే. లేనివాడు లేదని బాధపడుతుంటే ఉన్న వాళ్ళకి సంతృప్తిలేక బాధ. మామూలు ఫ్లాట్ కొని, డీలక్స్ ఫ్లాట్ కొనలేదని బాధ. డీలక్స్ కొంటే సూపర్‌డీలక్స్ లేదని దిగులు. దానికి తగ్గట్లు రోజురోజుకీ కొత్త కొత్త మోడల్స్, కొత్త ఫ్లోరింగ్‌లు, కొత్త అందాలు, వాటిని దక్కించుకోవాలని ఆరాటం. ఎక్కడికో పరుగులు. యాక్సిడెంట్ అయినా ఫర్వాలేదని స్పీడ్‌గా ఉరుకులు" శ్యామా వాళ్ళమ్మ అంది.

వాళ్లింట్లో కాసేపు గడిపి తిరిగి వచ్చింది పావని.

జానకీ కోలాహలంకి తను సంగీతం మానేస్తున్న సంగతి చెప్పింది.

"నీ మొహం చూసినప్పుడే నువ్వు సంగీతం నేర్చుకునే రకం కావని నాకు అర్థమైపోయింది" అందావిడ పెళుసుగా.

"అలాగా! మరి ఆ సంగతి నాకు ముందే చెపితే బాగుండేదిగా" అంది పావని తనూ కాస్త కటువుగా.

ఆవిడ మౌనంగా ఉండిపోయింది. పావని వెనక్కి తిరిగి వచ్చేసింది.

ఏమిటో ఎంతైనా గురువుకదా అని మానేస్తున్న విషయం చెప్పటానికి వెళ్లింది గానీ ఏదీ చెప్పకుండా మానేసిన వాళ్లు తను చేరాక నలుగురైదుగురు ఉన్నారు. ఆవిడ మూడునెలల ఫీజు అడ్వాన్స్‌గా తీసేసుకుంది. అందులో ఆవిడ తప్పు లేదు. బహుశా ఇదివరకు ఎవరైనా ఎగ్గొట్టి పోయి ఉంటే ఈ పాలసీ అవలంబిస్తోందేమో. కానీ తన దగ్గర చేరినవాళ్లని ఏమాత్రం ప్రోత్సహించకుండా తీసిపారేసి మాట్లాడటం ఏమిటి?

ఆ క్రమంలోనే ఇంకొంతమంది సంగీతం మాస్టార్ల గురించి తెలిసింది పావనికి.

"రాధా హరగోపాల్ దగ్గర చేరుతావా? ఆవిడ దగ్గర చేరితే ఫీజు చాలా ఎక్కువ. కానీ నీకు మూడు నెలల్లోగా రేడియో ప్రోగ్రామ్‌లూ, టీవీ ప్రోగ్రాములూ వస్తాయి. ముందు గ్రూప్ సాంగ్స్‌లో, ఆ తర్వాత నువ్వు ఒక్కదానివే పాడవచ్చు"

"సుందరరామయ్యగారి దగ్గర చేరు. ఆయన ఏదో ఒకటి నేర్పి ఫారిన్ టూర్లు కూడా తిప్పగల సమర్థులు"

"జయరామగోపాలం దగ్గర మాత్రం చేరకు. ఎక్కడి వాళ్లని అక్కడే ఉంచి ఏదీ నేర్పకుండా ఉండటంలో ఆయన ఘనుడు"

ప్రదర్శనలూ, టి.వి, రేడియో ఛాన్స్‌లూ, సినిమాలలో కనీసం గ్రూప్ సాంగ్స్‌లో అయినా పాడే అవకాశాల కోసం ప్రయత్నించడం తప్ప సరిగ్గా నేర్పుదామన్న కుతూహలం గురువుల్లో లేదా? పావనికి ఆశ్చర్యం వేసింది.

నాట్యం నేర్చుకుందామన్నా అదే తీరు.

జయశ్రీ ఆంటీ కూతురు నిఖిత అమెరికాలో ఉంటోంది. భర్త అక్కడ ఇంజనీరు.

"మీ నిఖిత అక్కడ ఉద్యోగం చేస్తోందా? " అడిగింది పావని.

"లేదు. అయినా వాళ్ళాయనకన్నా దీని సంపాదనే ఎక్కువ" అంది జయశ్రీ ఆంటీ.

"అదెలా? " ఆశ్చర్యపోయింది పావని.

"అవును"



పావనికి అర్థంకాలేదు. ఎందుకంటే నిఖిత చదివింది బి.ఏ మాత్రమే. వేరే డిప్లొమాలు కూడా ఏవీలేవు.

"ఒక రెండేళ్లు ఇక్కడ డాన్స్ నేర్చుకుంది కదా. అక్కడ డాన్స్ నేర్పుతోంది" అంది జయశ్రీ ఆంటీ.

"ఇక్కడ ఏం పరీక్షలు పాసయినట్టు లేదే డాన్స్‌లో" అంది పావని.

"ఏదీ పాస్ కాలేదు"

"బాగా కూడా వచ్చినట్టు లేదు కదూ!" అంది పావని. ఎందుకంటే నిఖిత ఆ రెండేళ్లలో బోలెడన్ని రోజులు



క్లాస్‌కి పోనేలేదు. మరి డాన్స్‌లో నైపుణ్యం లేకుండానే ఇంకోళ్లకి నేర్పే స్థాయికి ఎలా ఎదిగిందో పావనికి అర్థం కాలేదు.

"ఏవో కొన్ని ఐటమ్స్ బాగా నేర్చుకుంది" అంది జయశ్రీ ఆంటీ.

"అయితే?"

"అమెరికాలో ఇలా పూర్తిగా డాన్స్ నేర్పక్కర్లేదు. అలా నేర్చుకునేవాళ్లూ ఉంటారనుకో. కానీ ఒక్క ఐటమ్ నేర్చుకుని వెళ్లిపోయే వాళ్లు చాలామంది ఉంటారు. ఉదాహరణకి వాళ్లకి 'మధురానగరిలో చల్లనమ్మబోదు' అన్న నాట్యం ఐటమ్ నచ్చిందనుకో అదే నేర్చుకుని వెళ్లిపోతారు. అది నేర్పినందుకు ఇన్ని డాలర్లు అని బేరం కుదుర్చుకుని ఆ ఫీజు ఇచ్చేసి వెళ్లిపోతారు. పాటలు కూడా అంతే. ఈ పాట నేర్పితే ఇంత, ఆ పాట నేర్పితే ఇంత అనో, గంటకి ఒక డాలర్ అనో లెక్క ఉంటుంది. అది నేర్చుకుని వెళ్లిపోతారు. మనం ఒకళ్లో ఇద్దరో శిష్యుల్ని పట్టుకుని వేళ్లాడక్కర్లేదు. బోలెడంత మంది శిష్యులు దొరుకుతారు. వాళ్లు నీకు కావల్సిన డబ్బు ఇచ్చి వాళ్లక్కావల్సిన పాట నేర్చుకుని వెళ్ళిపోతారు"

"ఆ" పావని ఆశ్చర్యపోయింది.

"అంతేకాదు. వాళ్లకి సంగీతం, డాన్స్ శాస్త్రీయ సంగీతం, శాస్త్రీయ నృత్యం అనే కాదు. వాళ్లకి నచ్చితే ఏదైనా నేర్చుకుంటారు. మా నిఖిత ఎదురింట్లో ఒక ముసలావిడ ఉందిట. ఆవిడ కూడా ఇండియనే. ఆవిడ మన ముసలాళ్లందరిలాగే ఏవో భజనలు పాడుకుంటుంటే అవి నేర్చుకుంటామని బోలెడంతమంది వచ్చారుట. వాళ్లకి భజనలు నేర్పి, ఆవిడ బోలెడన్ని డాలర్లు సంపాదించిందిట"

'ఆవిడ నిజం చెపుతోందో, నిఖిత బోలెడన్ని డాలర్లు సంపాదిస్తున్నదని కోతలు కోస్తోందో పావనికి అర్థంకాలేదు. ఈసారి అమెరికా వెళ్ళివచ్చిన వాళ్లనడిగి సంగతేంటో తెలుసుకోవాలి అసలు' అనుకుంది.

తనకే సరిగ్గా రానపుడు వేరే ఎవళ్లకో నేర్పటం, అదీ మేధావుల దేశంలో డాలర్ల పంట పండించటం, ఇదంతా నిజమేనా? ఏమో మరి?

ఏదీ చేయలేదా తను?

హర్ష అన్నట్లు తనకి ఏమీ చేతకాదా? పావని దిగులూ, దుఃఖంతో కృంగిపోతోంది. లోకాన్ని తెలుసుకోవాలనిపించింది. తనకి ఏమీ తెలీదనీ, తిని కూర్చోవటం తప్ప మరోటి చేతకాదనీ అన్నట్లు మాట్లా

డాడు హర్ష. అతని మాటలు అబద్ధం చేయాలి. ఎలాగ?

తెలిసిన వాళ్లందరి ఇళ్లకూ వెళ్ళి రావటం మొదలుపెట్టింది. ఆదివారాల్లో ఏ పనీ లేకున్నా బస్ ఎక్కి ఏదో ఒక చోటికి వెళ్ళి మళ్ళీ ఊరికే తిరిగి రావటం చేస్తోంది. బస్ స్టాప్‌లో, బస్సుల్లో జనాల్ని గమనిస్తోంది.

ఆ క్రమంలో వెంకటలక్ష్మి పరిచయమైంది. వెంకటలక్ష్మికి ముప్పై ఏళ్లుంటాయి. మనిషి తెల్లగా, సన్నగా పొడవు జడతో ముచ్చటగా ఉంటుంది. ఉద్యోగం చేస్తున్నా ఆమెలో అమాయకత్వం పోలేదు. ఆమెకి నలుగురు పిల్లలున్నారు. భర్త ఉద్యోగం చేయడు. ఊరికే ఇంట్లో ఉండి పిల్లల్ని చూసుకుంటాడని చెప్పింది. కొంచెం పరిచయం పెరిగాక తన ఇంటికి పావనిని ఆహ్వానించింది వెంకటలక్ష్మి.

అప్పుడు అర్థమైంది పావనికి వెంకటలక్ష్మి ఎన్ని కష్టాలు పడుతోందో. భర్త ఉద్యోగం చేయడు. ఆమె చెప్పినట్లు ఇంట్లో ఉండి పిల్లల్ని చూసుకోడు. పైపెచ్చు రోజూ తాగేసి వచ్చి పిల్లల్ని చావగొడతాడు. అత్తగారు ఏ పనీ చేయకపోగా, కొడుకుని వెనకేసుకొచ్చి వెంకటలక్ష్మిని సాధిస్తుంటుంది. ఆఫీసు చాలాదూరం కాబట్టి అన్ని పనులూ చేసుకుని సమయానికి చేరుకోవాలంటే వెంకటలక్ష్మి తెల్లవారుఝామున నాలుగు గంటలకి లేవాలి. అప్పుడు లేచి పనులు పూర్తి చేసుకుని పిల్లల్ని స్కూలుకి పంపి, అత్తగారికి అన్నీ అమర్చి భర్త తిడితే, కొడితే, సహించి అతనికి కావాల్సినవి అన్నీ ఇచ్చి ఆ తర్వాత ఆఫీసుకి బయల్దేరాలి. మళ్ళీ ఇంటికి రావటం రాత్రి ఏడు దాటాకే. ఈ లోపల ఎవరూ చిన్నమొత్తం పని కూడా చేసుకోరు. మళ్లీ ఆమె వచ్చి ఎంత రాత్రయినా, అన్ని పనులూ చేసుకుని, వండి, వడ్డించితేగానీ ఆరోజు గడవదు.

పనికి వెంకటలక్ష్మి ఎన్నడూ బాధపడదు కానీ ఎంత సంపాదించినా, ఎంత పొదుపుగా నడిపినా అప్పులు అవుతూనే ఉన్నాయి. కావాల్సినన్ని అప్పులు, దొరికినన్ని అప్పులు చేసింది వెంకటలక్ష్మి. ఆ అప్పు తీర్చటానికి ఆఫీసులో ఓవర్‌టైమ్ కూడా చేసి సంపాదిస్తోంది.

ఆఫీసులో పక్కసీట్లో ఉద్యోగిది లోన్స్ సీటు. అతను వెంకటలక్ష్మిని సాదరంగా పలకరించి మాట్లాడుతూ ఉంటాడు. వెంకటలక్ష్మి పడుతున్న కష్టాలన్నీ కూడా అతనికి తెలుసు.

తమ లోన్స్ అతని దగ్గర శాంక్షన్ చేయించుకుని పోతుంటారు ఆఫీసువాళ్లు. అతను వాళ్ల దగ్గర ఒక్కో లోన్ శాంక్షన్ అయినప్పుడు అయిదు వందలనుంచి వెయ్యిరూపాయలదాకా అందే మొత్తాన్ని బట్టి లంచం తీసుకుంటాడు. చేతిలో ఖరీదైన సెల్ ఫోన్, ఖరీదైన బట్టలూ, బూట్లూ, ఖరీదైన వాచీ, హీరో హోండా మోటార్‌సైకిల్, అప్పుడప్పుడూ ఫామిలీతో వెళ్లేందుకు మారుతీకారూ, వీటన్నిటితో అతను బిజినెస్ మ్యాన్‌లా తప్ప మామూలు గవర్నమెంటు ఉద్యోగిలా ఎంతమాత్రం కనిపించడు.

ఇంతలో ఆఫీసులో కంప్యూటర్ కొనుక్కుంటే అప్పు ఇవ్వవచ్చని ఆర్డర్స్ వచ్చాయి. చాలామంది వెంటనే ఆ లోన్ తీసుకున్నారు. ముప్పై వేలు ఇస్తారు. కంప్యూటర్ అందరికీ కావలసిన వస్తువు అయిపోయింది. ఇంట్లో ఉంటే చాలా ఉపయోగం అని ఆ అప్పు తీసుకుని కంప్యూటర్ కొన్నారు.

వెంకటలక్ష్మికి ఆ లోన్ సంగతి తెలిసినా కంప్యూటర్ కొనే అవసరం లేదు కాబట్టి అప్లై చేయలేదు. ఆడపడుచు డెలివరీకని వస్తోంది. వెంకటలక్ష్మి భర్త ఎవరిదగ్గరో అప్పు చేస్తే వాళ్లు ఇంటికొచ్చి తిట్టిపోతున్నారు. పిల్లలకి ఫీజులు కట్టలేదని స్కూల్లో తిడుతున్నారు.

ఏంచేయాలో తోచకుండా ఉంది. మాటల సందర్భంలో లోన్స్ వ్యవహారం డీల్ చే

స్తున్న ఆనందరావుతో తన సంగతి చెప్పుకుని బాధపడింది.

"హాయిగా కంప్యూటర్ లోన్ తీసుకుని ఆ డబ్బు వాడుకోండి" అన్నాడు ఆనందరావు.

"కానీ కంప్యూటర్ కొన్నట్లు రసీదు చూపించాలి కదా" అంది వెంకటలక్ష్మి.

"అరే మీకు తెలీదా. రసీదు గురించి బిల్ గురించి అడగటం లేదు. ఏమీ అడగకుండా ఊరికే లోన్ శాంక్షన్ చేయమని అంటున్నారు" అన్నాడు ఆనందరావు.

"అమ్మయ్య" అనుకుంది వెంకటలక్ష్మి. బిల్ చూపించకుండా లోన్ తీసుకోవటం తప్పు అనే స్టేజ్ ఎప్పుడో దాటిపోయింది. ఎలాగో ఒకలా అప్పు దొరికితే చాలు అనిపిస్తోంది.

ఆరోజే లోన్ అప్లై చేసింది. ఆనందరావు పేపర్లు త్వరగా మూవ్ అయేట్లు చూశాడు. పది రోజుల్లో లోన్ శాంక్షన్ అయిపోయింది. డబ్బు చేతికొచ్చింది.

అయిదు వందలు చేతిలో పెడితే గానీ



ఆనందరావు చెక్ చేతికివ్వలేదు.

వెంకటలక్ష్మి నిర్ఘాంతపోయింది. అతను ఎన్నాళ్లనుంచో తెలుసు. అట్లా చేస్తాడని ఎంతమాత్రం అనుకోలేదు.

"వ్యవహారం దగ్గర మొహమాటం పనికి రాదు" అన్నాడు నవ్వుతూ.

"నా సంగతి తెలిసి కూడా" అంది వెంక టలక్ష్మి.

"అందరికీ కష్టాలు, అవసరాలు ఉంటాయి. ఏదీ లేకుండా ఎవరూ అప్పులు చేయరు. ఇట్లా ఆలోచిస్తూ కూర్చుంటే నాకు కుదరదు" నిక్కచ్చిగా నవ్వుతూనే చెప్పాడు ఆనందరావు.

అతను ఆ డబ్బు చేతిలో పడగానే చేసింది ఏంటంటే ఫ్రెండ్స్‌ని తీసుకుని బార్‌కి వెళ్ళటం. శుభ్రంగా తిన్నాడు. హాయిగా తాగాడు.

"పావనీ నా పరిస్థితి తెలిసీ అతను అట్లా ఎలా అడగగలిగాడు. నా రక్తం కరిగించి, నా రెక్కలు ముక్కలుచేసుకుని ఆ అప్పు తీర్చాలని అతనికి తెలుసు. అయినా అయి దువందలు ఖచ్చితంగా అడిగి తీసుకు న్నాడు. అతను పోనీ ఏ అవసరానికయినా వాడుకుంటే అది వేరే సంగతి. అదీ లేదు. ఆ డబ్బుతో జల్సా చేశాడు. రోజూ పక్క సీట్లో కూర్చునే మనిషి ఎన్నాళ్లనుంచో నా కష్టాల్ని గమనిస్తూ కూడా చివరికి లంచం దగ్గర ఎలా ప్రవర్తించాడో చూడు" వెంకట లక్ష్మి బాధపడుతూ చెప్పింది.

పావనికి ఏదో కొత్త లోకంలో ప్రవేశించి నట్లయింది.

మరీ లోకం తెలియని అమాయకురాలేం కాదు. లంచం ఇస్తేనే పని జరుగుతుందని తెలుసు. కానీ ఆ అవినీతి ఇంత ఘోరంగా ఉందని తెలీదు. ఎన్నేళ్లనుంచో తెలిసి ఉన్న మనిషిని కూడా నిర్మొహమాటంగా డబా యించి తీసుకునేంత లెవెల్‌లో ఉందని తెలీదు. వెంకటలక్ష్మి పరిస్థితి తెలిసిన వాళ్లె వరైనా ఆమెకి ఎంతోకొంత సాయంచేయ కుండా ఉండలేరు. మరి ఆనందరావు అంత ఇదిగా డబ్బు ఎలా అడిగి తెలుసుకోగలి గాడు? వెంకటలక్ష్మి అన్నట్లు ఆ డబ్బుతో ఎలా ఖుషీగా గడపగలిగాడు? అతనికి అంతరాత్మ లేదా? అది అతన్ని ప్రశ్నిం చదా?

వెంకటలక్ష్మితో అదే అంది. వెంకటలక్ష్మి నవ్వింది.

"అంతరాత్మ అన్నది ఒకటున్నదని చాలా మంది మర్చిపోయారు. మంచితనం, అంత రాత్మ, హృదయం ఇవన్నీ పాత రోతగా భావిస్తున్నారు చాలామంది. ఇప్పుడు కార్లూ, సెల్‌ఫోన్లూ, బంగళాలూ, హాలీడే రిసార్ట్‌లూ, ఎంజాయ్‌మెంట్ ఇవి తప్ప ఎవ రికీ మంచితనం, అంతరాత్మ లాంటివి పట్టవు" అంది.

పావని నిశ్శబ్దంగా ఉండిపోయింది. వెంకటలక్ష్మి ఇంకా చాలా విషయాలు, లంచాల గురించీ, అవనీతి గురించీ చెప్పింది.

పావనికి ఆలోచనలు మొదలయ్యాయి. మొట్టమొదటిసారిగా చాలా రోజులతర్వాత ఆలోచనలు... హర్షని గురించి కాక ఇక ఏ ఇతర విషయమూ ఆలోచించని పావని మనసులో తొలిసారిగా తొలకరి వానలా మొదలయిన కొత్త ఆలోచనలు అవి.

లోకం గురించీ, అవినీతి గురించీ ఆలోచ నలు. అప్పుడే మొట్టమొదటిసారిగా ఆమె గుండెలో మొదలయిన అలజడి ఆమె మన సుని కుదిపివేసింది.

ఇంత ఘోరంగా ఉన్నదా లోకం? తను అసలు లోకం అంటే ఏమిటో తెలుసుకో వాలి ముందు.

ఏంచేయాలో ఆలోచించుకుంది.

వెంకటలక్ష్మి దగ్గర సెలవు తీసుకుని బయల్దేరింది. ఇంటికి వెళ్లలేదు.

పావనికి వరసకి చిన్నాన్న అయిన అహో బిలరావు 'కంచుకంఠం' పత్రికలో ఎడిట ర్‌గా పనిచేస్తున్నాడు. పావని నేరుగా

ఆయన దగ్గరకి వెళ్ళింది.

"పావనీ, ఏమిటిలా వచ్చావు? " ఆశ్చర్య పోతూ అడిగాడు అహోబిలరావు. పావని అమాయకత్వం, బేలతత్వం అందరికీ తెలి సిందే. అలాంటి పావని ఒక్కత్తే తన ఆఫీ సుకి వచ్చేసరికి ఆయనకి ఆశ్చర్యం కలి గింది.

"ఏంలేదు అంకుల్. నేను కొన్ని విష యాలు తెలుసుకోవాలనుకుంటున్నాను" అంది.

"ఏమిటవి? "

"జర్నలిస్ట్ కావాలంటే ఏంచేయాలి? "

"ఇంత హఠాత్తుగా నీకీ ఇన్ఫర్మేషన్ తెలు సుకోవాలని ఎందుకనిపించింది? " అహోబి లరావు ఇంకాస్త ఆశ్చర్యపోయాడు.

పావని నవ్వేసింది.

"అచ్చు ఒక జర్నలిస్టులాగే ప్రశ్నించారే? " అంది.

అహోబిలరావు కూడా నవ్వేశాడు.

"ఇంతకీ ఈ వివరాలు ఎందుకడిగావో అర్థంకాలేదు" అన్నాడు.

"నాకు జర్నలిస్ట్ కావాలనుంది"

"భేషయిన ఆలోచన. కానీ దానికి కావల సిన చొరవా, తెగింపూ నీకు ఉన్నాయా మరి? "

"నిర్భయంగా, నిజాయితీగా రాయగలను"

"అది చాలు. పోనీ ఒక పని చెయ్యి. ఏదయినా ఒక టాపిక్ తీసుకుని దానిమీద నువ్వు పరిశోధనచేసి, ఆర్టికల్ రాయి. బాగుంటే మా పత్రికలో వేస్తాం" అన్నాడా యన.

"అలాగే" అంది పావని.

ఆయన దగ్గర కొన్ని పాత వ్యాసాలు అడిగి తీసుకుంది. ఆయన కొన్ని సల హాలూ, సూచనలూ చెప్పాడు.

"ఏం జరిగింది? " మెల్లగా అడిగాడు.

"ఏమిటి? " పావని అయోమయంగా చూసింది.

"ఎందుకు ఇలాంటి ఆలోచన వచ్చింద సలు? నీ తత్వం తెలుసు. ఒక్కసారిగా మార్పెందుకు వచ్చిందా అని" నవ్వుతూ అడిగాడాయన.

పావని తను వెంకటలక్ష్మి నుండి విన్న సంగతులు చెప్పింది.

"ఈమధ్యే లోకాన్ని చూడటం మొదలుపె ట్టాను. ఇదివరకు ఎన్నడూ అనుకోలేదు. ఇవాళ నాకు తెలిసిన ఒకావిడ ద్వారా లంచాలు ఎలా ఎంతెంత తీసుకుంటున్నారో అర్థమైంది. ఈ అన్యాయాన్ని సహించకూడ దనిపించింది. వెంటనే జర్నలిస్ట్ అయి సమాజంలో కుళ్ళునంతా బయటపెట్టాలని పించింది" చెప్పింది పావని.

"ఒక్కొక్కటీ తిరుగుతుంటే చాలా అర్థమ వుతాయి. హాస్పిటల్స్‌కీ, మురికివాడలకీ వెళ్ళు. బోలెడంత సమాచారం దొరుకు తుంది. నువ్వు రాయగలగాలేకానీ సమా జంలో అవినీతికీ, అన్యాయానికీ కొరతలేదు. నీకు ఈ రంగంలో ఆసక్తి ఉంటే జర్నలిజం స్కూల్లో చేరవచ్చు"

"అలాగే" అంది పావని.

తనకి హఠాత్తుగా వచ్చిన ఈ ఆలోచనకి తనకే ఆశ్చర్యం కలుగుతూంటే అక్కడి నుంచి బయలుదేరింది.

ఇంటికి వెళ్ళాక తండ్రితో తనకి కలిగిన కొత్త ఆలోచన గురించి చెప్పింది.

"చాలా ధైర్యం, తెగువ కావాలంటారు. ఆ ఫీల్డ్ నీకు బొత్తిగా కొత్త" అన్నాడాయన.

"ఏదో ఒక వ్యాసం రాసి చేతకాకపోతే తనే మానుకుంటుంది" అంది తల్లి.

పావనికి తల్లి వెటకారం చేస్తోందని అర్థ మైంది. అయినా ఎందుకోగానీ కోపం రాలేదు. ఆవిడకి తనవల్ల జరిగిన అనుభ వాల వల్ల తనది ఆరంభశూరత్వం అని అభిప్రాయ పడిపోయింది. తను ఏదన్నా చేసి చూపించాలి. అంతేగానీ వాదించి లాభంలేదు.

అహోబిలరావు అంకుల్ తనకి ఏ సబ్జెక్ట్ మీదా రాయాలని ఖచ్చితంగా చెప్పలేదు.

అవినీతి గురించి రాయాలని అనిపిస్తోందని తను ఆయనతో అంది. అవినీతి గురించి రాయాలంటే ఎక్కడి నుంచి మొదలుపెట్టాలి?

ఎందుకోగానీ ఎవరితోనూ చర్చించబుద్ధి కాలేదు. ఇది తనే స్వయంగా పూర్తిచేయాలి అనుకుంది.

ఆరోజునుంచీ నాలుగైదు ఆఫీసులు 'అవినీతికి పట్టుకొమ్మలు' అని పేరున్న ఆఫీసులు తిరిగింది. డైరెక్టుగా లంచం అడిగి తీసుకుంటున్న వాళ్లని చూసి నివ్వెరపోయింది.

ఇంకొన్ని ఆఫీసుల్లో లంచాలు వసూలు చేసేందుకు కొందరు ఏజంట్లను నియమించుకున్నారు. వాళ్లు పార్టీల దగ్గర డబ్బు వసూలు చేసి సంబంధిత సిబ్బందికి పంచుతున్నారు. ఆ ఆఫీసులమీద అవినీతి నిరోధక శాఖ కన్ను ఉందిట. అందుకని వాళ్లు నేరుగా లంచం తీసుకోకుండా ఒక వ్యక్తిని అందుకు నియమించి అతని ద్వారా తీసుకుంటున్నారుట. అందువల్ల రిస్క్ ఉండదని అలా చేస్తున్నారు.

లంచం తీసుకోవడంలో ఎన్ని విధానాలు ఉన్నాయో అక్కడ తిరిగాకే అర్థం అయింది.

లంచం ఇవ్వకపోతే పనిచేయకుండా తాత్సారం చేయటం, చాలాసార్లు తిప్పించడం...... ఈ ఆఫీసుల చుట్టూ ప్రదక్షిణలు చేసేకన్నా ఆ డబ్బు ఏదో ఇచ్చేస్తే పని తొందరగా అయిపోతుంది, మన సమయం డబ్బూ కూడా వృథా కావని పార్టీలు డబ్బు ఇచ్చేసి పని చేయించేసుకోవటం, ఇలాగ ఇన్నిరకాల వ్యవహారాలున్నాయని తెలిసింది పావనికి.

తనకి తప్ప అందరికీ ఈ సంగతులు తెలుసేమో అని కూడా అనిపించింది. ఒకరిద్దరితో మాట్లాడినప్పుడు లంచాలు, అవినీతి అన్నది మానవ జీవితంలో విడదీయరాని బంధంలా పెనవేసుకుపోయాయని అర్థమయింది.

మనుషులు ఎలా తయారయారంటే లంచం ఇవ్వటం అన్నది మామూలు విషయంలా, ఆఫీసు ప్రొసీజర్‌లో అదీ ఒక భాగంలా తయారయింది.

స్నేహితురాలు ఒకరికి ఒక ఆఫీసులో పని పడింది. ఆ అమ్మాయి నాన్న టూర్‌కి వెళ్తూ ఆమెనే ఆ పని చూసుకోమని చెప్పాడు.

"ఆ ఆఫీసుకి వెళ్లి ఫలానా వారిని కలువు. ఏం చెయ్యాలో, అప్లికేషన్ ఎలా పెట్టాలో, ఎంత డబ్బు లంచం ఇవ్వాలో ఆయన చెబుతాడు. ఆ విధంగా చేసేసి వాళ్లు చెప్పిన డేట్‌కి వెళ్లి పని అయిందో లేదో కనుక్కో. చిన్నపిల్లాడిని పంపినా ఈ పని చేసుకుని వచ్చేస్తాడు. వెరీ సింపుల్" అన్నాడాయన.

అందరికీ అవినీతి గురించి తెలుసు. అది రొటీన్ అయిపోయింది. బస్సులో ఎక్కితే టిక్కెట్ తీసుకోవాలన్నట్టు పనికావాలంటే లంచం ఇవ్వాలని అందరికీ తెలుసు. ఎవరికివాళ్లు పని అయిపోతే చాలు సమాజం సంగతి మాకెందుకు అనుకుంటారు. జీవితంలో స్పీడ్ పెరిగిపోయింది. డబ్బు పారేస్తే ఏం? పని జరిగిపోతుందిగా అనే బిజీ మనుషులు తయారయారు. కానీ ఏది ఎలా జరిగినా నష్టపోయేది మాత్రం పేదలు. డబ్బున్నవాడు ఎలాగైనా పని జరిపించుకుంటాడు. రక్తం మరిగిన పులిలా లంచాలు అలవాటైన ఉద్యోగులు డబ్బు ఇస్తేగానీ పని చేయం అంటే పాపం పేదలు ఎక్కడనుంచి తెస్తారు?

తను సేకరించిన సమాచారంతో వ్యాసం రాసింది. తన కళ్ల ఎదురుగా జరిగిన రెండు లంచం సంఘటనల గురించి కూడా రాసింది. వ్యాసానికి రెస్పాన్స్ బాగా వచ్చింది. పాఠకులు కొందరు తమకి ఎదురైన అనుభవాన్ని రాశారు.

"వ్యాసం చాలా బాగుంది పావనీ!

నువ్వింత బాగా రాస్తావని నేను ఊహించ లేదు" అన్నాడు అహోబలరావు.

ఇంటి దగ్గరా, కాలేజీలో, బంధువర్గంలో అంతా చాలా ప్రశంసించారు.

"నువ్వు రాసిన వ్యాసం చాలా బాగుంది" అని ఏకంగా ప్రిన్సిపాల్‌గారే మెచ్చుకు న్నారు.

"ఏమిటి సడెన్‌గా అవతారం మార్చే శావ్? " ఆశ్చర్యపోతూ అడిగారు స్నేహి తులు.

పావని నవ్వి ఊరుకుంది.

"ఏమిటే! పూర్తిగా మారిపోయినట్లు కని పిస్తున్నావు? " అంది శ్యామ.

"నిజంగానా? "

"అవును. అద్దంలో చూసుకో. నీ కళ్లు ఇదివరకు లేడి కళ్లలా బెదురుగా ఉండేవి. ఇప్పుడు అదిలేదు. పూర్తి ఆత్మవిశ్వాసంతో మెరుస్తున్నాయి అని అనలేను... కానీ చాలా మార్పు మాత్రం కనిపిస్తోంది" అంది శ్యామ.

పావనికి కూడా ఆశ్చర్యంగా ఉంది.

ఇదివరకు గుండెనిండా ఏదో దిగులు గూడుకట్టి ఉన్నట్టు అనిపించేది. అందుకని గట్టిగా ఊపిరి తీసి వదలాల్సివచ్చేది. కాసేపు గుండె తేలిక పడ్డట్టు అనిపించేది. మళ్లీ కాసేపయాక యథాప్రకారం గుండె బరువెక్కేది.

ఇప్పుడు అలా లేదు.

అంటే తనలో దుఃఖం మాయమవు తోందా?

ఆత్మవిశ్వాసం వస్తోందా?

చిన్న అచీవ్‌మెంట్... ఇంత మార్పుని తేగలదా? అందుకేనా మనిషి ఏదో ఒకటి సాధించాలి, ప్రయత్నించాలి అంటారు?

ఎక్కడో చదివిన కొటేషన్ జ్ఞాపకం వచ్చింది.

"విషాదమంటే అనుకున్నది సాధించలేక పోవటంకాదు. అసలు ఏదీ సాధించాలని అనుకోకపోవటమే విషాదం"

ఎంత గొప్పగా చెప్పారో అనిపించింది పావనికి. అవును. సాధించాలన్న తపన లేకపోవటం గొప్ప విషాదం. తనకి ఇప్పుడు సాధించిన దానితో తృప్తిలేదు. ఇంకా ఏదో చెయ్యాలి. ఏదో చేసి చూపించాలని అనిపి స్తోంది.

ఆ తపనలోంచి పావనికి హర్ష అర్థంకా వటం ప్రారంభించాడు.

అవును మరి. ఒక టార్గెట్, ఒక గోల్ ఫిక్స్ చేసుకున్నాడు హర్ష. అతనికి సామర్థ్యం ఉంది. తపన ఉంది. లక్ష్యాన్ని చేరుకునే క్రమశిక్షణ ఉంది. అందుకే ఆ లక్ష్యం తప్ప మరోవైపు చూడకుండా ప్రయ త్నిస్తున్నాడు.

తను ప్రియాంకని రెచ్చగొట్టి తప్పు చే సిందా?

ప్రియాంక హర్షతో చనువుగా ఉంటోం దని కాలేజీలో చెప్పుకుంటున్నారు. నిజం గానే చనువు సంపాదించగలిగిందా? హర్ష తన లక్ష్యాన్ని వదిలి ఆమెతో చనువుగా ఉంటున్నాడా? ఏవేవో ఆలోచనలు ముసు రుకుంటున్నాయి.

మెల్లగా అలవడుతున్న ఈ ఆత్మవిశ్వా సాన్ని తను ఎంతమాత్రం పోగొట్టుకోకూ డదు. హర్ష ఏమైతే తనకేంటి? తను తన లక్ష్యం సాధించాలి. లక్ష్యసాధన తప్ప మరొ కటి తన మనసులోకి రాకూడదు. అంతే.

మళ్లీ ఒకసారి గట్టిగా ఊపిరి పీల్చి వద లాల్సి వచ్చింది.

మళ్ళీ ఏ టాపిక్‌మీద రాస్తే బాగుంటుం దని ఆలోచించటం మొదలుపెట్టింది. ఈసారి మురికివాడల గురించి రాయాలి. కొన్ని మురికివాడల గురించి విన్నది. వాటికి వెళ్ళి స్వయంగా పరిస్థితులు చూసి రాస్తే? ఒక కెమేరా కూడా కొనుక్కుని అవ సరమైతే ఫొటోలు కూడా తీస్తే సరి. ఈ డిగ్రీ పూర్తయాక జర్నలిజంలో చేరాలి. ఇది రాసినందుకు ఎంత తృప్తి, ఆనందం లభిం చాయి. గాయపడ్డ తన మనసుకి సాంత్వన

కలిగినట్లయింది.

వెంటనే ఏమేం పాయింట్స్ కవర్ చెయ్యాలో రాసుకుంది.

"నేను మురికివాడలమీద ఆర్టికల్ రాయాలనుకుంటున్నాను. నువ్వు వస్తావా నాతో. ఏదన్నా మురికివాడకి వెళ్ళి అక్కడి మనుషుల్ని కలిసి వాళ్ల జీవితాన్ని, సమస్య లనీ ఒక వ్యాసం రూపంలో రాయాలి" అంది రుచికతో.

"మురికివాడలంటే ఏమిటీ? " రుచిక ఎదురుప్రశ్న వేసింది.

"స్లమ్ ఏరియా... మన రామయ్యనగర్"

రుచిక ఉలిక్కిపడింది. "అమ్మో నేను రాను బాబూ" అంది భయంగా చూస్తూ.

"ఏమిటి ఏదో నరకానికి రమ్మని అడిగి నట్లు భయపడతావు"

"అది నరకమేనే. అక్కడి మనుషులు యమభటుల్లా ఉంటారు"

"నీకెలా తెలుసు? "

"నేను ప్రత్యక్షంగా చూశాను కాబట్టి"

పావని ఆశ్చర్యంగా చూసింది.

"ఎప్పుడూ? నాకు చెప్పలేదేం? " అంది.

"అసలెందుకు వెళ్ళావు? నీకూ ఏదన్నా వ్యాసం రాయాలనిపించిందా? " పావని అడిగింది.

"లేదు. ఒక భయంకరమైన అనుభవం అది"

"ఏంటో చెప్పరాదూ!"

"ఆర్నెల్లవుతోంది. నాకు డ్రెస్సుల పిచ్చి ఉందని నీకు తెలుసు కదా. యాభైకిపైన డ్రెస్సులున్నాయి నా దగ్గర. ఒకసారి పది డ్రెస్‌లు ఒకేసారి డ్రై వాష్‌కి వేశాను. ఎంత మంచివో తెలుసా. భలే బాగుండేవి. అవి డ్రైక్లీన్ షాప్‌నుంచి తెచ్చి డ్రాయింగ్ హాల్‌లో సోఫాలో పెట్టాను. ఇంతలో మా మమ్మీ పిలిస్తే కిచెన్‌లోకి వెళ్లాను. రెండు నిమిషాల్లో తిరిగి వచ్చాను. చూస్తే సోఫాల్లో నా డ్రెస్‌లు ఉన్న కవర్లు లేవు. అటు చూస్తే గేటుని తోసుకుని ఒక మనిషి పరుగెత్తుకుని వెళ్ళిపోతోంది. ఆమె భుజాన ఒక పెద్ద గోనెసంచీ. దానిలో చెత్తకుప్ప ల్లోంచి ఏరుకున్న వస్తువుల్ని వేసుకుంటుం దనుకుంటాను. అట్లాంటి వాళ్లు చాలా మంది కనిపిస్తూనే ఉంటారు" రుచిక ఊపిరి పీల్చుకోవటానికి కాబోలు ఆగింది. పావని శ్రద్ధగా వింటోంది.

"నేను ఆమె వెనక పరుగెత్తాను. కానీ అందుకోలేకపోయాను. వెనక్కు తిరిగి వచ్చి మమ్మీకి విషయం చెప్పాను. మా అంకుల్ ఒక పోలీస్ ఆఫీసర్ ఉన్నారులే. మమ్మీ ఆయనకి ఫోన్ చేసింది. ఆయన అది చేసిన మనిషి ఏ ఏరియాలో ఉంటారో అంతా చెప్పారు. అక్కడ ఉన్న మనుషులు అన్నిటికీ తెగించిన వాళ్లుట. ఇప్పుడు ఈ డ్రెస్సులకోసం వెళ్తే కత్తిపెట్టి పొడవటానికి కూడా వెనకాడరుట. ఒకవేళ హత్య చేసినా వాళ్ళకి పోయేదేంలేదు. జైలుకి వెళ్తే ఫ్రీగా తిండీ, వసతీ లభిస్తాయిట. అందుకని ఏంచేసేందుకైనా సిద్ధంగా ఉంటారుట. మా అంకుల్ మమ్మల్ని ఆ డ్రెస్సుల సంగతి మర్చిపోతే మంచిదని సలహా ఇచ్చారు. నేను మాత్రం అలా మర్చిపోలేక ఒకరోజు ఆ ప్రాంతంవైపు వెళ్లాను. అక్కడి మను షుల్ని చూస్తే భయంవేసింది. వెనక్కు తిరిగి వచ్చేశాను. వాళ్లు దేన్నికైనా వెనుదీయ రని అనిపించింది. పోనీ పోతే పోయాయి ఇకమీద జాగ్రత్తగా ఉండాలని నిర్ణయించు కుని బయటకు వచ్చేశాను" రుచిక చెప్పింది.

"అన్ని మురికివాడలూ అలాగే ఉంటాయా? "

"ఉండవు. ఇదొక్కటే అన్నిటిలోకీ ఘోరం అయిన స్లమ్ ఏరియా. మిగతాచోట్ల మామూలు బీదా బిక్కీ ఉంటారు. ఇక్కడ దేన్నికైనా తెగించిన వాళ్లుంటారు" రుచిక చెప్పింది.

"పర్వాలేదు. నాకన్నా నీకు లోకజ్ఞానం చాలా ఉంది. నాకెప్పుడూ ఇవి చెప్పనేలే

దేంటి? "

"చెపితే వినేస్థితిలో ఉండేదానివా? హర్ష సంగతి తప్ప మరోటి నీకు పట్టేది కాదు కదా" రోషిణి నవ్వుతూనే అంది.

పేపర్‌కి ఆర్టికల్ రాయటం అనేసరికి ఎవరూ ఇన్ఫర్మేషన్ సరిగ్గా ఇవ్వలేదు. 'మా గురించి పేపర్లో ఏదన్నా రాస్తావా?' అన్నట్లు అనుమానంగా చూస్తున్నారు. ఆఖరికి ఇంట్లో పనిమనిషి వెంకమ్మ కూడా సహకరించలేదు.

"మీరుండే పేట ఎలా ఉంటుంది వెంకమ్మా? " పావని అడిగింది.

"మా బస్తీ గురించి ఎందుకమ్మా? " వెంకమ్మ తిరిగి ప్రశ్నించింది.

"ఏంలేదు. వ్యాసం రాద్దామని"

"అంటే? "

"మీ బస్తీ గురించి పేపర్లో రాయాలని"

అంతే. వెంకమ్మ ఏమనుకుందో ఏమో గానీ ఆ తర్వాత నోరు తెరిచి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. ఎప్పుడూ పనిలోకి వచ్చిన దగ్గర్నుంచి తిరిగి వెళ్లేదాకా ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉండే వెంకమ్మ పావని పేపర్లో వ్యాసం రాస్తానని అనగానే సైలెన్స్ అయిపోయింది.

"నాకేం తెలుస్తాయమ్మా" అనేసి పని చూసుకోవటం మొదలు పెట్టింది.

వివరాలు సేకరించడానికి ఎంత కష్టపడాలో పావనికి అప్పుడు అర్థమైంది.

అయినా ఊరుకోలేదు. స్వయంగా బయల్దేరి వెళ్ళి మురికివాడల్ని కొన్నిటిని చూసింది. వాటిలో నివసిస్తున్న వాళ్ళ కష్టసుఖాలు అడిగి తెలుసుకుంది. కొన్ని ఫొటోలు తీసుకుంది. ఆఖరికి రుచిక భయపెట్టిన స్లమ్ ఏరియాకి కూడా వెళ్ళింది. కత్తులు పట్టుకుని తిరుగుతున్న మనుషుల్నీ, డ్రగ్స్ తీసుకుంటున్న పిల్లల్నీ, సిగరెట్లు తాగుతూ నిర్లక్ష్యంగా చూస్తున్న కుర్రకారునీ అందర్నీ చూసింది.

"వీళ్ళని ఇలా తయారుచేసింది ఎవరు? " అని వాళ్ళ గురించి రాసింది.

"మన సొంత మనుషులు చెడిపోతే ఎంతో బాధపడి వాళ్లని బాగుచేయాలని చూస్తాం. సమాజంలో అందరం ఒకే కుటుంబం. అంతా బాగుంటేనే మనం బాగుంటాం. మన తోటి మనుషుల కష్టాలు తెలుసుకుని వాళ్ళ చెడు అలవాట్లు పోగొట్టి, మనుషులుగా తీర్చిదిద్దాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరిమీదా ఉంది" అని రాసింది.

ఆ వ్యాసానికి కూడా మంచి రెస్పాన్స్ వచ్చింది.

"ఎలాగ మారిపోయావు పావనీ?" నువ్వు ఇలా మారిపోవటానికి కారణం ఏంటి? " అని కొందరు అడిగేశారు కూడా.

"ఏంటో... రోజులు ఎలా మారతాయో చెప్పలేం. నోట్లో వేలుపెడితే కొరకలేదు అనిపించేట్లు ఉండే పావని ఇలా మారిపోయింది. పిల్లలు ఎప్పుడెలా మారతారో చెప్పలేం. పదోక్లాసుదాకా అమోఘంగా చదివే పిల్లలు కొందరు ఇంటర్‌కి రాగానే చవటల్లా మారతారు. ఒకే స్టాండర్డ్ మెయిన్టైన్ చేసే వాళ్లు అరుదు" ఇంట్లో తల్లి స్నేహితులు కొందరు మీటింగ్ పెట్టుకుని ఏదో విషయాన్ని గురించి చర్చిస్తున్నారు.

పావని ఏదో చదువుకుంటోంది. అప్రయత్నంగానే ఆ మాటలు వచ్చి చెవిన పడుతున్నాయి.

"ఇంటర్‌లో బ్రహ్మాండంగా చదివిన వాళ్ళు డిగ్రీలోనో, ఇంజనీరింగ్‌లోనో చేరాక చదువు నిర్లక్ష్యం చేస్తారు"

"ఒక్క సంవత్సరంతోనో, ఒక్క చదువుతోనో మనం వాళ్ల స్టాండర్డ్ నిర్ణయించలేం. ఒక్కోసారి చదువు బాగా చదివిన వాళ్లు ఉద్యోగాల్లో చేరేసరికి అక్కడ నెగ్గుకురాలేకపోతారు"

ఒక్కొక్కళ్లూ మాట్లాడుతున్నవి వచ్చి చెవిన పడుతున్నాయి.

"అవును మరి. మన హర్ష సంగతి చూడరాదూ" ఒకావిడ దీర్ఘం తీసింది.

పావని ఉలిక్కిపడింది.

హర్షని పూర్తిగా మర్చిపోవాలని అతని సంగతులు కూడా ఎవరితో చర్చించటం లేదు. పక్కింట్లోనే ఉన్నా అతని వివరాలేవీ తెలియవు. పావని గట్టి విల్ పవర్ కూడగట్టుకుని అతని పేరు కూడా వినకుండా జాగ్రత్త పడుతోంది.

ఏమైంది హర్షకి? పావని గుండె కొట్టుకుపోతోంది.

"ఎవ్వరివైపూ తలెత్తి కూడా చూసేవాడు కాదు. అట్లాంటిది ఆ ప్రియాంకతో" ఒకావిడ గొంతు తగ్గించి చెపుతోంది.

"ఏమిటి..."

"అవును. అదంటే పడిచచ్చిపోతున్నాడుట. అదేమో పెద్ద పోజుపెట్టి తిరుగుతుంటుంది. వీడు దాసుడిలా దాని వెంట తిరుగుతుంటాడు. హాకీ తప్ప వాడికి ఇంకో లోకం లేదని అనుకునేవాళ్ళం కదూ. అన్నం నీళ్లూ అన్నీ వదిలేసి దాన్నే తలుచుకుంటూ ఉన్నాడుట. ఆట సంగతి కూడా పట్టించుకోవటం లేదనీ, మ్యాచ్‌ల సంగతి దేవుడెరుగు అసలు ప్రాక్టీసుకి కూడా పోవటంలేదనీ వాళ్ళ అమ్మ చెప్పింది"

"ఆ..."

పావని ఉలిక్కిపడింది.

గుండె వేగంగా కొట్టుకుంటోంది. కాస్త ప్రశాంతత చిక్కిందనుకున్న మనసు మళ్ళీ రాయివిసిరిన కల్లోల సరోవరంలా మారింది.

"నిజమా..."

"అవునా? నిజమేనా? "

"హర్ష ప్రియాంక వలలో పడ్డాడా? ప్రియాంక తన శపథం నెరవేర్చుకుందా? "

ఎన్నెన్నో ప్రశ్నలు.

ఏడుపు ఆగటంలేదు.

ఎందుకో ఒకసారి హర్షని చూడాలనిపించింది. ఎంత వెర్రికోరిక? చూసి ఏం చేయాలి? మర్చిపోవాలనుకున్న మనిషిని మళ్లీ చూడటంకన్నా పిచ్చిపని మరోటి ఉండదు. మళ్ళీ మనసు వికలమైపోతుంది. విహ్వాలమైపోతుంది. పాతి పెట్టిన ప్రేమ, కప్పి ఉంచిన ఆరాధన, నివురుగప్పిన నిప్పులా తన హృదయాంతరాళాలలో జ్వలిస్తున్న ప్రేమ, ఒక్కసారిగా ఉవ్వెత్తున ఉప్పెనకెరటంలా ఎగిరి దూసుకువచ్చి తనను మళ్లీ పిచ్చిదాన్ని చేసేస్తుందేమో?

ఎంతో విల్ పవర్ సాధించిందనుకుంటోంది తను. నిజానికి హర్షని చూడకుండా బతకటమే తనకు పెద్ద అచీవ్‌మెంట్. ఇంత కష్టపడి సాధించింది అతన్ని చూడగానే నిష్ఫలమై పోతుందేమో. నిజానికి పైపూతలా ఇవన్నీ పూసినా, తన మనసు అతన్ని మర్చిపోనేలేదు. అందుకే అతన్ని చూడటానికి తను భయపడుతోంది. ఎందుకు భయపడాలి?

మనసు కంట్రోల్ చేసుకోవాలంటే అతన్ని చూడాల్సిందే. చూడాలి. చూసి ఏమీ పట్టనట్లు అతని కళ్లల్లోకి నిర్లిప్తంగా చూడగలిగిన నాడు తన లక్ష్యం సాధించేసినట్లే.

హర్ష ఊళ్లోనే ఉన్నాడా లేదా?

ఎవరిని అడిగినా చెపుతారు. కానీ అడగాలనిపించలేదు. తనే తెలుసుకోవాలి.

హర్ష ఊళ్లో ఉంటే రోజూ ఎక్సర్‌సైజ్‌లు చేయటానికీ, స్విమ్మింగ్ చేయటానికీ "ప్లైజంట్‌డే" హోటల్‌కి వెళతాడు. అక్కడ జిమ్, స్విమ్మింగ్ పూల్ కూడా ఉన్నాయి. ఆ హోటల్‌లో హర్షకి మెంబర్‌షిప్ ఉంది. సాయంకాలాలు అక్కడ ఈత కొడతాడు.

మామూలుగా అయితే పావనికి ఒంటరిగా ఎక్కడికీ వెళ్లే ధైర్యంలేదు. ఇప్పుడు రెండు ఆర్టికల్స్ రాయగానే ఎక్కడికైనా వెళ్ళగల ధైర్యం, తెగువ వచ్చాయి.

ఆ సాయంత్రం 'ప్లైజంట్‌డే'కి వెళ్ళింది. హర్ష జిమ్‌లో లేడు. స్విమ్మింగ్ పూల్ దగ్గర కూడా లేడు.

మళ్ళీ జిమ్‌లోకి వెళ్ళింది,

అక్కడ అంతా ఎవరి ఎక్సర్‌సైజ్‌లు

వాళ్లు చేసుకుంటూ బిజీగా ఉన్నారు. పావని నేరుగా అక్కడి మేనేజర్ దగ్గరకు వెళ్ళింది.

"హాకీ ప్లేయర్ హర్ష... ఇక్కడికి రెగ్యుల ర్‌గా వస్తుంటాడు కదా" అంది.

"అవును. కానీ ఆ రోజులు పోయాయి" అన్నాడు అతను అదోలా మొహంపెట్టి.

"ఏమైంది? అతను రావటంలేదా?"

"లేదు"

"మరి?"

"ఇప్పుడతను రోజూ 'లౌలీగర్ల్' హోటల్‌కి వెళుతున్నాడు" అతను నవ్వుతూ చెప్పాడు.

"ఎక్కడుంది అది?" పావని అడిగింది.

"లౌలీగర్ల్ హోటల్ తెలీదా మీకు? అమ్మాయిలందరికీ బాగా తెలిసుండాలే? అక్కడ జిమ్‌కి బోలెడంతమంది అమ్మా యిలు వెళతారు. మిస్ ఆంధ్ర ప్రియాంక కూడా అక్కడి జిమ్‌కీ, స్విమ్మింగ్‌పూల్‌కీ రెగ్యులర్‌గా వెళుతుంటుంది. హర్ష ఆమెకి ఎస్కార్ట్"

"ఆ..." పావని నివ్వెరపోతూ అంది.

"అవును. ఇంతకీ మీరు?" అతను ఏదో అడగబోయాడు.

పావని ఇంకేం మాట్లాడకుండా గిరుక్కున వెనక్కు తిరిగింది.

ఆటో ఎక్కి 'లౌలీగర్ల్'కి వెళ్ళింది. అక్క డంతా ఖరీదైన వాతావరణం. పావనికి పూర్తి కొత్తగా ఉంది. వచ్చిన అమ్మాయి లంతా జీన్స్, టీషర్టులలో తప్ప రాలేదు. అంతా ఆపిల్ పళ్లలా చాలా అందంగా ఉన్నారు.

స్విమ్మింగ్ పూల్‌లోకి మెంబర్స్‌ని తప్ప రానివ్వరని చెప్పారు.

పావనికి ఏంచేయాలో తోచలేదు. ఒక మూల నిలబడి చూస్తూ ఉండిపోయింది.

ఇంతలో పావని దృష్టి మేడమెట్లు దిగి వస్తున్న జంటపై పడింది. పైన జిమ్, బార్‌లాంటివి ఉన్నాయి. ఆ జంట అక్కడి నుంచి వస్తున్నట్లున్నారు. అది ప్రియాంక, హర్షల జంట.

చేయీ చేయీ కలిపి నవ్వుతూ, తుళ్లుతూ వస్తున్నారు. పావని గుండె రగిలిపో యింది.

వాళ్లు పావనిని గమనించలేదు. పావని ఇక్కడికి వస్తుందని ఊహించలేదులా ఉంది. పావనిదాకా రాకుండానే మరో మలుపు తిరిగి వెళ్ళిపోయారు. అక్కడి నుంచి స్విమ్మింగ్ పూల్‌కి దారి ఉంది.

పావని అంత బాధలోనూ ఒక విషయం మాత్రం గమనించగలిగింది. హర్ష నార్మ ల్‌గా లేడు. తూలుతున్నట్లున్నాడు.

పైన బార్ ఉంది.

హర్ష తూలుతున్నాడు.

అంటే... హర్ష తాగుడు కూడా అలవాటు చేసుకున్నాడా?

పావనికి చేతులూ, కాళ్లూ ఆడటం లేదు.

వెనకాలే పరుగెత్తి 'హర్షా' అని అరవాల నిపించింది.

"అయ్యో! హర్ష తాగుతున్నాడా?" మనసు మరో పక్కనుంచి నిలదీస్తోంది.

"ఏం? నువ్వేగా ఇలా జరగాలనుకున్నది ఇప్పుడెందుకు బాధ?"

"లేదు... నాకు ఇది ఇష్టంలేదు. ఇలా జరగటం నేను భరించలేను" పావని తన మనసుకి చెప్పింది. కానీ ఆ మనసు విన లేదు.

"నువ్వు ఇలా జరగాలనే కదా ఛాలెంజ్ చేశావు?" అంతరాత్మ ప్రశ్నిస్తోంది.

"అయ్యో..." పావని కళ్లల్లో నీళ్లు తిరి గాయి. లేతగా ఉన్నప్పుడే దేన్నయినా తుంచేయాలి. ఈ అలవాటు ముదరక ముందే హర్షని రక్షించాలి.

"వద్దు హర్షా, ప్రియాంకని నమ్మకు. నిన్ను సర్వనాశనం చేయాలని వచ్చిన రాక్షసి అది" గట్టిగా ఏడుస్తూ, అరుస్తూ చెప్పాలనిపించింది.

అంతలోనే హర్ష తనని అవమానించిన

తీరు గుర్తు వచ్చింది.

"నీ కాళ్లదగ్గర కాస్త చోటిస్తే చాలు హర్షా" తను దీనంగా ప్రార్థించటం గుర్తువచ్చింది.

అతను ఎంత దారుణంగా అవమానించాడు.

"ఏమీ చేతకాని చవటవి" అతను అరవటం గుర్తు వచ్చింది.

పావని వ్యాసాలు బాగున్నాయని పేరు రావటంతో అహోబిలరావుకి ఆమెమీద నమ్మకం కుదిరింది.

వాళ్ల పత్రికకి ఇంటర్వ్యూలు నిర్వహించే విలేఖరి ఒకాయన మూడు నెలలు సెలవు పెట్టాడు. ఆయన పని ఒకాయనకి కొంతవరకూ అప్పగించారు. ఇంకా కొన్నికొన్ని ఇంటర్వ్యూలు చేసేందుకు అతనికి టైమ్ లేదు.

"ఎవరన్నా బాగా చేసే వాళ్ళుంటే వాళ్ల చేత చేయిద్దాం" అన్నాడాయన.

అహోబిలరావుకి వెంటనే పావని గుర్తు వచ్చింది. ఆమెకి ఫోన్‌చేసి పిలిపించాడు.

"కొందరు ప్రముఖులని ఇంటర్వ్యూ చేయాలి, చేయగలవా? " అడిగాడు.

"చేస్తాను" అంది పావని. ఈ పని చక్కగా పూర్తిచేస్తే బాగుంటుంది. చాలా మంచి అవకాశం.

"మ్యాగజైన్స్‌లో ఇంటర్వ్యూలు చదువుతుంటావా? " ఆయన అడిగాడు.

"ఈమధ్య చదువుతున్నాను"

"అయితే నీకు ఇంటర్వ్యూ ఎలా చేయాలో అర్థం అయే ఉంటుంది. ముందు నువ్వు ఇంటర్వ్యూ చేసేవ్యక్తి ఎవరో, ఏమిటో, ఏ రంగమో తెలుసుకోవాలి నువ్వు. ఆ రంగం గురించీ, ఆ వ్యక్తి గురించీ వివరాలు సేకరించాలి. ఆ తర్వాత నువ్వు అడగాల్సిన ప్రశ్నలు రాసుకో. ఆ వ్యక్తి పుట్టుక, ఎలా పెరిగారు ఆయా రంగంపట్ల ఆసక్తి ఎలా కలిగింది, అందులో ప్రవేశించటానికి వాళ్లు చేసిన ప్రయత్నాలు ఏమిటి, ఎంత కష్టపడ్డారు, ఈ స్థితికి రావటానికి వాళ్లు చేసిన కృషి ఏమిటి? ప్రస్తుతం వాళ్ళ స్థితి ఏమిటి, భవిష్యత్తు ప్రణాళికలేమిటి? వాళ్ల కుటుంబం గురించి చిన్న పరిచయం. ఇంతే... ఇంటర్వ్యూ ఎలా చేయాలి, ఏమేం ప్రశ్నలు వేయాలీ అని హార్డ్ అండ్ ఫాస్ట్ రూల్స్ ఏమీ ఉండవు. తోచినట్లు చేసుకుపోవటమే. ఇదుగో ఈ ఫైల్‌లో వివిధ వ్యక్తుల ఇంటర్వ్యూలు ఉన్నాయి. అన్నీ ఒకసారి చదువు. దానినిబట్టి ఇంకా బాగా చేయవచ్చేమో కూడా ఆలోచించు" అన్నాడు అహోబిలరావు.



పావని ఆ ఫైల్ అందుకుంది.

"ఈసారి బహుశా సినిమా నటుడు సూరిని ఇంటర్వ్యూ చేయాలనుకుంటాను" అన్నాడు అహోబిలరావు.

"చేస్తాను" అంది పావని.

★ ★ ★

సూరి గురించి ఇదివరకు రాసిన వ్యాసాలు చదివింది పావని. నల్ల కళ్లజోడు, జీన్‌ప్యాంట్, చెదిరిపోయిన జుట్టుతో నిర్లక్ష్యంగా కనిపిస్తాడు సూరి. ప్రతి ఫొటోలోనూ అదే అవతారం. సినిమాకి వేసుకునే

కాస్ట్యూమ్స్ తప్ప మిగతా అన్ని సమయాల్లో అదే అవతారం.

సూరికి క్రమశిక్షణ తక్కువేమో అనుకుంది. ఏముందీ వీళ్లకి బోలెడన్ని ఎఫైర్స్ ఉంటాయి. డ్రింకింగ్, స్మోకింగ్ తప్పనిసరిగా ఉంటాయి కాబోలు అనుకుంది. ఇంతకుముందు రాసిన ఏ ఆర్టికల్ లోనూ, ఇంటర్వ్యూలోనూ అతని పర్సనల్ వ్యవహారాలు ఏవీ డీప్‌గా లేవు. గాసిప్ రాసే పత్రికల్లో మాత్రం అతనికి లేని అలవాటు లేదని, అమ్మాయిలంటే పిచ్చి అనీ, తనని చూడ్డానికి వచ్చే అమ్మాయిల్ని కూడా టీజ్‌చేసి వాళ్ళని లోబర్చుకోవాలని ప్రయత్నిస్తాడనీ ఏవేవో రాశారు. అవన్నీ చదివాక అతన్ని ఇంటర్వ్యూ చేయాలంటేనే భయం వేసింది.

ఇట్లా భయపడితే ఇంకేం చేయగలం అని తననితాను మందలించుకుని అతనిని ఏమేం ప్రశ్నలడగాలో రాసుకుంది. పావనితోపాటు ఒక ఫొటోగ్రాఫర్ కూడా వచ్చాడు. పత్రిక వాళ్ళ కారులో బయలుదేరివెళ్ళారు.

షూటింగ్ జరిగే సమయంలోనే మధ్యమధ్యలో ప్రశ్నలడిగేందుకు పర్మిషన్ ఇచ్చాడు సూరి.

సినిమా షూటింగ్ అప్పుడే శ్రద్ధగా చూసింది పావని.

అంతా శ్రద్ధగా తమ పనిలో లీనమైపోతున్నారు. డైరెక్టర్ ఏయే షాట్ ఎలా తీయాలో సూచనలు ఇస్తున్నాడు. కెమేరామేన్ పైన ఎత్తుమీద క్రేన్‌లో కూర్చుని పొజిషన్ చూసుకుంటున్నాడు.

సినిమా షూటింగ్ అంటే గోలగా, అల్లరిగా ఉంటుందేమో అనుకుంది. కానీ ఎవరికివారు నిశ్శబ్దంగా, శ్రద్ధగా క్రమశిక్షణతో పనిచూసుకుంటున్నారు.

సీన్ వివరించాడు డైరెక్టర్. అతను చెపుతున్నదాన్ని శ్రద్ధగా వింటున్నారు నటులు.

"యాక్షన్" అనగానే అంతా ఒక్కసారిగా పరకాయ ప్రవేశం చేసినట్లు తమ తమ పాత్రల్లో ప్రవేశించేశారు.

సూరి మొదటి షాట్‌లోనే ఓ.కే. అనిపించాడు. అతను నటించిన సీన్ అయిపోయింది. మరో సీన్ చేసేందుకు టైమ్ పడుతుందిట. సెట్ బయట కుర్చీల్లో కూర్చుని ఇంటర్వ్యూకి ప్రారంభోత్సవం చేశాడు.

"టీ తాగుతారా" అడిగాడు మర్యాదగా.

"వద్దండీ"

"పోనీ కూల్‌డ్రింక్"

"వద్దు" పావని మెల్లగా అంది.

"ఓ.కే. మీ ప్రశ్నల వర్షం మొదలుపెట్టండి" అన్నాడు సీట్‌లో రిలాక్స్ అవుతూ.

పావనికి ఏంఅడగాలో తోచక తడుముకుంటూ, బ్యాగ్‌లోంచి పేపర్ తీసింది.

"ఇంటర్వ్యూలు చేయటం కొత్తా? " సూరి నవ్వుతూ అడిగాడు.

"అవును"

"తెలిసిపోతోంది. సరే. అడుగుతారా నేనే చెప్పుకుంటూ పోనా? " అన్నాడతను.

"అడుగుతాను. అవునూ మీరు ఈ రంగంలో ప్రవేశించాలని ఎందుకు అనుకున్నారు? మీకు ఎప్పుడు ఎలా ఆసక్తి కలిగింది? " అడిగింది పావని.

"సినిమా హీరో కావాలని ఎవరనుకోరు? అలాగే నేనూ అనుకున్నాను. ఇంటర్‌లో కాలేజీ ఎగ్గొట్టి సినిమాలు చూసేవాడిని. ఇంట్లో బాగా తిట్టేవాళ్లు. నేను కేర్ చేసేవాడిని కాదు. చివరికి ఇంట్లోంచి వెళ్ళగొట్టే లెవెల్ వచ్చేసింది. వాళ్ళ తప్పేంలేదులెండి. నా మార్కులు చూస్తే ఎవరైనా ఆ పనే చేసేవాళ్ళు. మాకు ఈ సినిమారంగంలో తెలిసినవాళ్లెవరూ లేరు. ఎలాంటి బ్యాకింగ్ లేదు. సపోర్ట్ లేదు. ఈ సినిమా గోల మనకెందుకు, ఏదన్నా ఉద్యోగం చూసుకో అని మా ఇంట్లో పోరు. మా నాన్నగారు నన్ను ఇంట్లోనుంచి తరిమేస్తానని అరిచారు. వాళ్ళు తరమటం దేనికీ, నేనే వెళ్ళిపోతానని బయల్దేరాను. వెనకనుంచి వెధవా సర్వనాశనమైపోతావురా. వెనక్కి

తగలడు' అని మా నాన్నగారు అరిచారు. 'ఇంక వెనక్కు తిరిగేది లేదు. చావో, బతుకో ఆ సినిమారంగంలోనే' అని అరిచి బయల్దేరాను. ఛాలెంజ్ చేసినప్పుడు నాకు అందులో కష్టసుఖాలు తెలియవు. ఏదో ఛాలెంజ్ అయితే చేసేశానుగానీ అసలు సినిమా ఫీల్డ్ అంటే కూడా తెలీదు" సూరి చెపుతుంటే పావని వింటోంది.

ఇంటర్వ్యూని టేప్ చేయాలని అహోబల రావు చెప్పాడు. కానీ సూరి టేప్ రికార్డర్ ఆన్ చెయ్యనివ్వలేదు.

"నేను ఏదో ప్రైవేట్ టాక్‌లా మాట్లాడే స్తాను. అందులో కావల్సినవి మాత్రం మీరు రాసుకోండి. చాలు" అన్నాడు.

"ఆ తర్వాత మద్రాసు బండెక్కాను. మద్రాసులో దిగాక పరిస్థితులు అర్థం అవటం మొదలుపెట్టాయి. నాకు ఎవరూ తెలియదు. ముఖ్యంగా చేతిలో డబ్బులేదు. ఇంటికి రాస్తే పంపిస్తారుగానీ రాయబుద్ధి కాలేదు. ఎవరూ సాయం చేసేందుకులేరు. వేషాల సంగతి తర్వాత. ముందు ఫుడ్ ఎలాగ? ఎక్కడ ఉండాలి? ఏంచేయాలి? అంతా అయోమయం. చివరికి ఒక హోటల్లో సర్వరు నన్ను చూసి జాలిపడి తన ఇంట్లో ఉండనిచ్చాడు. తన హోటల్లోనే నాకు పార్ట్ టైమ్ ఉద్యోగం లెక్కలు రాసే పని ఇప్పించాడు. అది నాకు తెలీని పని. పట్టుదలతో నేర్చుకున్నాను. రోజూ రెండు గంటలపాటు ఆ పని ఉండేది. అది చేసేసి సినిమా కంపెనీల చుట్టూ తిరగటం మొద లుపెట్టాను. అప్పుడు అర్థమైంది నాకు. నటనలో ఓనమాలు కూడా రావు. ఏం చేయగలవు అని అడిగేవాళ్ళు. నటన ఎవ రన్నా చేస్తే చూసి ఆనందించి, మనమూ అలా నటించాలనుకోవటం వేరు, అసలు నిజంగా నటించటం వేరు. నిజంగా నటిం చాల్సినప్పుడే అసలు సంగతి బయటపడు తుంది. మనలో టాలెంట్ ఉందో లేదో అప్పుడే తెలుస్తుంది. నాకు నటన రాదు. అసలు నిర్మాతల, దర్శకులను కలుసుకోవ టానికే నాలాటి సామన్యులు బోలెడంత కష్టపడాలి. చచ్చీ చెడీ వాళ్ళను కలుసుకోగ లిగినా, వాళ్ళు నన్ను నటించి చూపమనేస రికి ఏమీ చేయలేకపోయేవాడిని. అదే సమ యంలో నాలాటివాళ్ళే కొందరు వచ్చి చక్కగా అభినయించి చూపేవాళ్ళు. అప్పుడు నాకు లోకంలో బోలెడంత టాలెంట్ ఉందని అర్థమైంది. 'నటన నేర్చు కున్నాక మళ్ళీ రా' అని నన్ను తిప్పి పంపే శాక నేను సీరియస్‌గా ఆలోచించాను. ఏంచేయాలి? నాలాంటివాళ్ళు ఫిల్మ్ ఇన్‌స్టి ట్యూట్‌లో చేరితే మంచిదనిపించింది. సహ జంగా నటన అబ్బినవాళ్ళు కొందరు. టాలెంట్‌ని వెలికితీసి మెరుగుపెట్టే ఫిల్మ్ ఇన్‌స్టిట్యూల్‌లాంటి వాటిలో చేరితే నాలాంటి వాళ్ళకు మంచిది. పైసా పైసా కూడబెట్టి, ఇంకోచోట ఎక్స్‌ట్రా పనిచేసి ఇన్ స్టిట్యూట్ ఫీజు కట్టాను. వాళ్ళు నాకు ఎన్నో నేర్పించారు. ఏ రసం ఎలా అభిన యించాలో, ఏ డైలాగ్ ఎలా పలకాలో, ఏ ఎక్స్‌ప్రెషన్ ఎలా ఇవ్వాలో, ఏ పాత్రని ఎలా పోషించాలో నేర్పారు. నేను పట్టుద లతో, శ్రద్ధతో నేర్చుకున్నాను. వాళ్ళు మా నటన కొన్ని సీన్లు వీడియో తీసి, మళ్ళీ మాకు చూపించేవాళ్ళు. అందువల్ల మా లోపాలు మాకే తెలిసిపోయి సరిదిద్దుకునే వాళ్ళం. ఇంట్లో కూడా అద్దంముందు నటిస్తూ ప్రాక్టీసు చేస్తూనే ఉండేవాడిని. ఎట్లాగైనా నటుడిని కావాలి. ఇంట్లో వాళ్ళ ముందు ఛాలెంజ్ చేశాను. నా సత్తా ఏమిటో చూపించాలి. అంతే. దృఢనిశ్చ యంతో, దీక్షగా ఒక తపస్సులా నటన నేర్చుకున్నాను. మా ఇన్‌స్టిట్యూట్‌లో విద్యా ర్థులు ప్రదర్శించిన ఒక నాటకానికి దర్శ కులు సురేంద్రమోహన్ హాజరయ్యారు. ఆయన నా నటన బాగుందని ఒక విలన్ పాత్ర ఇచ్చారు. ఎంతో కష్టపడి దాన్ని జాగ్ర త్తగా పోషించాను. ఆ సినిమా హిట్

అయింది. అక్కడినుంచి రెండు సినిమాల్లో విలన్‌గా వేశాను. ఆ తర్వాత హఠాత్తుగా ఒక నిర్మాత హీరో పోర్షన్ ఇచ్చారు. ఆ సినిమా హిట్ అయి నాకు మంచి పేరు వచ్చింది. ఆ తర్వాత ఇక వెనక్కు తిరిగి చూడలేదు" సూరి చెప్పాడు.

ఇంతలో అతనికి షాట్‌కి పిలుపు వచ్చింది.

"చాలాసేపు అవుతుందేమో. మీరు మరి వెయిట్ చేయగలరా? " సూరి అడిగాడు.

"చేస్తాము. మీ ఇంటర్వ్యూ దొరకటమే మాకు కష్టం" పావని చెప్పకముందే ఫొటోగ్రాఫర్ కల్పించుకుని చెప్పాడు.

సూరి నవ్వేసి వెళ్ళిపోయాడు.

పావని లోపలకు వెళ్లి వాళ్ళు తీస్తున్న సీన్‌ని చూస్తూ నిలబడింది. ఎంతో క్లిష్టమైన సీన్‌ని సూరి అవలీలగా అభినయించేస్తున్నాడు.

కాసేపు చూసి బయటకు వచ్చింది.

"మేడమ్. మీకు సూరిగారు బాగా తెలుసా? " ఎవరో అడిగారు.

"లేదు. ఎందుకని అడుగుతున్నారు? " పావని ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఆయన ఇంతసేపు ఎవరితో మాట్లాడరు. అందుకని మీకు బాగా తెలుసేమో అనుకున్నాను" అన్నాడతను.

ఇంతకీ ఈయన ఎవరు? ఏ గాసిప్ మేగజైన్‌లో విలేఖరి కాదుకదా? అతనివైపు అనుమానంనిండిన కళ్ళతో అప్రయత్నంగానే చూడటం గమనించి అతను చిరునవ్వు నవ్వాడు.

పావనికి కూడా నవ్వు వచ్చింది.

సూరికి అతను బాగా తెలుసులా ఉంది. షాట్‌నుంచి తిరిగివచ్చాక అతన్ని పలకరించాడు.

"ఏంటి సార్. చాలా విషయాలు చెపుతున్నారు" అతను నవ్వుతూ అన్నాడు.

"ఈ అమ్మాయి అహోబలరావుగారికి బంధువు" అన్నాడు సూరి తనూ నవ్వుతూ.

అహోబలరావు సూరి సినిమా ఫీల్డుకి వచ్చిన కొత్తల్లో చాలా పబ్లిసిటీ ఇచ్చారుట. అందుకని ఆయనంటే తనకు ప్రత్యేకంగా అభిమానం ఉందని చెప్పాడు సూరి.

ఆ తర్వాత అతనితో మాట్లాడటం పావనికి కుదరలేదు. అతన్ని కలుసుకోవాలని చాలామంది అభిమానులు వచ్చారు. సెల్‌ఫోన్‌లో ఎవరెవరితోనో ఏదో మాట్లాడుతున్నాడు.

ఆరోజుకి షూటింగ్ ముగిసింది.

ఇంటర్వ్యూ మాత్రం మొదలు కూడా కాలేదు. అతను చెప్పిన విషయాలు క్లుప్తంగా రాసుకుంటే పరిచయ వాక్యాలుగా సరిపోతాయి. అంతే.

పావని అడగాల్సిన ప్రశ్నలు చాలా ఉన్నాయి.

"మీరు నాతో రండి. నేను ఇప్పుడు ఒక ప్రారంభోత్సవానికి వెళ్ళాలి. కార్లో మాట్లాడుకోవచ్చు" అన్నాడు సూరి.

ఫొటోగ్రాఫర్ తనకు కావల్సిన పోజుల్లో ఫొటోలు తీసుకున్నాడు.

"నేను వెళ్ళిపోతాను. మీరు ఇంటర్వ్యూ ముగించుకుని వచ్చేయండి" అన్నాడు పావనితో.

"సరే" అంది పావని.

అతనితో కార్లో వెళుతుంటే పావనికి అంతా కొత్తగా అనిపించింది. ఇద్దరు బాడీ గార్డులు కూడా ఎక్కారు. అది చాలా పెద్ద కారు. అంతా ఆరాధనగా సూరివైపు చూస్తున్నారు. నల్లటి అద్దాలు దించి ఉండటంవల్ల లోపల ఎవరున్నారో తెలియకపోయినా ఎవరో ప్రముఖులు అయిఉంటారని ఆ ఖరీదైన కారునీ, వెనక ఎస్కార్టుగా వస్తున్న కారునీ చూసి కనిపెట్టేయవచ్చు

"అయితే మీరు చదివింది ఇంటర్ మాత్రమేనా? " అడిగింది పావని.

"అక్కడే పప్పులో కాలేశారు. నేను ఇంటర్ చదువుతూ ఇంట్లోంచి పారిపోయినా ఆ తర్వాత బాగానే చదువుకున్నాను.

ప్రైవేట్‌గా ఎం.ఏ. చదివాను. కంప్యూటర్ కోర్సులు కూడా చేశాను" నవ్వేశాడు సూరి.

"మరి మీకు టైమ్ దొరుకుతుందా? "

"ఆసక్తి ఉంటే దేన్నికైనా సమయం అడ్డం కాదు. 'రోజుకి ఇరవైనాలుగు గంటలు, వాడుకో, మానుకో' అన్నాడు శ్రీశ్రీ" సూరి నవ్వుతూ అన్నాడు.

"మీరు ఎన్ని గంటలకి లేస్తారు? " పావని అడిగింది.

"మీరు ఒకపని చేస్తే బాగుంటుంది. నేను రోజూ తెల్లవారుజామున నాలుగు గంటలకు లేస్తాను. మీరు ఆ టైమ్‌కల్లా మా ఇంటికి వచ్చేయండి. అప్పుడు మీరు పొద్దున్న ఎన్ని గంటలకు లేస్తారు? లేచాక ఏంచేస్తారు? ఆ తర్వాత ప్రోగ్రాం ఏమిటి? మధ్యాహ్నాం ఏమి తింటారు. సాయంత్రం ఏంచేస్తారు? రాత్రి ఎన్ని గంటలకు నిద్రపో తారు? ఇలాంటి ప్రశ్నలు వేసే అవసరం ఉండదు. డైలీ లైఫ్‌లో నేను ఏమేం చేస్తానో అవన్నీ మీరు ప్రత్యక్షంగా చూసి రాసుకో వచ్చు మీరు వేరే ఏమన్నా అడగాలంటే అడగండి" అన్నాడు సూరి.

"మీరు చెప్పింది బాగుంది. అప్పుడే మీకు ఖాళీ ఉంటే ప్రశ్నలడుగుతాను" అంది పావని. ఇంటికి తిరిగివచ్చింది. మర్నాడు తెల్లవారుజామున నాలుగు గంటలకల్లా పావని సూరి ఇంటికి వెళ్ళింది. సూరి అప్పుడు లేచి ఎక్సర్‌సైజ్‌లు చేస్తున్నాడు. ఒక గంటసేపు ఎక్సర్‌సైజ్ పూర్తయ్యాక కాసేపు ఆరోజు షూటింగ్‌లోని సీన్లు ఏమేం ఉంటాయో చూసుకున్నాడు. స్నానంచేసి, పూజ చేసుకుని, రెండు చపాతీలూ, కాఫీ బ్రేక్‌ఫాస్ట్ చేశాడు. ఆ తర్వాత పిల్లలతో, కుటుంబసభ్యులతో కాలక్షేపం చేశాడు. తర్వాత ఏడుగంటలకల్లా షూటింగ్ స్పాట్‌లో ఉన్నాడు.

షూటింగ్ నిర్విరామంగా జరుగుతూనే ఉంది. మధ్యాహ్నాం లంచ్, సాయంత్రం టీ, బిస్కెట్స్. అతను షూటింగ్ పూర్తయ్యాక ఇంటికి వచ్చేసరికి పదకొండు దాటింది.

"ఎండలో, వానలో, చలిలో ఎలా ఉన్నా షూటింగ్ చెయ్యాలి. క్లిష్టమైన షాట్స్ కూడా రిస్క్ తీసుకుని చేస్తుంటాం" చెప్పాడు సూరి.

"వేషాలు రానంతవరకూ ఒక బాధ. వచ్చాక ఫ్రీడమ్ ఉండదు. ఒకవేళ ఆరోగ్యం బాగా లేకపోయినా షూటింగ్‌కి వెళ్ళా ల్సిందే. ఎంతో ఖర్చుతో బోలెడంతమంది టీమ్‌వర్క్‌తో జరిగేపని అది. దాన్ని అలా వదిలేయడానికి లేదు. ఎంతో కష్టపడి ప్లాన్ చేస్తారుకదా. షెడ్యూల్ ప్రకారం వెళ్ళితీ రాలి. లేకపోతే నిర్మాత లక్షల్లో నష్టపో తాడు. మనకి పేరు పోతుంది. ట్రబుల్ సమ్ ఫెలో అని పేరు వస్తే గనక ఎవ్వరూ మనల్ని తీసుకోవటానికి ముందుకి రారు. అది ఒక ఎత్తు. ఎప్పటికప్పుడు ప్రేక్షకుల్ని ఎంటర్‌టైన్ చేయగలగాలి. బోర్ కొట్టించ కూడదు. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడు కుంటూ, గ్లామర్ తగ్గకుండా చూసుకుంటూ ఎప్పటికప్పుడు నటనలో కొత్తదనం చూపిం చగలగాలి. ఇవన్నీ చేయాలంటే ఎంతో క్రమశిక్షణ ఉండాలి. అప్పుడే గొప్ప నటు లుగా సక్సెస్ అవగలుగుతారు" సూరి భార్య చెప్పింది.

పిల్లల గురించి ఆవిడే శ్రద్ధ తీసుకుని, వాళ్ళకి కావల్సినవన్నీ చూసుకుంటుందిట.

"నా అదృష్టం. ఆవిడ సమర్థురాలు. అన్నీ చూసుకుంటుంది. నేను నా నటన, వేషాల గురించి చూసుకుంటే చాలు. ఆమె మిగిలినవన్నీ చూసుకుని నన్ను నిశ్చింతగా ఉండేట్లు చేస్తుంది" సూరి భార్య గురించి చెప్పాడు.

పావనికి ఇదంతా ఆశ్చర్యంగా ఉంది. ఏదో సినిమా హీరో అంటే జల్సాగా తిరు గుతూ, జాలీగా గడిపేస్తారనుకుందిగానీ ఇన్ని గంటలు పనిచేస్తారనీ, ఇంత కష్టపడి తమ స్థానాన్ని కాపాడుకునేందుకు కృషి చేస్తారనీ పావనికి తెలీదు.

సూరి తన ఇష్టాలు, హాబీలు చెప్పాడు. అన్నీ కూర్చి పావని ఒక అందమైన ఇంటర్వ్యూ తయారుచేసింది.

స్వయంకృషితో ఏవిధమైన బ్యాకింగ్ లేకుండా అందాల హీరోగా స్థానం నిలుపుకున్న అద్భుత నటుడు... అంటూ మొదలుపెట్టిన వ్యాసంలో క్లుప్తంగా అతను సినిమా నటుడవటానికి చేసిన కృషి, అతని ఇష్టాలు రాసింది. సూరి వివిధ ఫోజుల్లో దిగిన ఫొటోల కింద అందమైన వ్యాఖ్యలు రాసింది.

ఆ పత్రిక బాగా అమ్ముడుపోయింది. మార్కెట్‌లో రిలీజైనరోజే కాపీలన్నీ అమ్ముడుపోయాయి. సూరి అందంగా దిగిన ఫొటోల్ని అభిమానులు కట్‌చేసి దాచుకున్నారు.

ఈసారి ఇంటర్వ్యూ ఒక ఫొటోగ్రాఫర్‌ది. అతనికి ఫొటోగ్రఫీలో మంచి పేరుంది. కొన్ని ఫొటోలకి బహుమతి కూడా వచ్చాయి.

పావని దగ్గర ఒక కెమేరా ఉంది. అది చిన్న కెమేరా. దేన్నయినా మామూలుగా క్లిక్ చేసే కెమేరా. పవర్‌ఫుల్ కెమేరాల గురించి, లెన్స్ గురించి చదివాకగానీ పావనికి ఫొటోలు తీయటం ఎంత కష్టమో అర్థం కాలేదు. మామూలు కెమేరాలో ఏదో ఒకటి తీసి పారేయవచ్చు. కొద్దిగా ఫొటోగ్రఫీ నేర్చుకుని, వీడియో కెమేరాలో కూడా షూట్ చేస్తున్నవాళ్ళున్నారు. అది వేరే సంగతి.

"ప్రతి వాళ్ళకీ తాము చాలా అందంగా ఉంటామన్న అభిప్రాయం ఉంటుంది. ఫొటో బాగా లేకపోతే ఊరుకోరు. నువ్వు బాగా తీయలేదని పోట్లాడతారుగానీ అసలు మనం ఎలా ఉన్నాం అని అద్దంలో చూసుకోరు. వాళ్ళ మొహం ఎలా ఉందో అలా పడుతుందిగానీ వేరేవాళ్ళ మొహం తెచ్చి పెట్టలేంకదా" అన్నాడు ఒక ఫొటోగ్రాఫర్.

అందుకే ఫిల్టర్లు వాడి లైటింగ్ ఎక్కువ చేసి ఎలాగో మొహంలో లోపాలు మరీ కొట్టవచ్చేట్లు కనబడకుండా జాగ్రత్తపడతాం" అని కూడా అన్నాడు.

మామూలు ఫొటోగ్రాఫర్ల కష్టాలు అవి. "ముఖ్యంగా ఈ రంగంలో చాలా ఓపిక ఉండాలి. ప్రత్యేకమైన ఫొటోలు, మోడలింగ్ చేసేవాళ్ళకు ఫొటోలు తీసేటప్పుడు చాలా కష్టపడాలి. ఇక జంతువుల్ని ఫొటో తీయాలంటే అదొక భగీరథ ప్రయత్నం అనుకోవాలి. మరీ ట్రెయిన్డ్ యానిమల్స్ అయితే తప్ప సాధారణ జంతువులు మన మాట వినవు. మనకు కావల్సిన పోజు అవి ఇచ్చేంతవరకూ ఓపిక పట్టాల్సిందే. ఫొటోగ్రఫీ



హాబీగా చాలా బాగుంటుంది. కానీ ఖరీదైన హాబీ"

"ఇక సినిమా ఫొటోగ్రఫీ అయితే చెప్ప క్కర్లేదు. ఎఫెక్టివ్‌గా ఉండాలంటే చాలా కష్టపడాలి"

లైట్ అండ్ షేడ్ ఎఫెక్ట్‌లూ, యాంగిల్స్ అన్నిటి గురించీ శ్రద్ధ తీసుకుని తీస్తే తప్ప ఒక మంచి ఫొటో రాదు.

పావని ఇంటర్వ్యూ చేసిన ఫొటోగ్రాఫర్ తన అనుభవాలు చెప్పాడు. చిన్న డబ్బా కెమేరాతో మొదలుపెట్టిన అతను చివరికి ప్రైజ్‌లు తెచ్చుకునే స్థాయికి ఎదగటానికి ఎంత కష్టపడాల్సివచ్చిందో వివరించాడు. ఎంత ఓపికతో, సహనంతో ఫొటోలు తీశాడో వివరించాడు. బహుమతి వచ్చిన ఫొటోల్ని చూపించి వాటికి ఎందుకు బహుమతి వచ్చిందో కూడా చెప్పాడు.

అట్లాగే ఒక తబలా విద్వాంసుడిని ఇంటర్వ్యూ చేసింది. ఆయన ఉత్తరప్రదేశ్‌లో ఒక గొప్ప విద్వాంసుడి దగ్గర శిష్యరికం చేసి, ఇంకా ఎందరెందరి దగ్గరో చాలా నేర్చుకున్నాడుట. విదేశాల్లో కూడా ఎన్నో ప్రోగ్రాంలు ఇచ్చారుట. ఆయనకి ఎన్నో బహుమతులు వచ్చాయి. చాలా చాలా పేరుంది.

"ఇప్పటికీ రోజూ కొన్ని గంటలు ప్రాక్టీస్



చేస్తాను" అన్నాడాయన. ఆయనకిచ్చిన బిరుదులూ, బహుమతులూ అన్నిటి గురించి చెప్పాడు. తన శిష్యుల గురించి, తన గురువుల గురించి కూడా చెప్పాడు.

"నా ప్రోగ్రాం ఉంది సాయంత్రం. మీరు రండి. మీరు ప్రత్యక్షంగా చూస్తే బాగుంటుంది" అన్నాడు.

సాయంకాలం ఆయన ప్రోగ్రాంకి వెళ్ళింది పావని.

ఆయనకున్న అభిమానుల్నీ, ఆయన విద్వత్తునీ ప్రత్యక్షంగా చూసింది.

అద్భుతంగా వాయించాడు ఆయన. వర్షం పడుతున్నట్లు, ఇంకా కొన్ని శబ్దాలు కూడా చివరికి వాయించాడు.

ప్రేక్షకులు చప్పట్ల వాన కురిపించారు. చాలాసేపు అట్లాగే చప్పట్లు కొడుతూ ఉండిపోయారు.

ఆ ధ్వనుల్లో, ఆయన తబలా వాద్యంలో మనస్సునీ, ఆత్మనీ కూడా రంజింపచేశాడు అనిపించింది పావనికి. ఆ చప్పట్ల వర్షంలో తనూ తడిసిపోతున్నట్లు అనిపించింది.

సంగీతంలో ఉన్న గొప్ప శక్తి అదే కాబోలు. భాష రాకపోయినా 'భావం' తెలియకపోయినా మనసుని రంజింపజేయగల గటం సంగీతానికే సాధ్యం.

ఆ తబలా వాద్యం ఇంకా చెవుల్లో మారు మోగుతూనే ఉంది. ఎంత శ్రమపడి, ఎంత దీక్షగా ఆయన ఈ స్థితికి చేరాడో ఊహించుకుంటే ఆశ్చర్యం కలిగింది.

సింహనాదం గురూజీని ఇంటర్వ్యూ చేసింది పావని.

పత్రికలో అన్నిరకాల వాళ్ళ ఇంటర్వ్యూలు వేస్తున్నారు. పనిలోపనిగా స్వామీజీలు, బాబాలులాంటివాళ్ళని కూడా ఇంటర్వ్యూ చేస్తున్నారు.

పెద్ద హాల్‌లో మెత్తటి పరుపుమీద సుఖాసీనులై ఉన్నారు గురూజీ.

పావనిని చూసి ఆప్యాయంగా, ప్రేమగా ఆహ్వానించాడు ఆయన.

"కూర్చోమ్మా" అన్నాడు తన ఎదురుగా ఉన్న తివాసీని చూపిస్తూ.

పావని గదంతా ఒక్కసారి చూసింది. ఒక మూల శివుడి పటం, ఇంకోమూల శ్రీకృష్ణుడి విశ్వరూప దర్శనం ఉన్నాయి. వాటికి వేసిన లిల్లీపూలు ఎంత ఫ్రెష్‌గా ఉన్నాయంటే గదంతా వాటి వాసనతో నిండిపోయి ఉంది. వాటి మధ్యలో చాలా పెద్ద ఇత్తడి ఫ్లవర్‌వేజ్, చక్కటి పనితో చేసినది, బంగారంలా మిలమిలా మెరుస్తోంది. అందులో అందమైన తెలుపు, ఎరుపు గులాబీపూలు వత్తుగా అమర్చబడి అందాలొలికిస్తున్నాయి. గోడలు నున్నగా, మెత్తగా మెరిసిపోతున్నాయి. ఖరీదైన పాలరాయి గచ్చు మేలిరకం టేకు తలుపులూ, కిటికీలూ, వాటికి అమర్చిన అందమైన డిజైన్‌తో ఉన్న అద్దాలు. గదంతా ఖరీదైన, ప్రశాంత వాతావరణం. ఒకమూల ఉన్న స్టాండ్‌లో సాంబ్రాణి ధూపంలాంటిది ఆహ్లాదకరమైన పరిమళాన్ని అందిస్తోంది.

"ఏమిటమ్మా చూస్తున్నావు?" మృదువుగా అడిగాడు ఆయన.

"భక్తికీ, ఆధ్యాత్మికతకూ కూడా ఇన్ని హంగులూ షో ఉండాలంటారా?" అడిగింది పావని.

"పరిసరాలూ, శరీరమూ శుభ్రంగా ఉన్నప్పుడు మనసు ప్రశాంతంగా ఉంటుంది. ప్రశాంతంగా ఉంటేనే ధ్యానంలో మనసు నిలుస్తుంది సామాన్యులకి"

పావని మౌనంగా ఉండిపోయింది.

టేప్‌రికార్డర్ ఆన్ చేసింది. ఇంటర్వ్యూ ప్రారంభం అయింది.

"ముందు నువ్వు ఆ పదాన్ని వెనక్కి తీసుకోవాలమ్మా. ఆధ్యాత్మికత అన్నది రంగం కాదు. ఇదొక మార్గం. కానీ ఈ రోజుల్లో దీన్ని కూడా ఒక రంగంగా మార్చేశారు కొందరు. విద్యారంగం, వ్యాపార రంగం, సినిమా రంగం, రాజకీయ రంగం ఇలా ఆధ్యాత్మికత కూడా ఒక రంగం అయి

పోయింది. ఏమీ తెలియనివాళ్ళూ, నాలుగు డబ్బులు సులువుగా సంపాదించాలనుకునే వాళ్ళూ అంతా ఈ రంగంలో ప్రవేశిస్తున్నారు. అందుకే భక్తి కూడా వ్యాపారం అయిపోయింది. నిజమైన జిజ్ఞాసులు కరువైపోయారు. శిష్యులలో కల్తీ ఏర్పడినట్లే గురువుల్లోనూ కల్తీ ఏర్పడింది. చాలామంది ఆధ్యాత్మిక గురువులు రంగప్రవేశం చేయటంవల్ల శిష్యులకి కూడా గురువుల సప్లై ఎక్కువగా ఉండటంవల్ల ఒకరి తర్వాత మరొకరి దగ్గరకుపోతూ, నిలకడగా ఎవరి దగ్గరా ఉండటం లేదు. తమకి నచ్చిన గురువు, అంటే తమ భావాలకి తగినట్లుగా మాట్లాడే గురువు దొరికాక అతని దగ్గర సెటిల్ అవుతున్నారు. అబద్ధాలాడటం తప్పు అని నేనంటాను. సమయానుకూలంగా, ప్రాణ విత్త మాన భంగమందు బొంకవచ్చునని పెద్దలు అన్నారు. అవసరార్థం అబద్ధాలు ఆడినా తప్పులేదని మరొక గురువంటాడు. ఎవరికివాళ్ళు జనానికి వీలుగా శాస్త్రాలు తిరగరాసి తమ సొంత వివరణ ఇచ్చేస్తున్నారు. అన్నీ లిబరల్‌గా ఆమోదించే గురువుకి జనాదరణ, ధన లాభం దొరుకుతాయి. ఆధ్యాత్మికత అనేది రంగం కాదు. అది ఒక మార్గం. అంతే. ఆ మార్గాన ప్రయాణించటం చాలా కష్టం" అన్నాడు గురూజీ.

"ఇంతకీ తమరి మనసు ఆధ్యాత్మిక మార్గంవైపు ఎలా మళ్ళింది? " అడిగింది పావని.

"అది నాకు జన్మతః వచ్చింది. యాపిల్ పండు నేలమీద పడటం అప్పటికి కొన్ని కోట్లమంది చూసి ఉంటారు. కానీ న్యూటన్ మహాశయుడొక్కడికే అది పడటం చూసి ఎందుకలా పడిందని ప్రశ్నించుకుని, భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని కనిపెట్టే బుద్ధి పుట్టింది. అదే ఇంకొకడెవడైనా అయితే యాపిల్‌పండు కిందపడగానే గుటుక్కున దాన్ని తినేస్తాడు కానీ అది ఎందుకు పడిందీ, ఎలా పడిందీ అని ఆలోచించడు. అలాగే నాకూ ఆధ్యాత్మికత అనేది పుట్టినప్పటి నుంచీ పుట్టక ముందునుంచీ అలవడింది"

"అంటే అసలు మొదటిసారి..."

"మొదటిసారీ, చివరిసారీ అని లేదు. నేను ఎన్నడూ ఇహం గురించి ఆలోచించలేదు. చిన్నప్పుడు పాలు కూడా తాగకుండా ఏదో ఆలోచిస్తూ ఉండిపోయేవాడినిట"

"అప్పుడు? "

"అప్పుడే మా తల్లితండ్రులకి అర్థమైపోయిందిట. నాకు చదువు నేర్పిన గురువులు కూడా నా పంథా చూసి నా మార్గం భక్తి మార్గమేనని తెలుసుకున్నారు. నాకు చిన్నప్పటి నుంచీ ఈ ప్రపంచం ఏమిటి? ఎలా పుట్టింది? దీని సృష్టికర్త ఎవరు? ఈ అద్భుతమైన విశ్వచిత్రాన్ని రచించిన ఆ మహా చిత్రకారుడెవరు? అనే ప్రశ్నలుండేవి. వాటికి సమాధానం వెతుక్కుంటూ అడవుల్లోకి వెళ్ళిపోయాను" అన్నారు సింహనాదం గురూజీ.

"నేను ఎంతోమందికి శుశ్రూష చేశాను. నా గురువులంతా నాకు పూర్వజన్మ పుణ్యఫలం మీద లభించిన వారే. వారితో నా బంధం ఈ జన్మది కాదు. అనేక జన్మల బంధం మాది. నేను వారి దగ్గరకు వెళతానని వాళ్ళకి తెలుసు. నా కోసం ఎదురు చూస్తుండేవాళ్లు" పావని మౌనంగా వింటోంది.

"ఆ తర్వాత నాకు కొన్ని శక్తులు ఏర్పడ్డాయి" అన్నాడాయన.

"మీరు మోక్షసాధన కోసం ప్రయత్నించలేదా? " అడిగింది పావని.

"మొదటినుంచీ నాలో సానుభూతీ, ప్రేమా ఎక్కువ. అందరిలోనూ పరమాత్మను చూడగలిగే వాడిని. నేను ఏ హిమాలయాలకో వెళ్ళి ముక్కు మూసుకుని మోక్షం కోసం ప్రయత్నిస్తే నా ఒక్కడికే లాభం. కానీ అందరికీ జ్ఞానం పంచాలని

చూస్తే ఎన్నో ఆత్మలని నాశనం కాకుండా కాపాడగలుగుతాను"

"గురువుల అవసరం ఉందంటారా? "

"తప్పకుండా ఉంది. దేహానికి డాక్టర్లూ, ఆత్మకి గురువులూ తప్పకుండా కావాలి. దేహాన్ని రోగాల బారిన పడకుండా డాక్టర్లు రక్షిస్తారు. ఆత్మ దుష్ట తలంపులతో, సంసార బంధంలో చిక్కి నాశనమై పోకుండా గురువులు కాపాడతారు"

"పుట్ట గొడుగుల్లా పుట్టుకొస్తున్న గురువుల గురించి మీరేమంటారు? ఎన్నో రకాల మోసాల గురించి రోజూ వార్తల్లో తెలుసుకుంటూనే ఉన్నాం కదా"

"అది ఎవరికి వారు శోధించి తెలుసుకోవాలి"

"ఇన్ని ఆడంబరాలు అవసరం అంటారా? " ఆయన సిల్కు బట్టలనీ, కార్లనీ ఉద్దేశించి అన్నది పావని.

గురూజీ నవ్వేశాడు.

"మీ ఉద్దేశం అర్థమైంది. కానీ ఇవన్నీ నేను కావాలని ఏర్పరచుకోలేదు. భక్తుల ఆనందంకోసం, వాళ్లు ఇచ్చే కానుకలు స్వీకరిస్తున్నాను. అంతే" తన దుస్తులూ, జీవన శైలీ అంతా జనం కోసమేనన్నట్లు మాట్లాడాడు ఆయన.

"మీరు డబ్బు మనిషని కొందరు అంటారు" అంది పావని.

ఆయన చిరునవ్వు నవ్వుతూ మౌనంగా చూస్తున్నాడు.

"ప్రతి దానికీ ఇంత రేటని ఫిక్స్ చేశారని అంటారు. భక్తుల ఇంటికి రావాలన్నా, ఏదన్నా బోధించాలన్నా ఇంకా ఏం చేసినా, ప్రతి ప్రోగ్రాంకీ, ప్రతి ఐటమ్‌కీ ఇంత అని ఖచ్చితమైన రేట్లు ఉన్నాయి" అన్నది పావని.

"ఇందులో రహస్యం ఏం లేదు. మేము ప్రతి పైసా చెక్కుద్వారా పుచ్చుకుంటాం. ఇందులో ప్రభుత్వానికి గానీ ప్రజలకిగానీ తెలియకుండా చేస్తున్నదేం లేదు. ప్రతి పైసాకీ ఖచ్చితమైన లెఖ్ఖలున్నాయి" అన్నాడు సింహనాదం గురూజీ.

"నేను అడుగుతున్నది మీరు శిష్యుల నుంచీ, భక్తులనుంచీ డబ్బు ఎందుకు వసూలు చేస్తున్నారని? " అంది పావని.

"అక్కడికే వస్తున్నాను. మేము ఛార్జ్ చేసేది వైట్‌లోనే ఉంటుంది. ఇక డబ్బు తీసుకోవడమంటే గురు శిష్య సంప్రదాయంలో గురుదక్షిణ అన్నదానికి మనవాళ్లు చాలా ప్రాముఖ్యం ఇచ్చారు. దేన్నీ ఊరికే పొందకూడదు. ఆఖరికి ఆధ్యాత్మికతను కూడా అన్నది మన సంప్రదాయం. కష్టపడకుండా, ఖర్చు పెట్టకుండా ఏదీ పొందలేము. ఉచితంగా పొందిన దానిమీద ఎవరికీ శ్రద్ధా, భక్తీ ఉండదు. ఎక్కడో నిజమైన జిజ్ఞాసి ఎవరో కోటికి ఒకరు ఉంటారు. మిగతా అంతా సామాన్యమానవులే. వాళ్లకి డబ్బు ఇచ్చి పొందినప్పుడే దాని విలువ తెలుస్తుంది. అందుకే మేము ప్రతి దానికీ ఇంత అని రేటు ఫిక్స్ చేశాము. కనీసం తాము ఖర్చుపెట్టిన డబ్బుకి తిరిగి ఏదో పొందామనే తృప్తికోసం అయినా వాళ్లు మేము చెప్పింది శ్రద్ధగా విని ఆచరిస్తారు" అన్నాడు సింహనాదం గురూజీ.

పావని అడిగిన ప్రతి ప్రశ్నకీ ఆయన ఖచ్చితమైన సమాధానాలు ఇచ్చేశాడు.

శిష్యులు ఆయన ఆశ్రమం అంతా తిప్పి చూపించారు. పావని ఆ ఆశ్రమాన్ని చూసి ఆశ్చర్యపోయింది. సంవత్సరం పొడుగునా ఆయన కార్యక్రమాన్ని చదివింది. ఆయన ఎన్నడూ ఖాళీగా ఉన్నట్లు లేదు. నిరంతరం ఏదో ఒక కార్యక్రమం. ఆశ్రమ నిధులకోసం ఎన్నో దేశాలు తిరిగాడు. అక్కడ ఉపన్యాసాలిచ్చి డబ్బు సేకరించాడు. పొద్దుటినుంచి రాత్రిదాకా ఏదో ఒక పని చేస్తూనే ఉంటాడు. కళ్లు చెదిరేట్లున్న ఆశ్రమాన్నీ, కళ్లు తిరిగి పోయేట్లు ఉన్న విరాళాల వివరాల్నీ చూసి పావనికి ఆశ్చర్యం వేసింది.

"గురువుగారు క్షణం విశ్రాంతి లేకుండ

పాటు పడుతున్నారు. ఎంతో కష్టపడి నిధుల్ని సేకరిస్తున్నారు" చెప్పారు శిష్యులు.

ఆ నిధులు సక్రమంగా వినియోగం అవుతున్నాయా, ఏమన్నా అవకతవకలున్నాయా... ఇలాంటి ప్రశ్నల్ని వదిలేస్తే హర్ష ఆనాడు అన్న మాటలు "ఈ రోజుల్లో డబ్బు సంపాదించటం ఆధ్యాత్మిక రంగంలోనూ, రాజకీయరంగంలోనూ మాత్రమే సులువు" అన్న మాటలు కూడా పూర్తి నిజం కాదనిపించింది పావనికి.

ఇక్కడ కూడా డబ్బు అంత తేలిగ్గా రాదు. వస్తే ప్రతివాడూ ఇందులోనే ప్రవేశించే వాడు. ఇక్కడ కూడా నేర్పూ, ఓర్పూ కావాలి. జనాన్ని ఆకర్షించగలగాలి. అప్పుడే జనం వస్తారు. గురువుగారు అన్నమాట "కష్టపడకుండా ఏదీ రాదు" దీనికి కూడా వర్తిస్తుంది.

**రా**జీవరావు కూతురుకి సినిమాల్లో రోల్స్ దొరకలేదని డిప్రెసివ్‌గా తయారయింది. డల్‌గా ఉంటుంది. సరిగ్గా తినటంలేదు. పోనీ తనే ఫైనాన్స్ చేస్తే ఏమన్నా హీరోయిన్‌గా తీసుకుంటారేమోనని ఆశకలిగింది రాజీవరావుకి. తన ప్రొడ్యూసర్ బంధువుల్ని అడిగాడు.

"సినిమా అంటే కోట్లతో వ్యవహారం. నువ్వు అంత డబ్బు తేగలవా? " అన్నారు వాళ్లు.

పదో, పదిహేను లక్షలో అయితే రాజీవరావు సిద్ధమే. కానీ కోట్లు అనేసరికి ఏం చెయ్యాలో అర్థం కాలేదు.

"మీ పావనికి జర్నలిస్టుగా, రిపోర్టర్‌గా ప్రొడ్యూసర్లు ఎవరైనా తెలిసే ఉంటారు కదా! కొంచెం మా అమ్మాయి షఫాలీకి రోల్స్ ఇప్పించమని చెప్పరాదూ" బాబూరావుని రిక్వెస్ట్ చేశాడు రాజీవరావు.

పావనితో చెప్పాడు బాబూరావు.

"నేను ఒకసారి షఫాలీతో మాట్లాడతాను" అంది పావని.

ఆదివారం సాయంత్రం షఫాలీ దగ్గరకు వెళ్లింది.

పైన డాబా మీద పిట్టగోడ కానుకుని రోడ్డుమీద ట్రాఫిక్‌ని చూస్తోంది షఫాలీ. దిగులుతో కాబోలు చిక్కిపోయి అందంగా కనిపిస్తోంది.

"రా పావనీ" ఎదురుగుండా ఉన్న కుర్చీలు చూపిస్తూ అంది షఫాలీ. ఇద్దరూ పేము కుర్చీల్లో కూర్చున్నారు.

కాసేపు అదీ ఇదీ మాట్లాడాక మెల్లగా సంగతి కదిపింది పావని.



"సినిమాల్లో యాక్ట్ చెయ్యాలని ట్రై చేసినట్లున్నావు కదూ? ఏమయింది? "

"ఏవీ దొరికేట్లు లేవు. అక్కడంతా కొత్త వాతావరణం నాకు యాక్ట్ చెయ్యాలని చాలా క్రేజ్... ఛాన్స్ దొరకటం లేదు. తెలిసిన వాళ్లు కూడా రోల్స్ ఆఫర్ చెయ్యటం లేదు" చెప్పింది షఫాలీ.

"యాక్ట్ చెయ్యాలని గట్టిగా అనుకుంటున్నావా? "

"అవును, నిజానికి నా అణువణువూ యాక్ట్ చెయ్యాలని పరితపించిపోతోంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఐ లవ్

యాక్టింగ్. నటించాలని పిచ్చ కోరికగా ఉంది. రోల్స్ దొరకక పిచ్చెక్కినట్లు ఉంది. నిజంగా పిచ్చి కూడా పడుతుందో ఏంటో? " షఫాలీ ఏడుపు మొహం పెట్టి చెప్పింది.

పావని ముందుకి వంగి షఫాలీ చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"షఫాలీ.. సినిమా అన్నది రంగుల ప్రపంచం. అందమైన, ఆకర్షణీయమైన ఇంకా చెప్పాలంటే అద్భుతమైన ఆ రంగం లోకి అడుగు పెట్టాలని కలలు కనటంలో ఆశ్చర్యమేం లేదు. నీకు ఇంకో విషయం తెలుసా? ఒకవేళ సినిమా గనక అద్భుత విజయం సాధిస్తే ఆ నిర్మాత పెట్టే ఒక్క రూపాయికి వంద రూపాయలు సంపాదించుకోగలడు. ఏ వ్యాపారంలోనూ ఇంత లాభం ఉండదు. అందుకే ప్రతివాళ్లూ సినిమారంగం వైపు మళ్లుతున్నారు. సినిమా తీసే నిర్మాతల సంఖ్య కూడా చాలా పెరిగింది" పావని షఫాలీ వైపు చూస్తూ చెప్పింది.

ఇదంతా పావని ఎందుకని చెపుతోందో అర్థం కాని షఫాలీ పావని వైపు అయోమయంగా చూసింది.

"సినిమా అన్నది బిజినెస్. పెట్టుబడి పెట్టి, కోట్లు వెచ్చించి సినిమా తీసే నిర్మాత తను పెట్టే పెట్టుబడి తిరిగి ఎన్ని రెట్లలో పొందాలా అని ఆలోచిస్తాడు. అంతేగానీ రికమెండేషన్ ఉందనో, జాలిపడో రోల్స్ ఇచ్చేయడు" అంది పావని.

షఫాలీకి పావని ఏం చెపుతోందో అప్పటికి కాస్త అర్థమైంది.

"షఫాలీ, నీలో సత్తా ఉంటే నిర్మాతలు అవకాశమిస్తారు. నీ టాలెంట్‌ని వాళ్లకు తెలియచెప్పాలి. అంతేగానీ తెలిసిన వాళ్లు కదా అని వాళ్ల వెంటబడి అడిగితే మహా అయితే ఒక రోల్ ఇస్తారు. అదీ చిన్నది. నువ్వు టాలెంట్ ఉంటేనే రంగంలో నిలబడగలవు. సినిమాల్లోకి వెళ్లాలని అనుకునే ముందు నువ్వు నటించగలవో లేదో ఆలోచించావా? "

"ఆలోచించాను. నటించగలను"

"మరి అవకాశాలెందుకు రాలేదు? " షఫాలీ మాట్లాడలేదు.

"షఫాలీ, ఈ రోజుల్లో ఎవరికీ సహనం లేదు. రడీమేడ్‌గా నటులు ఉంటే తీసుకుంటారు గానీ నీ టాలెంట్‌ని మెరుగుపెట్టి, నీలో ప్రతిభని వెలికి తీసే ఓపిక ఎవరికీ లేదు. ఎవరికి వారు బిజీ. అందుకే నీ సొంత బంధువులు కూడా నీకు సాయం చేయలేకపోయారు. నీకు ఎవరో సాయం చేయటం కాదు. నువ్వే నిన్ను తీర్చి దిద్దుకోవాలి"

"అంటే"

"ఏదన్నా ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరు. వాళ్లు నీ ప్రతిభని మెరుగుపెట్టి నిర్మాతలకి పరిచయం చేస్తారు"

"అక్కడేం మోసాలుంటాయో" రాజీవ రావు భార్య టీ కప్పులతో పైకి వస్తూ అంది.

"మంచి పేరున్న ఇన్‌స్టిట్యూట్‌లో చేరు. ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ అయితే వాళ్లు నీకు యాక్టింగ్‌లో మెలకువలూ, అన్నీ నేర్పుతారు. ఏ రసాన్నైనా పోషించగలనని నీకు ధైర్యం కలిగినప్పుడు నువ్వు నిర్మాతలని కలిస్తే కాన్ఫిడెన్స్ ప్రతిబింబించే నీ మొహాన్ని చూసి ఛాన్స్ ఇవ్వాలా అని కనీసం ఆలోచించనైనా ఆలోచిస్తారు" అంది పావని.

షఫాలీ ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది.

★ ★ ★

షఫాలీ ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరానని ఫోన్ చేసి చెప్పింది.

ఏదో మామూలుగా ఉంటుందని చేరిన షఫాలీ అక్కడి పాఠాలూ, క్రమశిక్షణా చూసి ఆశ్చర్యపోయింది. పొద్దున్న తొమ్మిదింటికి మొదలయిన క్లాసులు సాయంత్రం ఆరింటిదాకా ఉంటాయి. వాచకంలోనూ,

యాంగిల్స్‌లోనూ, యాక్టింగ్‌లోనూ, ఆఖరికి నిలబడే తీరు, డాన్సింగ్ అన్నిటిలోనూ వాళ్లు శిక్షణ ఇస్తున్నారుట.

ఈమధ్యలో షఫాలీని కొన్ని షూటింగ్‌లకి తీసుకెళ్ళింది పావని. చేసిన సీనే మళ్ళీ మళ్ళీ చేయటం, ఎండలో, లైట్ల వెలుగులో నిలబడి ఓపిగ్గా స్టెప్పులు వేయటం అన్నీ చూసి షఫాలీకి యాక్టింగ్ అంటే ఆషా మాషీ వ్యవహారం కాదని అర్థమైంది.

కానీ షఫాలీకి నిజంగానే యాక్టింగ్‌మీద చాలా మోజూ, ప్రేమా వున్నాయి. శ్రద్ధగా క్లాసులకి వెళ్ళి పట్టుదలగా నేర్చుకుంటోంది.

★ ★ ★

"గీతాంజలి ఆంటీని చూసి చాలా రోజులైంది. ఈ ఆదివారం వాళ్ళింటికి వెళదాం" అంది పావని.

బేబీ పర్వతవర్ధని ఆశ్చర్యపోయింది. "హఠాత్తుగా ఆవిడమీద ధ్యాస మళ్ళిందేంటి? " అంటూ నవ్వేసింది.

పావని సమాధానం చెప్పలేదు. అసలు పావని వాళ్ళింటికి వెళ్లాలనుకున్నది మధురానంద్‌ని చూడాలని.

హర్ష మధురానంద్ గురించి అన్నమాటలు పావనికి బాగా గుర్తున్నాయి. కాకపోతే ఆరోజుల్లో పావనికి అవి అర్థంకాలేదు. ఇప్పుడు సమాజాన్ని చూస్తూ, పరిస్థితులని అర్థంచేసుకుంటున్నందువల్ల ఆ మాటల అర్థం అవగాహన చేసుకోగలిగింది. హర్ష మధురానంద్‌కి అతను ఏ పరిస్థితిలో ఉన్నాడో తెలియ చెప్పాలనుకున్నాడు. కానీ అది చెయ్యలేకపోయాడు. తను ఆపని చెయ్యాలి, చేసి హర్షకి చూపించాలి.

ఆ ఆదివారంనాడు గీతాంజలి ఇంటికి వెళ్ళారు. గీతాంజలి ఆప్యాయంగా ఆహ్వానించింది. ఇంట్లో పరిస్థితి అంతా యథాతథం.

మధురానంద్ ధ్యానం ముగిశాక బయటకు వచ్చాడు.

కొంచెంసేపు మామూలు మాటలు నడిచాయి.

"మధురానంద్, నిగది చూద్దాంపద" అంది పావని.

"రామ్మా" అంటూ ముందుకి నడిచాడు మధురానంద్.

అతని గదిలో గురువుగారి నిలువెత్తు పటం, ఆయన పాదముద్రలున్న ఫొటో, అగరొత్తుల స్టాండూ, ఒక చాపా, దిండూ తప్ప మరేంలేవు.

"నేను కింద పడుకుంటాను. ఒకపూట భోజనం మాత్రమే చేస్తాను. యోగిలాంటి వాణ్ని" అన్నాడు మధురానంద్, గదంతా చూస్తున్న పావనితో.

"నువ్వు పదోక్లాసు పరీక్ష ఎందుకు రాయలేదు? " హఠాత్తుగా అడిగింది పావని.

మధురానంద్ ఒక్కక్షణం పావనివైపు అదోలా చూశాడు. ఆ చూపులో ఇంత తుచ్ఛమైన సంగతుల గురించి ఎందుకు మాట్లాడుతావన్న భావం కనిపించింది. మరుక్షణం మామూలుగా అయిపోయాడు.

"నాకీ ఐహికమైన విషయాలమీద కోరిక లేదు. చదువు విజ్ఞానంకోసం అనుకుంటే ఏ డిగ్రీలూ లేకపోయినా కావలసినంత విజ్ఞానం సంపాదించేశాను. ప్రపంచం కొలిచే కొలబద్దలు సర్టిఫికెట్లు. వాటితో నాకు సంబంధంలేదు" అన్నాడు.

"నువ్వు గాలి తిని, గాలి తాగి బతకటం లేదుకదా. నీకు కావలసిన డబ్బుకోసం ఒకళ్లమీద ఆధారపడటం సిగ్గుగా లేదూ? " అంది పావని.

"లేదు. నేను యోగిని. కాకపోతే ఇంట్లో ఉంటున్నానంతే"

"నువ్వు హిమాలయాలకో మరోచోటికో వెళ్ళి తీవ్రంగా తపస్సు చేయవచ్చుగా" అంది పావని.

"ఇంట్లో ఉండి కూడా మోక్షం పొందవచ్చు"

"మధురానంద్, నువ్వేం అనుకుంటు

న్నావో నాకు తెలీదుగానీ నీ మనసు మాత్రం నేను గ్రహించాను. నీకు ఆధ్యాత్మిక విషయాలపట్ల ఆసక్తి ఉండటం అన్నది నిజమే కావచ్చు కానీ నీ వైరాగ్యం మాత్రం నిజంకాదు. నీకు తెలియకుండానే నువ్వు మీ ఇంట్లో పరిస్థితులవల్ల, అక్కడ నీకు లభిస్తున్న ఆధ్యాత్మిక ప్రపంచం మీద ఆసక్తి పెంచుకున్నావు: కానీ నీలో నిద్రాణమై ఉన్నది ఏమిటో తెలుసా? " అంది పావని.

మధురానంద్ క్వశ్చన్ మార్క్ మొహంతో చూస్తున్నాడు.

"నీలో దాగి ఉన్నది బద్ధకం. దానికి నువ్వు వైరాగ్యం అని పేరు పెట్టుకుని ఉండవచ్చు కావల్సినవన్నీ నీకు సులువుగా దొరికిపోతున్నాయి కాబట్టి నీకు చదువూ, ఉద్యోగంలాంటి విషయాల పట్ల ఆసక్తి కలగటంలేదు. నీకు ఉన్నది నిజమైన వైరాగ్యం అయితే, ఏనాడో నువ్వు ఇల్లు వదిలి తపస్సుకోసం వెళ్ళిపోయి ఉండేవాడివి. నువ్వు ఆలోచించుకో. నీకు అన్నీ కావాలి. ఇల్లు కావాలి. ప్రశాంత జీవనం కావాలి. ఏలోటూ రాకుండా నీ సాధన గడిచిపోతుండాలి. ఇవన్నీ తీరాలంటే నువ్వు చదువుకుని, నీకాళ్ళమీద నువ్వు నిలబడగలిగినప్పుడే సాధ్యం అవుతుంది. సమయం మించిపోతే కష్టం. నీకు నేను చెప్పేది ఏం ఉంది. నువ్వే గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుని, నీ మనసు తలుపులు తెరిచి ఆలోచించుకో. సమాధానం దొరుకుతుంది" అంది పావని.

మధురానంద్ మొహం ఎర్రబడింది.

"నాతో ఇలా ఎవరూ మాట్లాడలేదు" అన్నాడు.

"మాట్లాడరు. ఎందుకంటే మీరు ఏనాటినుంచో మీచుట్టూ ఇనపతెరలు బిగించుకుని, ఎవరినీ మీ పరిధిలోకి రానీయకుండా బతుకుతున్నారు. మీ ఆత్మీయులు మిమ్మల్ని మాట్లాడించాలంటేనే భయపడే స్థితికి మీనాన్న వాళ్ళని తీసుకొచ్చాడు. ఇక పరాయివాళ్ళు? ఈ రోజుల్లో ఎవరికీ ఎవరంటే పట్టదు. ఎవరిబతుకు వాళ్ళది. ఇంకొకళ్ళ గురించి ఆలోచించి, వాళ్ళబాగు చూడాలని ఎవరికీ అనుకునే తీరికా, ఓపికా కూడా లేవు" అంది పావని.

మధురానంద్ మౌనంగా ఉండిపోయాడు. అతని మొహం కందిపోయి వుంది. గాయపడ్డ చిహ్నాలు కనిపిస్తున్నాయి. పావని బాధపడలేదు. సమ్మెట పోట్లకు గురయితేగానీ ఆభరణం తయారు కాదు.

మధురానంద్... అతన్ని చూస్తే పావనికి జాలేసింది.

పొద్దస్తమానం తిట్టి, భయంకరంగా అరుస్తూ, తల్లిని కొడుతూ ఉండే తండ్రి, అతన్ని చూసి భయంతో వణికిపోతూ చస్తూ బతుకుతున్న తల్లి, వాళ్ళిద్దరిమధ్యా నలిగిపోతూ, ఆప్యాయతకోసం అలమటించిన చిన్నారిబాబు... అందరితోనూ తెగతెంపులు చేసుకుని ఏకాకిగా బతికిన కుటుంబంలో... ఎక్కడా దొరకని శాంతిని చివరికి తల్లితోపాటు తనూ వెతుక్కుంటూ ఆధ్యాత్మికతలో పొందాలని చూసిన జ్ఞానిననుకునే అజ్ఞాని, తనకేం కావాలో తనకే తెలియని అమాయకుడు. చివరికి తన జీవితలక్ష్యం ఏమిటో గ్రహించగలుగుతాడా?

పావని ప్రశ్నకి పదిరోజుల్లోనే గీతాంజలి చెప్పిన మాటల్లో సమాధానం దొరికింది. మధురానంద్ పదోక్లాసు పరీక్షకి ప్రిపేర్ అవుతున్నాడుట!

★ ★ ★

పేపర్లు చూస్తూ ఉంటే పావనికి తను హర్ష గురించి విన్నది నిజమేనా అని సందేహం కలిగింది. హర్ష నేషనల్ టీమ్‌కి సెలక్ట్ అయాడుట. ఇకమీద మనదేశం తరపున వివిధ దేశాల వాళ్ళతో ఆడే అవకాశం లభిస్తుంది హర్షకి. హర్ష కలలుగన్న గమ్యాన్ని చేరుకున్నాడు.

మిస్ ఇండియా అందాల పోటీలు జరి

గాయి. ప్రశంసల మధ్య, ఆరాధనా పూర్వ కంగా చూస్తున్న చూపుల మధ్య, నిరసన ధ్వనులూ, నల్లజెండాల మధ్య మిస్ ఇండియా పోటీ జరిగిపోయింది.

మిస్ ఇండియాగా గెలుపొందింది ప్రియాంక. టి.వి.లో ప్రత్యక్ష ప్రసారంలో పావని ఆ పోటీని చూసింది. ప్రియాంక కళ్ళల్లో ఉట్టి పడుతున్న ఆత్మవిశ్వాసం... గెలిచినా, ఓడినా ఒక్కటేనన్నట్లు ఆమె పెద వుల మీద వెలుగుతున్న చిరునవ్వు అందర్నీ ఆకట్టుకున్న ఆమె సమాధానాలు ప్రియాంకని మిస్ ఇండియాని చేశాయి.

★ ★ ★

"ఈసారి నువ్వు ఇంటర్వ్యూ చెయ్యా ల్సింది మిస్ ఇండియా ప్రియాంకా రాజ్ ని" అహోబలరావు చెప్పాడు.

పావనికి తల తిరిగిపోయినట్లయింది.

"ప్రియాంకనా? " అంది. ఎంత ప్రయ త్నించినా గొంతు వణికింది. మామూలుగా కనబడాలని వ్యర్థప్రయత్నం చేసింది. సాధ్యంకాలేదు. అహోబలరావు ఆమె పరి స్థితి కనిపెట్టేశాడు.

"ఏంటి అదోలా అయిపోయావు? " అడి గాడు

"ఏంలేదు"

"అవునూ ప్రియాంక నీకు తెలుసేమో కదూ? " అని,

"మీ కాలేజీయేకదా? " అడిగాడాయన.

"అవును. పరిచయం మాత్రం వుంది" అంది ప్రియాంక.

"అయితే ఇంకేం. నీకు ఇంటర్వ్యూ ఇస్తుందిలే. బాగా బిజీగా ఉంటారువాళ్ళు ఈ ఏడాదంతా వాళ్ళకి తీరిక ఉండదు. దానికితోడు మిస్‌వరల్డ్ అనో, మిస్ యూని వర్స్ అనో పోటీకి తయారయారంటే మరీ బిజీ అవుతారు" అన్నాడాయన.

మిస్ ఇండియా, మిస్ యూనివర్స్‌లాంటి వాళ్ళు ఇదివరకు ఇచ్చిన ఇంటర్వ్యూలు చది వింది.

ఈమధ్య ప్రపంచజ్ఞానం కాస్త అలవర్చు కోవటంవల్ల అందాలపోటీల్లో పాల్గొనటం అంటే కష్టపడాలని తెలుసు. కానీ ఆరోజు వాటి గురించే పూర్తిగా ఆలోచించటంవల్ల, దీక్షగా చదవటం వల్లా అందాలపోటీ అంటే ఏమిటో తెలిసింది.

మహిళాసంఘాలూ, కొన్ని మతసం ఘాలూ అందాలపోటీలను వ్యతిరేకిస్తు న్నాయి. అది వేరే ఇష్యూ. అందాలపోటీలు నిర్వహించాలా, వద్దా? అందానికి నిర్వ చనం ఏమిటి? అందాలపోటీల వల్ల ఏమి టిలాభం... ఎవరికి లాభం? ఇవన్నీ పక్క నపెట్టి అందాల పోటీలకు హాజరయ్యే అమ్మాయిల గురించి తెలుసుకుంటే...

వాళ్ళు ఈ పోటీకి హాజరవటానికి ఎన్నో సంవత్సరాల ముందునుంచే వాటికోసం సిద్ధం అవుతారు. ఎంతో కృషి చేస్తారు. ఎంతో స్ట్రిక్ట్‌గా డైటింగ్‌చేస్తారు. ఎక్సర్‌సై జ్‌లు చేస్తారు. ఎంతో శ్రద్ధగా, జాగ్రత్తగా శరీరాకృతినీ, చర్మసౌందర్యాన్నీ కాపాడుకుం టారు. వీళ్ళకి ట్రెయినింగ్ ఇచ్చేందుకు కొన్ని సంస్థలు ఉన్నాయి. కొన్ని దేశాల్లో ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చే సంస్థలు ఉన్నాయి. పన్నెండేళ్ళప్పటినుంచే ఆ సంస్థలకి వెళ్ళి ట్రెయినింగ్ అయినవాళ్ళు ఉన్నారు. మాట్లా డటం, కూర్చోవటం, చూడటం, శిరోజాల దగ్గర్నుంచి కాలిగోరుదాకా అందం ఉట్టిప డేట్లు చేయటం అన్నీ చూసుకుంటారు. శారీ రక సౌందర్యంతో పాటు ఆత్మవిశ్వాసం, ఆత్మసౌందర్యంకూడా వాళ్ళల్లో పెరిగేటట్లు చేస్తారు. అందమైన రూపంతోపాటు మంచి మనస్సూ, ఆత్మసౌందర్యం ఉన్నవాళ్ళు మార్కులు కొట్టేస్తారు.

కొంతమంది కేవలం జ్యూస్‌లమీదే ఆధా రపడి నెలలతరబడి బతికేస్తారు.

అవన్నీ చదివాక, ఒక్కొక్కళ్ళ అనుభ వాలూ విన్నాక పావనికి అందాల సుందరు లంటే కేవలం ఏదో అందంగా తయారై పోయి, మంచిబట్టలు వేసుకుని, లైట్ల వెలు

గులో అటూఇటూ తిరుగుతూ, చిలకపలు కులు పలకటం కాదనీ దానివెనుక కూడా సంవత్సరాల తరబడి చేసే కృషి ఉందనీ అర్థమైంది.

ఈ ప్రపంచంలో ఏదీ తేలిగ్గా రాదు. ఇప్పుడు అర్థమైంది. ప్రియాంకలో తనుచూసింది వెటకారం, వెకిలితనం మాత్రమే. కానీ ఆమె ప్రవర్తనని ఒకే కోణంలోంచి చూసి తను అలా అర్థంచేసుకుంది. నిజానికి ప్రియాంకలో ఉన్నది ఆత్మవిశ్వాసమూ, దేన్నయినా అనవసరంగా సీరియస్‌గా తీసుకోక జాలీగా గడిపేసే తత్వమూ. తను ప్రియాంకని అపార్థంచేసుకుంది.

వెన్నెలలో తాజ్‌మహల్‌లా తళతళలాడిపోయే ప్రియాంక... మిస్ ఇండియాగా ఎన్నికైన ప్రియాంక, తనని ఛాలెంజ్ చేసిన ప్రియాంక... ఛాలెంజ్‌ని నిలబెట్టుకుని హర్ష మనసు గెల్చుకున్న ప్రియాంక తనను ఘోరంగా ఓడించిన ప్రియాంక అట్లాంటి ప్రియాంకని తను ఇంటర్వ్యూ చేయాలా?

పత్రికల్లో ప్రియాంక వివరాలు వచ్చాయి. ఆమె తెలుగు స్త్రీ కావటం తెలుగు వారికే గొప్ప సన్మానమని కొందరు అంటే, తెలుగు వారి అందచందాల్ని దేశమంతా చాటిచెప్పిన ఘనత ఆమెదని కొందరు రాశారు. ఆమె ఏ కాలేజీలో చదువుకున్నదీ, ఎప్పుడు పుట్టిందీ, ఎక్కడ పెరిగిందీ అన్నీ పత్రికలలో రాశారు. టి.వి.లో అన్ని ఛానెల్స్‌లోనూ ప్రియాంకని చూపించారు.

"ప్రియాంకతో కనబడుతున్న హాకీ ఆటగాడు హర్ష..."

"హర్ష ప్రియాంక బాయ్ ఫ్రెండా?"

అట్లాంటి టైటిల్స్‌తో కొన్ని ఆర్టికల్స్ కూడా వచ్చాయి.

హర్ష ప్రియాంక పక్కనే నిలబడి ఉన్నాడు.

"హర్ష మీకు స్నేహితుడా? అతనికీ మీకూ మధ్య ఏదో ఉందని అనుకుంటున్నారు. నిజమేనా?" ఒక విలేకరి అడిగిన ప్రశ్నకు ప్రియాంక నవ్వేసింది.

"హర్ష నాకు మంచి స్నేహితుడు" అంది చాలా క్లుప్తంగా. ఇంకేం అడిగే అవకాశం ఇవ్వకుండా ముందుకి వెళ్లిపోయింది.

"అలాగే చెపుతారు. గ్లామర్ తగ్గిపోతుందని ప్రేమా, పెళ్లీ లాంటివి ఉన్నా చెప్పరు'' అనుకుంటున్నారు కొందరు. ఆ మాటలు విని పావని గుండె ఒక్కక్షణం కలుక్కుమంది. కళ్లల్లో నీళ్లు. అంతేనా? హర్షని ప్రియాంక పెళ్లి చేసుకుంటుందా? నిజంగానే ఇద్దరి మధ్యా ఏదో ఉందా?

ఆ సమయంలో పావనికి తనేమిటో తన మనసేమిటో పూర్తిగా అర్థమైంది.

తను హర్షని ప్రేమిస్తూనే ఉంది. అతను అనుక్షణం తన హృదయంలో మెదులుతూనే ఉన్నాడు. అతన్ని చూడగానే కలిగే ఆనందం, అతన్ని తల్చుకున్నప్పుడు తన పెదవుల మీద విరిసే చిరునవ్వు, అతని జ్ఞాపకాలలోని ఆనందం... ఇవేవీ అబద్ధం కాదు. ఇవి పరమసత్యాలు. తను అతన్ని మర్చిపోయానని అనుకోవటం అబద్ధం. అతన్ని విస్మరించగలిగాననుకోవటం పచ్చి అబద్ధం.

కానీ ఈ ప్రేమలో ఆనాటి జలపాతాల హోరులేదు. మనసుని ముంచెత్తి, తనను వెర్రిదాన్ని చేసేసి అనుక్షణం అతని కోసం పరుగులు తీయించే ప్రేమ కాదు ఇది. తనకు పిచ్చెక్కించి, వెర్రెక్కించి ఇక ఏదీ తనకు పట్టనట్లు, హర్ష మాత్రమే తన జీవితం అయినట్లు అతని కోసం నాట్యం చేయించే భయంకరమైన ప్రేమ కాదు ఇది. తన మనసుని తీవ్రమైన అశాంతితో అత్యంత అలజడితో నింపిన ప్రేమ కాదు ఇది. ఈ ప్రేమ స్వచ్ఛమైనది. ఈ ప్రేమ నిర్మలమైనది. ఇప్పుడు తను హర్షని ప్రేమిస్తోంది. శాంతిగా, స్వచ్ఛంగా ప్రేమిస్తోంది. అతను ఎక్కడున్నా ఉండనీ హాయిగా, సుఖంగా ఉండాలి. అంతే.

పావని గుండె తేట పడింది. కన్నీటిని

తుడుచుకుంది. హర్ష ప్రియాంకని ప్రేమిస్తే ప్రేమించనీ. పెళ్లి చేసుకుంటే చేసుకోనీ అనుకుంది.

ఇప్పుడు ప్రియాంకని ఇంటర్వ్యూ చేయటానికి పూర్తిగా సిద్ధమైపోయింది పావని. ప్రియాంక మీద కోపం కలగటంలేదు. హర్ష ప్రేమని చూరగొన్న వ్యక్తిగా ఆమె మీద ఆప్యాయత కలుగుతోంది కూడా.

అడగాల్సిన ప్రశ్నలన్నీ సిద్ధం చేసుకుంది. పావని ఢిల్లీకి వెళ్లేందుకు ఏర్పాట్లు పూర్తి చేశాడు అహోబలరావు. ప్రియాంక ప్రస్తుతం ఢిల్లీలో ఉంది. హర్ష కూడా అక్కడే ఉన్నాడుట. ఒకే హోటల్లో వేరు వేరు గదుల్లో బస చేశారుట. హర్ష ఆస్ట్రేలియాకి వెళుతున్నాడట. మరో రెండు రోజుల్లో అతని ప్రయాణం ఉందిట. మన దేశం తరఫున ఆడటానికి వెళ్తున్నాడుట. హర్ష తను అనుకున్న లక్ష్యం సాధించాడు. ప్రియాంక కూడా అనుకున్న లక్ష్యం సాధించింది. అయినా వాళ్లకు తృప్తి ఉండదేమో. ఇంకా కొన్ని లక్ష్యాలు, ఉన్నతమైన గమ్యాలు ఏర్పరచుకుని వాటికోసం కృషి చేస్తారు కాబోలు.

ఇంకేం ఆలోచించబుద్ధి కాలేదు. వెంటనే వెళ్లి తన లగేజ్ సర్దుకోవటం మొదలుపెట్టింది.

ఢిల్లీకి టిక్కెట్లు ఇస్తూ ఏ హోటల్లో రూమ్ అరేంజ్ చేసిందీ వివరాలు చెప్పాడు అహోబలరావు.

"నువ్వు రైలు దిగగానే ఆ హోటల్ వాళ్లు వచ్చి నిన్ను తమ కార్లో హోటల్‌కి తీసుకెళతారు. ఒక్క దానివే వెళ్లగలవా మరి" అడిగాడు.

"వెళ్లగలను" అంది పావని.

"ప్రియాంకని ఇంటర్వ్యూ చెయ్యటానికి ఢిల్లీకి వెళ్లటం దేనికీ? ఇక్కడి పిల్లేగా. హైదరాబాద్ వచ్చినప్పుడు చెయ్యవచ్చుగా" తల్లి అడిగింది.

"లేదమ్మా! వాళ్లకి టైమ్ ఉండదు. హైదరాబాద్‌కి ఎప్పుడు వస్తుందో ఏమిటో? ఇట్లాంటి ఇంటర్వ్యూలు వెంటనే చేస్తేనే బాగుంటాయి" అంది పావని.

పావని హోటల్‌లోకి అడుగుపెట్టింది.

ఇంద్రభవనంలా ఉన్న ఆ హోటల్, అప్సరసల్లా తిరుగుతున్న హోటల్ స్టాఫ్ ఎవర్నీ గమనించటంలేదు పావని. ఆమె దృష్టంతా ఇప్పుడు తను చేయబోయే ఇంటర్వ్యూ మీదే ఉంది.

సినీ తారలూ, అందాల రాణులూ లాంటి గ్లామర్ వ్యక్తుల ఇంట



ర్వ్యూలు ప్రజలు ఎంత మోజుతో చదువుతారో పావనికి తెలుసు. అందుకే తన ఇంటర్వ్యూ విలక్షణంగా, విశిష్టంగా ఉండాలని అన్ని ప్రశ్నలూ తయారు చేసుకుంది. టీవీలో ఎన్ని ఛానెల్స్‌లో ఎన్ని ఇంటర్వ్యూలు చూసినా పేపర్‌ని శ్రద్ధగా చదువుతారు. తన ఇంటర్వ్యూ పాఠకులని ఆనందపరిచేలా అలాగే వాళ్లకి కొంత సందేశాన్నిచ్చేలా ఉండాలని అనుకుంది. పావని పక్కనే కెమేరా పట్టుకుని కృష్ణమోహన్

నడుస్తున్నాడు.

ముట్టుకుంటే... కాదు చూస్తేనే మాసిపో యేలా ఉన్న గోడలూ, అడుగేస్తే జారిపోతా మేమోననిపించేట్లున్న పాలరాతి గచ్చూ, వజ్రాల తునకలతో చేశారా అన్నట్లు మెరుస్తున్న షాండలియర్స్, అన్నిటినీ కళ్లు పెద్దవి చేసి చూస్తున్నాడు కెమేరామెన్ కృష్ణమోహన్.

తమ కార్డు చూపించి ప్రియాంక ఉన్న గది వైపు వెళ్లారు.

గది రెండో అంతస్థులో ఉంది.

తలుపు మూసి ఉంది. రిసెప్షన్‌లోంచి అప్పటికే పావనీ వాళ్లు వచ్చిన వార్త ప్రియాంకకి తెలిసిపోయింది.

పావనికి దారి చూపిస్తూ వచ్చిన హోటల్ స్టాఫ్ గది తలుపు తెరుచుకున్నాక శలవు తీసుకుని వెళ్లిపోయారు.

పావనీ, కృష్ణమోహన్, గదిలోకి అడుగు పెట్టారు.

సువిశాలంగా, అద్భుతంగా ఉన్న ఆ గదిలో ఉన్న పెద్ద సోఫాలో పక్కపక్కనే కూర్చుని ఉన్నారు ప్రియాంక, హర్ష.

అన్నాళ్ల తర్వాత హర్షని చేరువగా, నేరుగా చూడటం పావనికి అదే మొదటి సారి. ఒక్క క్షణం గుండె లయ తప్పింది. మరుక్షణం తననితాను సంబాళించుకుంది.

"హలో... కంగ్రాచ్యులేషన్స్" అంది ప్రియాంక వైపు చూసి.

ప్రియాంక గులాబీరంగులో ఉన్న సిల్కు డ్రెస్సు వేసుకుంది. దాన్నిండా జరీ పువ్వులూ, చెమ్కీ కుట్టారు. పట్టు కుచ్చు లాంటి జుట్టు మెడచుట్టూ అల్లరిగా పడుతోంది. కుందనపు బొమ్మలాంటి మార్దవం... అదే గ్లామర్. పెదవుల మీద అదే చిరునవ్వు.

"హాయ్" అంది ప్రియాంక తన ఎదురుగా ఉన్న సోఫా చూపిస్తూ.

పావనీ, కృష్ణమోహన్ కూర్చున్నారు.

"కూల్‌డ్రింక్ తాగుతారా? " అడిగింది ప్రియాంక.

"నో, థాంక్యూ" అంది పావని. కృష్ణమోహన్ కూడా తాగనన్నాడు.

"ఓకే" అంది ప్రియాంక నవ్వేస్తూ.

పావని తన నోట్‌బుక్, పెన్ తీసుకుంది.

ఇంటర్వ్యూ మొదలుపెట్టింది.

"మీ గురించి చెపుతారా? " అంది.

"నేను హైదరాబాద్‌లో పుట్టి పెరిగాను. మా మమ్మీ హౌస్‌వైఫ్, మా డాడీ బిజినెస్ మాన్. నేను ఒక్కత్తెనే వాళ్లకి" అంది ప్రియాంక.

"మీకు మిస్ ఇండియా అవాలని ఎందుకు అనిపించింది"

"నాకు ఏదో ఒకవిధంగా పాపులర్ అవాలని ఉండేది. నేను చాలా అందంగా ఉంటానని అంతా అనేవాళ్లు. అందుకే అందాల పోటీలకి ట్రై చేశాను"

"మీరు అందంగా కనబడటానికి ఏమేం చేశారు? "

"ఏమీ చేయలేదు. సహజంగానే నేను చాలా అందగత్తెని"

"ఏం చేయలేదంటే నమ్మమంటారా? చాలా కష్టపడి ఫిగర్ మెయిన్‌టైన్ చేస్తారేమో కదా? " పావని నవ్వేసింది.

"అఫ్‌కోర్స్... స్పెషల్‌గా ఏం చేయలేదు. రెగ్యులర్‌గా ఎక్సర్‌సైజ్ చేయటం, డైటింగ్‌లో నియమాలు అంతే"

"అందానికి చిట్కాలు" అడిగింది పావని. ప్రియాంక శరీర పోషణ గురించీ, అందంగా కనబడటం గురించీ కొన్ని టిప్స్ ఇచ్చింది.

"మనసు ప్రశాంతంగా ఉంటే మొహం అందంగా కనిపిస్తుంది" అంది చివరగా.

"మీరు సెలెక్ట్ కాకపోయి ఉంటే? "

"బాధ పడేదాన్ని కాదు"

"అసలు ఈ పోటీలు వేటిలోనూ సెలక్ట్ కాకపోయి ఉంటే? "

"నాలో లోపాలు ఏమిటని ఆలోచించే

దాన్ని. సరిదిద్దుకోగలిగితే మళ్లీ ప్రయత్నించే దాన్ని. సరిదిద్దుకోలేము అనుకుంటే అప్పుడు వేరే రంగంలో దేనిలో విజయవంతం అవుతామా అని ప్రయత్నించేదాన్ని"

"అంతే కానీ నిరుత్సాహపడేవాళ్లు కారన్న మాట? "

"నెవర్"

"మీరు ఇచ్చే సందేశం"

"మీరు ఏర్పరచుకున్న లక్ష్యాన్ని సాధించటానికి ప్రయత్నించండి. ఊరికే మొదలు పెట్టి ఊరుకోవటం కాదు. దేన్నయినా చివరి దాకా చేయండి. పట్టుదల, కార్యదీక్ష ఉంటే దేన్నయినా సాధించవచ్చు"

"బాగుంది" అంది పావని మెచ్చుకోలుగా చూస్తూ. పావని ఇంకా చాలా ప్రశ్నలడిగింది.

హర్ష ఇంతలో లేచి ఎటో వెళ్లిపోయాడు. పావని అటువైపు కూడా చూడకుండా తన ఇంటర్వ్యూ పొడిగించింది.

"ఇప్పుడు మీతో కూర్చున్న వ్యక్తికీ మీకూ మధ్య ఏదో ఉందని..."

ప్రియాంక ఆ మాటల్ని మధ్యలోనే కట్ చేసింది.

"అవన్నీ గాసిప్. మాగజైన్స్ రాసే వార్తలు. మేమిద్దరం ఫ్రెండ్స్‌మి. అంతే"

ఇంకా కొన్ని ప్రశ్నలు, తను అడగాల్సినవి అన్నీ అడిగేసింది పావని. కృష్ణమోహన్ ఫొటోలు తీసుకున్నాడు. ఇంటర్వ్యూ ముగిసింది.

"థాంక్యూ... ఇక వెళ్తాం" పావనీ, కృష్ణమోహన్ లేచారు.

ప్రియాంక కృష్ణమోహన్‌వైపు చూసింది.

"పావనీ, నేను కాలేజీ ఫ్రెండ్స్‌మి. పావనితో ఇంకాస్సేపు మాట్లాడాలని ఉంది. మీరేమీ అనుకోనంటే..."

"ఓ... నా పనైపోయిందికదా! నేను వెళ్తాను" కృష్ణమోహన్ లేచాడు.

పావని తెల్లబోయింది. ప్రియాంక తనతో మాట్లాడుతుందా?

పావనీ, ప్రియాంకా ఇద్దరే మిగిలారు.

"ఎలా ఉన్నావు పావనీ? " ప్రియాంక ప్రేమగా చూస్తూ అడిగింది.

"బాగానే ఉన్నాను. ఎలా కనిపిస్తున్నాను? " పావని ఎదురు ప్రశ్న వేసింది.

"చాలా చక్కగా. పూర్తి ఆత్మవిశ్వాసంతో అందంగా కనిపిస్తున్నావు"

పావని పకపకా నవ్వేసింది.

"థాంక్యూ. ఒక అందాలరాణి చేత అందంగా ఉన్నాననిపించుకోవటం, నాకు గర్వంగా ఉంది"

ప్రియాంక కూడా నవ్వింది.

"పావనీ, మన ఛాలెంజ్ గుర్తుందా? "

"ఆ... గుర్తుంది. గెలిచినట్లున్నావు కదూ? "

"లేదు"

"ఆ" పావని ఆశ్చర్యపోయింది.

"అవును. పావనీ..."

పావని నమ్మలేనట్లు చూసింది.

"పావనీ ఒకమాట అడుగుతానుచెప్పు. ఒకవేళ నేను పందెంలో గెల్చి ఉంటే... హర్షని పడగొట్టేశాననుకో"

"అసలేం చెప్పదల్చుకున్నావు నువ్వు? " పావని సూటిగా అడిగింది.

"ఏంలేదు. నేనూ హర్షా పెళ్ళిచేసుకుందాం అనుకున్నామనుకో ఏంచేస్తావు? "

"నేనేం చేస్తాను. ఆనందిస్తాను"

"నిజంగానా? ఆలోచించుకుని చెప్పు"

"ఆలోచించేందుకేం వుంది. మీ ఇద్దరి జంటా చూడముచ్చటగా ఉంటుంది"

"అంతేనా? నీకు బాధ అనిపించదా? అస్సలు బాధపడవా? "

పావని మొహం తిప్పేసుకుంది. అస్పష్టంగా వున్న కన్నీటి తెర. మనసు కలుక్కుమంది. అన్నీ ఒక్కక్షణంలో సర్దుకుంది.

"పావనీ... ప్లీజ్... సూటిగా సమాధానం చెప్పు" అంది ప్రియాంక.

"ప్రియాంకా... బాధపడకుండా ఉండ

లేను. కానీ జీవితంలో అన్నీ మనం అనుకున్నట్లు జరగవు. మనసుని సరిపెట్టుకుని మామూలుగా బతకటానికి ప్రయత్నిస్తాను" అంది పావని.

హర్ష హఠాత్తుగా గదిలోకి ప్రవేశించాడు.

పావని తెల్లబోయింది.

"కంగ్రాచ్యులేషన్స్ పావనీ" అంది ప్రియాంక నవ్వుతూ.

"దేనికీ? " పావని అయోమయంగా చూసింది.

"పందెంలో గెలిచినందుకు"

"ఆ... అదెలా? "

ప్రియాంక నవ్వుతూ చెప్పటం మొదలుపెట్టింది.

"పావనీ. నీది వన్ సైడ్ లవ్ అనుకున్నావు కదూ? కానీ కాదు. హర్ష నిన్ను ప్రేమించాడు. ప్రేమిస్తూ ఉన్నాడు. ఎప్పటికీ ప్రేమిస్తూనే ఉంటాడు. అసలేం జరిగిందో తెలుసా? " అంటూ చెప్పడం మొదలెట్టింది.

"హర్షకి నిన్ను చూస్తే ఎంత ప్రేమ ఉన్నా నీ అపరిపక్వత చూసి కోపంగా ఉండేది. నువ్వు కూడా పేపర్లు విసిరావని తెలిశాక బాధపడి నీతో పోట్లాడాడు. నీకు తెలియని సంగతి మరొకటి ఉంది. హర్ష నాకు అప్పటికే మంచి ఫ్రెండ్"

"ఆ? "

"అవును. జిమ్‌లోనూ, స్విమ్మింగ్‌పూల్ దగ్గరా మేం కలుసుకుంటూనే ఉండేవాళ్ళం. హర్ష నీ గురించి చెప్పి బాధపడ్డాడు. అతను ఒక ప్లేయర్. అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించాలనుకున్నాడు. అతనికి విజయంలోనూ, పరాజయంలోనూ, కష్టంలోనూ సుఖంలోనూ తోడుగా నిలిచి, ఓదార్పునివ్వగలిగే భార్య కావాలని వుంది. నీకు ఆ కెపాసిటీ లేదు. సిల్లీగా, బాధ్యతారహితంగా, కేవలం అతడే లోకం అన్నట్లు బతుకుతున్నావు నువ్వు. నిన్ను ఒక సంపూర్ణమైన వ్యక్తిగా, ఆత్మవిశ్వాసంతో నిండిన స్త్రీగా నేను చేస్తానన్నాను" ప్రియాంక ఆగింది.

పావని వింటోంది.

"పావనీ. జీవితంలో ఒక మధురమైన ఘట్టం ప్రేమ. కానీ ప్రేమే జీవితంకాదు. నువ్వు ఒకరినీడన బతికేయాలని హర్ష అనుకోలేదు. నువ్వు ఏదో సాధించాలనీ, నీకుగా నువ్వు గుర్తింపు తెచ్చుకోవాలనీ, తనకి వెన్నుతట్టి తోడుగా నిలిచే అర్ధభాగానివి నువ్వు కావాలనుకున్నాడు. ఈ సంగతి మీ మమ్మీ, డాడీకి కూడా తెలుసు. అందుకే వాళ్ళు నిన్ను ఎప్పటికప్పుడు వాచ్‌చేస్తూ, ఏ అఘాయిత్యం చేయకుండా చూసుకున్నారు. నేను నిన్ను రెచ్చగొట్టి నీలో నిద్రాణమై ఉన్న శక్తిని మేల్కొలిపాను" ప్రియాంక చెప్పింది.

పావని హర్షవైపు చూసింది. అతని కళ్ళు ప్రేమని వర్షిస్తున్నాయి.

"పావనీ... నిన్ను మెచ్చుకుంటున్నాను. నేను కాదన్నానని కృంగిపోయినా, ఆ దుఃఖం లోంచి బయటపడి మనిషిగా కొన్ని సాధించి చూపించావు. ఏదో ఒక కష్టంరాని మనిషి ఉండడు. కానీ ఆ కష్టం వచ్చినప్పుడు కృంగిపోకూడదు. అది ఏరకమైన కష్టం, ఎలాటి దుఃఖం అయినా కావచ్చు ఆ దుఃఖంలోంచి, ఆవేదనలోంచి బోలెడంత శక్తి పుడుతుంది. ఆ దుఃఖాన్నీ, ఆ ఆవేదననీ మరిచిపోతూ, అప్పుడే దేన్నయినా సాధించటానికి ప్రయత్నించాలి. చింతించి సాధించేది ఏదీ ఉండదు. పూనుకుని నడుం బిగించితే సాధించలేనిది ఏదీ లేదు" అన్నాడు హర్ష.

వింటున్న పావనీ, ప్రియాంక చప్పట్లు కొట్టారు.

"ఇంక ఆలస్యం దేనికీ. వెంటనే హైదరాబాద్ బండెక్కి, పెళ్ళి ముహూర్తం పెట్టించేయండి" అంది ప్రియాంక నవ్వుతూ.

హర్ష అల్లరిగా చూస్తుంటే, పావనికి ఆనందం, సిగ్గూ ఒకేసారి చుట్టుముట్టి ఉక్కిరిబిక్కిరి చేశాయి.



# చతుర ప్రపంచం

## ఊహించని ప్రమాదాలు

విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందినకొద్దీ మనిషిని సుఖాలతోపాటు సమస్యలూ వరిస్తున్నాయి.

లాస్ ఏంజెలెస్‌లో ఆర్నాల్డ్.జి. అనే ఓ వ్యాపారస్థుడు 1984లో తన గర్ల్‌ఫ్రెండ్ కెరోల్‌తో వివాహం నిర్ణయం చేసుకుని, ఆమె తండ్రిని కలిసి ఆ విషయం చెప్పాడు. ఆయన తన కూతురికి సంబంధించిన ఓ పోయాడు. విద్యార్థిగా వుండగా డబ్బుకోసం అతడు అనేకమార్లు ఆ బ్యాంక్‌కి తన వీర్యాన్ని డొనేట్ చేశాడు. వెంటనే అతను కోర్టునుంచి అనుమతి తీసుకుని ఆ స్పెర్మ్ బ్యాంక్ రికార్డులని పరిశీలిస్తే అతని అనుమానం నిజమైంది. కెరోల్ అతని వీర్యదానంవల్ల పుట్టిన బిడ్డ అని తేలింది. అంతే కాదు లాస్‌ఏంజెలెస్‌లో అతనికింకా 804 మంది పిల్లలున్నారని తెలిసింది. అతడు కెరోల్‌తో తన వివాహాన్ని రద్దుచేసుకున్నాడు.

కెరోల్ తండ్రి కూతురు పుట్టుక రహ




విషయం అతనికి వెల్లడించాడు. అదేమంటే... ఆ అమ్మాయి అతడి స్వంత కూతురు కాదు. తనకి సంతానం కలగరని గ్రహించాక తన భార్యకి ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ చేయించడం ద్వారా పుట్టినబిడ్డ ఆమె.

అందుకు వీర్యం సేకరించిన స్పెర్మ్ బ్యాంక్ పేరు తెలుసుకున్న ఆర్నాల్డ్ హడలి

స్యాన్ని చెప్పాడు కాబట్టి ఆ వివాహం రద్దు అయింది. కానీ తెలియకుండా జరిగేవి మరెన్నో అందులో వయోభేదం ఎక్కువవున్నపుడు ఇలాంటి ప్రమాదాలు జరగడానికి మరింత అవకాశం వుంటుంది.

## తెలివైన వ్యాపారసంస్థ

ఆస్ట్రేలియాకు చెందిన ఓ తెలివైన వ్యాపార సంస్థ ప్రజలను అతి తెలివిగా టోకరా కొట్టించినా పోలీసులు ఆ కంపెనీ యజమానిని ప్రాసిక్యూట్ చేయలేకపో యారు.

ఆ కంపెనీ ఓ దినపత్రికలో ఇచ్చిన ప్రక టనలో 65 డాలర్లు తమకి పంపితే, అమెరి కానుంచి దిగుమతి చేసుకున్న బ్లూఫిల్మ్‌లు నియమాల ప్రకారం బ్లూఫిల్మ్ సి.డీలను దిగుమతిచేయడం నేరమని తమకు తెలిసిం దని చట్టానికి వ్యతిరేకంగా వ్యాపారం చేయం కాబట్టి వారు పంపిన డబ్బులకి చెక్కులను తయారుచేసి పంపుతున్నామని రాశారు.

ఇంతవరకూ బాగానే వుందికానీ ఆ చెక్కులన్నిటిమీదా తమ వ్యాపారసంస్థ పేరు ముద్రించారు. దాంతో చాలామంది సిగ్గుపడి ఆ చెక్కులని తమ బ్యాంక్‌ల్లో డిపాజిట్ చేయడానికి వెనకాడి చింపేశారు.




గల సి.డి.లను పన్నెండింటిని పంపుతా మని చెప్పారు. బ్లూఫిల్మ్‌లంటే ఆసక్తిగల పలువురు ఆ కంపెనీకి ఆ ప్రకారం డబ్బు పంపారు.

వారం తర్వాత ఆ కంపెనీ తమకి డబ్బు పంపిన వారందరికీ 65 డాలర్లు తిరిగి చెల్లించే చెక్కులని పంపుతూ ఆస్ట్రేలియన్ చెక్కులమీద ఆ వ్యాపార సంస్థ ముద్రించిన కంపెనీ పేరు 'సెక్స్ ఎండ్ పర్వర్షన్ మెటీ రియల్ అండ్ ఛైల్డ్ బ్లూఫిల్మ్ సప్లయింగ్ కంపెనీ'. వీరు చేసిందాట్లో ఎలాంటి నేరం కనిపించదు. కాబట్టి జనాల్ని తెలివిగా బురిడీ కొట్టించి డబ్బు సంపాదించారు. ఇలాంటివి ఎక్కువకాలం సాగకపోయినా ఎక్కడిదక్కడేదక్కుడు.

♣

# గెలుపు పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన
హోతా పద్మినీదేవి నవల 'గెలుపు'పై మాకందిన
ఉత్తమ సమీక్షలు

## అన్యాయం పై న్యాయం గెలుపు

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

సమాజంలో పెద్ద మనుషుల ముసుగులో ఉన్న కొంతమంది హరిశ్చంద్రప్రసాద్ లాంటి వ్యక్తుల నిజస్వరూపాన్ని, చూసే వాళ్లకి మంచి మనుషులవలె కనిపించే సదాశివంలాంటి వ్యక్తుల వికృత మనస్తత్వాన్ని, అటువంటి వారిని ఎదిరించి బలైపోయిన ఇన్‌స్పెక్టర్ విజయ్ లాంటి నిజాయితీపరుల గురించి రచయిత్రి తనదైన శైలిలో ఎంతో నేర్పుతో పాఠకులకు అర్థమయ్యే విధంగా వివరించగలిగారు.




జ్వాలపాత్ర నేటి యువతరం మనోభావాలకి అద్దంపట్టేలా ఆవేశభరితంగా ఉండి పాఠకులను ఆకట్టుకుంది. రవి పాత్ర సంస్కారవంతంగా ఉంది. తనను అవమానించిన వారిని కూడా క్షమించగలిగిన గొప్ప మనసు అతనిది. మనమధ్యలోనే రవిలాంటి గొప్ప రచయితలు ఎందరో ఉన్నారు. అయితే వారికి సరైన అవకాశం లేక వెలుగులోకి రాలేకపోతున్నారు. ప్రతిమ తండ్రిని ఎదిరించి రవిని పెళ్లి చేసుకునే ధైర్యంలేక మనసులోనే కుమిలిపోయింది. ఆమె పాత్ర నేటి సగటు అమ్మాయిలకి ప్రతీకగా ఉంది. డబ్బు, కీర్తి ప్రతిష్టలు సంపాదించడంకోసం ఏమైనా చెయ్యడానికి వెనుకాడని స్వార్థపరుడు హరిశ్చంద్రప్రసాద్, అతని అడుగులకు మడుగులొత్తే సదాశివంలను చంపడం సినిమా ఫక్కీలో కనిపించినప్పటికి, డి.ఎస్పీలాంటి అవినీతిపరులైన ఉన్నతాధికారుల అండదండలు వీరికి ఉన్నంతకాలం ఇటువంటి నీచులను సాక్ష్యాధారాలతో చట్టంముందు దోషిగా నిలబెట్టడం సాధ్యంకాదు. అందుకే వీరికి మరణమే తగిన శిక్ష అనిపించింది.

సదాశివం కామాగ్నికి తులసి ఆహుతైపోవడం, భర్త చేస్తున్న అన్యాయాలను ఇక సహించలేక సుధేష్ణాదేవి అతన్ని చంపి తను ఆత్మహత్య చేసుకోవడం జాలి కలిగించే విధంగా ఉంది. ఇంక ఈ కథలో తరచు ఎమ్.పి గారి ప్రస్తావన వచ్చినప్పటికి అటువంటి కామాంధుడికి తగిన గుణపాఠం చెప్పకపోవడం వెలితిగా అన్పించింది. చివరకు అన్యాయం పై న్యాయమే గెలుస్తుందనే భావంతో చక్కటి ముగింపు నిచ్చారు. ఏదిఏమైనా సరళమైన పదజాలంతో నేటి సమాజంలో ఉన్న పరిస్థితులను కళ్లకు కట్టినట్లుగా వివరించిన రచయిత్రి అభినందనీయురాలు. ఇంత మంచి నవలను పాఠకులకు అందించిన చతురకు కృతజ్ఞతలు.


– ఎస్.బాలకృష్ణ
హుకుంపేట-534318

## ప్రజ్వరిల్లే జ్వాల

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

అనాథాశ్రమాల ముసుగులో ఘరానా మనుషులు సాగించే అకృత్యాలకు అద్దం పట్టిన నవల హోతా పద్మినీదేవి రచించిన 'గెలుపు'. ఎన్ని చట్టాలు వచ్చినా ఎందరు గొంతు చించుకున్నా సమాజంలో స్త్రీలపై అత్యాచారాలు దినదిన ప్రవర్ధమానం అవుతూనే ఉన్నాయి. పైకి అభ్యుదయ భావాలు వల్లిస్తూ, లోపల అనేక అరాచకాలకు రూప కల్పనలిచ్చే హరిశ్చంద్రప్రసాద్‌లాంటి అపర కీచకులెందరో నేటి సమాజంలో నిత్యపూజ లందుకొంటున్నారు. ఇలాంటివారిని పెంచి పోషించే ఎం.పి వంటి రాజకీయ నాయకులు, ఇటువంటివారి అడుగులకు మడుగులొత్తే డి.ఐ.జి వంటి అధికారులు ఉన్నంత వరకూ సంఘంలో స్త్రీకి రక్షణ ఉండదనే వాస్తవాన్ని నవల చక్కగా నిరూపించింది. పట్టెడన్నం కోసం ఈ దుర్మార్గుల పంచన చేరి వీరి అత్యాచారాలకు ఆహుతైన దుర్గ, సుమతి, తులసి, జయలక్ష్మి లాంటి సమిధలు ఇంకెందరో? అని ప్రతి వారినీ ఆలోచింపచేశారు రచయిత్రి. ఎందరో అభాగినులు సరోజ (సుస్మితాసేన్), మాధవి (సిల్క్‌స్మిత)లుగా మారడానికి కారణమేమని ప్రశ్నించుకొంటే సభ్యసమాజం తల దించుకోక తప్పదు.

సంఘసేవ ముసుగులో అకృత్యాలకు పాల్పడుతున్న ఒక సంఘ విద్రోహి నిజ స్వరూపాన్ని బయటపెట్టే ఉద్యమం ప్రారంభించిన జ్వాల నిజంగానే ఒక ప్రజ్వరిల్లే జ్వాల. సంఘ విద్రోహ శక్తులను ఎదుర్కొనే ఏ మహిళ అయినా వారి కర్కశ హస్తాలలో నలిగి నాశనమైపోతుందనే మూస సిద్ధాంతాన్ని విడనాడి, ఆమె ఆ ఇంటి కోడలై గెలుపు సాధించినట్లుగా చూపడం రచయిత్రి సాధించిన మంచి మలుపు. రాచరికపు పరదాల చాటున పుస్తకాలే స్నేహితులుగా మిగిలిపోయిన సుధేష్ణా దేవి పాత్ర ముగింపు కూడా ఉదాత్తంగా ఉంది.

అప్పటిదాకా రవిని చీదరించుకున్న కాత్యాయని ఉన్నట్టుండి మారిపోయి ఆప్యాయత కురిపించడం, కన్య అయిన జ్వాలకు వైద్యులు కు.ని ఆపరేషన్ జరపడం అసహజంగా ఉన్నాయి. రౌడీల బారిన పడిన జ్వాలను చిట్టచివరి క్షణంలో విజయ్ కాపాడటం, రౌడీలు ఇన్స్‌పెక్టర్‌ను హత్య చేయడం లాంటివి సినిమా సన్నివేశాలను పోలివున్నాయి. ఏదిఏమైనప్పటికీ ఆడది అబలకాదు సబల అని నిరూపించడానికి చేసిన ప్రయత్నంలో సఫలీకృతులైన రచయిత్రి హోతా పద్మినీదేవి అభినందనీయులు.

– టి.పి.శ్రీధర్
గూడూరు-524101

## కలియుగ దుశ్శాసనులు

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

స్త్రీల అసహాయతను అలుసుగా తీసుకొని వారి జీవితాలు నాశనం చేసిన మానవ మృగాల ఉదంతం ఇది. యుగాలు గడుస్తున్నా ఆడది ఆడదే. ఆమె తల్లిగా, చెల్లిగా, భార్యగా తన బాధ్యతను ఎంత నిర్మలంగా, నిస్వార్థంగా నిర్వర్తిస్తున్నా అడుగడుగునా ఆమెకు అనుమానాలు, అవమానాలే ఎదురవుతున్నాయి. నేడు స్త్రీలపై జరుగుతున్న అక్రమాలను, అన్యాయాలను కళ్ళకు కట్టినట్లు తెలియచేసిన రచయిత్రి 'హోతా పద్మినిగారికి' మా ధన్యవాదాలు. ఆశ్రయం కోరి అనాధశరణాలయంకి వచ్చే ఆడపిల్లలకు ఆశలు చూపించి తన పశువాంఛను తీర్చు

కొనే సదాశివంలాంటి కామాంధులు ప్రస్తుత సమాజంలో లేకపోలేదు. తులసిలాంటి చిన్నారి మొగ్గలను వారి కామదాహానికి బలి చేసిన సదాశివంలాంటి దురాత్ములను న్యాయస్థానం శిక్షించినా, ఆ శిక్షలు చాలవు.

గొప్ప ఆదర్శవంతుడిగా, సంఘ సంస్కర్తగా నటిస్తూ తన వ్యాపారాభివృద్ధి కోసం ఎందరో అనాధ స్త్రీల జీవితాలను నాశనం చేసిన హరిశ్చంద్ర ప్రసాద్‌లాంటి మేకవన్నె పులులను ఏం చేసినా పాపం లేదు. కథలో సుధేష్ణాదేవి పాత్ర ఎంతో ప్రశంసనీయంగా ఉంది. స్త్రీ వ్యామోహితుడైన భర్తను మార్చలేక మౌనంగా అతని దురాగతాన్ని భరిస్తూ, జీవితాన్ని నాలుగు గోడల మధ్య గడుపుతూ, భర్త ప్రభావం పిల్లలపై పడకుండా వారిని జాగ్రత్తగా పెంచింది.

శరణాలయం మిష్టరీని ఛేదించడంలో జ్వాల తన వంతు బాధ్యతను ఎంతో ధైర్యంతో, నేర్పుతో నిర్వర్తించిన తీరు చాలా బాగుంది. తల్లిదండ్రులు చేసిన తప్పులు పిల్లలపై ప్రభావం చూపుతాయి అనడంలో ఎంత నిజముందో ఈ కథలో హరిశ్చంద్ర ప్రసాద్ పిల్లలైన ప్రతిమ, రామచంద్రలని చూస్తే అర్థమైంది. పెళ్ళయిన మూడునాళ్ళకే ప్రతిమ భర్తను పోగొట్టుకోవడం ప్రాణప్రదంగా ప్రేమించిన భార్యను రామచంద్ర కోల్పోయిన తీరు మొదలయినవి. కులం కాదన్న ఒక్క కారణంగా కోడలు ఇందుమతిని అతిదారుణంగా చంపడం హరిశ్చంద్ర దుర్మార్గానికి మరో నిదర్శనం. తాత్కాలికంగా దూరం అయిన ప్రతిమ, రవి చివరికి ఒక్కటవడం చాలా బాగుంది. ఎందరో ఆడవాళ్ళ ఉసురుపోసుకున్న హరిశ్చంద్ర చివరికి భార్య చేతుల్లో అంతం కావడం కథకి సరి అయిన ముగింపు. స్త్రీలు తమ సమస్యలను ధైర్యంగా ఎదుర్కోవాలి, అబలలుగా అణిగి ఉంటే అధఃపాతాళంకి తొక్కబడతారు. ఇలాంటి కథలవల్ల అయినా స్త్రీలలో చైతన్యం వస్తే ఇలాంటి కలియుగ దుశ్శాసనులను ధైర్యంగా ఎదుర్కోగల్గుతారు.

– వి. కృష్ణప్రియ
చీపురుపల్లి

## మనసులేని చోట!

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మన సమాజంలో అడుగడుగునా హరిశ్చంద్రప్రసాద్‌లు వున్నారు. ఈ రచన వ్యక్తి యొక్క బాహ్య రూపానికి, అంతర రూపానికి మధ్యగల సంబంధాన్ని ఎండగట్టింది. చాలా చక్కటి రచన. ఇరువురి మనసులు కలిసిన పెళ్ళే నిజమైన పెళ్లి అని హరిశ్చంద్రప్రసాద్ గుర్తించకుండానే అనంతవాయువులో కలసిపోయాడు. పిల్లల నిర్ణయాలకు పెద్దవారు సానుకూలంగా స్పందించక అతిగా ఆలోచిస్తే చివరకు ప్రాణాలే వదిలివేయవలసి వస్తుందని రచయిత్రి చక్కగా వర్ణించారు.

ఏ విషయాన్నయినా డబ్బుతో, స్వార్థంతో కాక మనసుతో ఆలోచిస్తే హరిశ్చంద్రప్రసాద్ చనిపోవలసిన అవసరమే వుండేది కాదు. మనసులేని చోట డబ్బుంటే అది నరకం. ఈ కథ చదివాక ఈ సమాజంలోని హరిశ్చంద్రప్రసాద్‌లు మారితే రచయిత్రి పడ్డ కష్టానికి సార్థకత లభిస్తుంది.

యువకుడైన ఇన్‌స్పెక్టర్ అవినీతికి వ్యతిరేకంగా చేసిన పోరాటంలో ప్రాణాలనే వదిలివేయవలసి రావటం పెద్ద చేప చిన్న చేపను మరొక జాతి పెద్ద చేపకు ఆహారం అందించినట్టుంది. ఇది చాలా వాస్తవిక చిత్రణ. సమాజంలో అడుగడుగునా జరుగుతున్న నేటి భారతం ఇది. కాని రేపటి భారతం మారాలి. అందుకు రచయిత్రి చేసిన కృషి అభినందనీయం.

పాత్రలన్నీ సందర్భోచితంగా వున్నాయి.

ఆసక్తికరంగా చదివించిన ఈ రచన సైకాలజి స్టూడెంట్స్‌కి ఎంతగానో ఉపయోగపడుతుందనటం అతిశయోక్తికాదు.

– కె.అప్పారావు

మలికిపురం-533253

## సినిమా ఫీలింగ్

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఈ నెల చతురలో 'గెలుపు' నవల మాలో కొత్త ఆసక్తిని కలిగించింది. సమాజసేవ ముసుగులో హరిశ్చంద్రప్రసాద్ చేసిన దారుణాలు కేవలం నవల అని తెలిసినా నరాలు బిగబట్టి అసలు హరిశ్చంద్రప్రసాద్‌ను చంపాలి అన్నంత ఆవేశంగా కథను చదివించింది. యవ్వనం ఆశపై జీవిస్తుంది అని రవి పాత్ర ద్వారా చక్కగా వివరించారు. కానీ వృద్ధాప్యం గతస్మృతులపై జీవిస్తుంది అని హరిశ్చంద్రప్రసాద్ భార్య సుధేష్ణాదేవి ద్వారా నిరూపించారు. విజ్ఞాన సముపార్జన మానవుడికి పూర్తి స్వేచ్ఛను ఇస్తుంది కానీ ప్రతిమ విషయంలో అది అబద్ధం అయింది. అంత చదువుకొని తను ప్రేమించిన రవిని రెండోపెళ్లి చేసుకోవడం విచిత్రంగా ఉంది. పాత్రలు తీర్చిదిద్దిన తీరు, సందర్భానికి అనుగుణంగా ధారాపాతంగా ఆసాంతం లేవకుండా చదివించేలా చేసింది. పగలబడి నవ్వటం మనిషి నిష్కల్మషమైన మనస్సును సూచిస్తుంది. దానికి సూచనే సుస్మితాసేన్. కిరీటం అలంకరించుకున్న శిరస్సు సుఖాలకు దూరం కావల్సి వస్తుందని విజయ్‌ను చూసి అనుకున్నాం. ఎంత ఉపయోగించినా తరగని సాధనం విజ్ఞానం. అందుకు రవి రచనలే సాక్ష్యంగా నిలుస్తాయి. హరిశ్చంద్రప్రసాద్ కేవలం తనను గురించి ఆలోచించే మానవుడు, అందుకే దానవుడయ్యాడు. అందరి గురించీ ఆలోచించే జ్వాల మహానుభావురాలు అయింది. హరిశ్చంద్రప్రసాద్‌కు ఉన్న స్వార్థం, సంకుచితత్వం, అవినీతికి ఆజ్యం పోసింది. నిజాయితీగా సంపాదించిన డబ్బు కోట్ల రూపాయలకన్నా ఎక్కువ ఆనందాన్ని, సంతృప్తిని ఇస్తాయని విజయ్‌ను చూస్తేనే తెలుస్తుంది. అసలు పాత్రలు మా కళ్లముందు కదులుతున్నట్లుగా ఉంది. ఒక సినిమా చూసిన ఫీలింగ్ కలిగింది. కష్టానికి తగిన ఫలితం ఆలస్యంగానైనా సంపాదించిన జ్వాల అభినందనీయురాలు. రామచంద్ర శాంతంగా, నిబ్బరంగా ఉన్నా నిజమైన శక్తికి నిదర్శనం. మనిషిలోని వ్యక్తిత్వాన్ని కష్టకాలం నిర్ణయిస్తుందని నిరూపించిన గెలుపు అందరినీ ఆలోచింపచేసింది. నేటి స్పీడ్ యుగంలో అసలు నవలలు చదివే తీరిక లేక చాలామంది బుల్లితెరకు బుర్రను అంకితం చేసి బుర్రలో బకెట్లకొద్దీ చెత్తను నింపుకొంటున్నారు. అసలు ఊహాశక్తిని హరించి వేసే స్మాల్ సేవియర్‌నుంచి పుస్తకంలోకి చూసేటట్లు చేసింది ఈ నవల. ఒక మంచి పుస్తకం ఎన్నటికీ మోసం చేయదు.

–బి. నవీన్‌కుమార్

కొడకండ్ల-506 222

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad.
Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149;
Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044- 2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78



ఈసారి వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్, ఏ వంటకమై
వండాలనుకున్నప్పుడు సంసిద్ధంగా ఉండే 'ప్రియ' వారి శ్రేష్ఠమైన అ
వెల్లుల్లి, చింతపండు పేస్ట్‌లను వాడండి. అత్యంత పరిశుభ్ర పరిసరాల
అత్యుత్తమ పదార్థాలతో తయారు చేసిన పేస్ట్‌లు ఇ
మీ ఇంటి రుచులను మైమరపించే
ఈ ప్రియ రుచుల్ని ఆస్వాదించండి.

priya
Culinary Paste

# అత్యుత్తమ పదార్థాలు నోరూరించే రుచులు!

priya Tamarind Paste
priya Ginger & Garlic Paste
priya Ginger Paste
priya Garlic Paste

• అల్లం మిశ్రమం • అల్లం-వెల్లుల్లి మిశ్రమం • వెల్లుల్లి మిశ్రమం • చింతపండు మిశ్రమం